# రుద్రగణిక



రచన
డాక్టర్ నటరాజ రామకృష్ణ

ప్రచురణ
పేరిణి ఇంటర్‌నేషనల్
అశోక్‌నగర్, హైదరాబాదు - 20

# రుద్రగణిక

సాంఘిక అనాచారాలకు అనాదినుండి ఆహుతులైన కళాకారుల దుస్థితికి నా హృదయం తపించింది. నా ఆ యావేదనే ఈ "రుద్రగణిక" రూపందాల్చింది. నా జన్మ తరించింది.

హృదయమున్న ఓ కళాభిమానుల్లారా! దీనిని స్వీకరించండి. పూర్తిగా చదవండి. ఆపైన మీలో ఇంకా ఏమైనా కన్నీరు మిగిలి యుంటే ఈ మూగజీవుల గురించి కన్నీటి బొట్టు రాల్చండి చాలు.



# మొదటి మాట

మానవునికి గల గొప్ప దుర్బలత్వం మరపు. మంచినే తొందరగా మరిచిపోతాడు. తనకు మేలు చేసిన వారినే మరీ వేగంగా మరిచి పోతూ ఉంటాడు. కళకే కాక సమాజానికూడా ఎంతో మేలు చేసిన ఒక మహనీయ మానవ మూర్తిని మీ జ్ఞప్తికి తీసికొని రావడానికే ఈ మాట వ్రాస్తున్నాను.

— నటరాజరామకృష్ణ

# డాక్టర్ శ్రీమతి ముత్తులక్ష్మి రెడ్డి

రష్యా ప్రజలు విజయం సాధించారు. రష్యాలో విప్లవం ముగిసింది. తర తరాలుగా బానిసలుగా జీవిస్తూ వచ్చిన పీడిత రష్యా ప్రజలకు దాస్య విమోచనం కలిగింది. వారి హృదయాలలో కొన్ని శతాబ్దులుగా పేరుకొనిపోయి గడ్డకట్టిన వారి దుఃఖం, కోపం కట్టలు తెంచుకొని వరదలై పారినందు వల్లనే అక్కడ విప్లవం చెలరేగింది.

ఆనాడు వారు నిస్సహాయులు. అందువల్లనే వారి జీవితాలతో ఆనాటి ప్రభువులు, పాలకులు ఆడుకొన్నారు. ప్రజలు కూడా మనుషులేనని, వీరికి మనసు ఉంటాయని, ఆశలూ, ఆదర్శాలూ ఉంటాయని ఆనాటి ప్రభువులు ఆలోచించలేదు. తమ స్వార్థ ప్రయోజనాల కోసం ప్రజలను కీలు బొమ్మలుగా వాడుకొన్నారు. ఈ విషయాన్ని ప్రజలు గ్రహించి ప్రభువుల మీద తిరగబడ్డారు. విజయం సాధించారు, జారు ప్రభుత్వం పతనమైంది.

ఆ కోటల్ని, ఆ కోటల్లోని రాజమందిరాలని, వాటిలోని అంతఃపురాల్ని, సుందర శిల్పాల్ని అంతవరకు అనుభవించడమే కాదు కనీసం కంటితో చూడని ఆ సామాన్య ప్రజల రక్తమాంసాలను ప్రభువులైన కొందరు ప్రభువులు పీల్చి, వారిని పిప్పి చేసి, ఈ దివ్య భవనాలలో విలాసంగా తమ జీవితాలను గడిపారు అని ఆ ప్రజలు భావించి, నమ్మి ప్రభువులపై తిరగబడ్డారు. ప్రభువులు ఆ విప్లవంలో మడిసారు ఆ ప్రజలు ఎవరి మీద వారి కసిని తీర్చుకోగలరు? ఆ ప్రభువులపై నడిన వారి కోపం ఆ ప్రభువుల భోగభాగ్యాలపైకి మరలింది. వారి కోటలను ధ్వంసం చేశారు. వారి విలాస వస్తువులను నాశనం చేశారు. సుందరశిల్పాలను, చిత్రలేఖనాలను అగ్నికి ఆహుతిచేశారు. రాజసౌధాల్లో ఎక్కడ చూసినా విధ్వంసకాండ చెలరేగింది. అలాంటి సమయంలో కొందరు మేధావులు, పెద్దలు లెనిన్ మహాశయుని వద్దకు వెళ్ళి "మహాశయా! ఇదంతా ఏమిటి? మనం ప్రభువుల మీద తిరుగుబాటు తీసికొని వచ్చింది ఈ విధ్వంసం కోసమేనా? మన

దేశంలోని సుందర మందిరాలు, సుందర శిల్పాలు మొదలైన వన్నీ నాశనమైపోతే మనకేం లాభం? ఆపుచేయించండి మహాశయా!" అని వాపోతూ వేడుకొన్నారు.

లెనిన్ మహాశయుడు వారి ఆవేదనను గ్రహించి, "ఈ ప్రజలు అమాయకులు, వారు చాలా కోపంతో ఉన్నారు. వారికి ఇప్పుడు మంచీ చెడ్డా తెలియదు. కొద్ది రోజుల్లోనే వారి కోపం చల్లారిపోతుంది. వారికప్పుడు విచక్షణా జ్ఞానం వస్తుంది. ఈ సుందర భవనాలు ఉండినచోటనే ఇంతకన్నా మంచి దివ్య సౌధాలను వారు నిర్మించగలరు. వారు ప్రజా సంస్కృతి ప్రతిబింబాలను రూపొందించగలరు" అని ప్రశాంతంగా సమాధానం చెప్పాడు.

ఆయన చెప్పినట్టే జరిగింది. ప్రాచీన సంస్కృతి పూర్తిగా నాశనం కాకముందే ఆ విప్లవకారుల కోపం శాంతించింది. కొత్త పాత మేలికలియకలతో ఒక ఉత్తమ నూతన, ప్రజా సంస్కృతి అక్కడ వెలిసిందని రష్యాదేశం పర్యటించిన నేను ఒక కళాకారునిగా గ్రహించాను నేనేకాదు ఏ కళాకారుడైనా ఈ విషయాన్ని గ్రహించగలడు.

శ్రీమతి ముత్తు లక్ష్మిరెడ్డిగారు తీసికొని వచ్చిన దేవదాసీ చట్టం ఈ రష్యా విప్లవం వంటిదే. ఈమె హృదయం నవనీతం. ఆమె గొప్ప విద్యావంతురాలేగాక గొప్ప సంస్కారవంతురాలు. ఆమె భర్త ఒక మహాపురుషుడు.

ఆదినుండి మనదేశంలోని కొందరు స్త్రీలు వారి జీవితాలను కళకు అర్పిస్తూ వచ్చారు. అయితే వారు అనుభవిస్తూండిన పడరానిపాట్లకు, అవమానాలకు శ్రీమతి ముత్తు లక్ష్మిరెడ్డిగారి హృదయం ద్రవించింది. "అంబను అమ్మగా ఆరాధించే ఈ హైందవజాతిలో ఆ అంబ బిడ్డలను, ఆ యమ్మను తమ కళలతో ఆరాధించే ఆమె ఆడబిడ్డలను, తమ జీవితాలను ఆ కళలకు అర్పించిన ఆ కళా జీవులను గౌరవించకుండా ఈ సంఘం ఎంత చిన్నచూపు చూస్తున్నది? ఏమిటి వింత?" ఇదే శ్రీమతి ముత్తులక్ష్మిగారి ఆవేదనగా ఉండేది.

నేడు దక్షిణాది నాట్యకళ గురించి వ్రాసేవారిలో చాలామంది సర్గీయ ఈ కృష్ణయ్యరు, శ్రీమతి రుక్మిణీ అరుండేలు గురించి, ఇంకా ఇతర నాట్యకళా

వేత్తల గురించి, ప్రస్తావిస్తూ ఉంటారుగాని శ్రీమతి ముత్తులక్ష్మి రెడ్డిని గురించి ఆమె తెచ్చిన చట్టం గురించి మాట మాత్రంగానైనా ముచ్చటించరు. ఈమె కళలకు ఒనగూర్చిన మేలును గూర్చి తెలియజేయరు.

ఆనాటి కళాకారులకు ఆమె చేసిన మేలును గురించి ఈనాటి కళాకారులకు తెలియజేయాలన్న ఉద్దేశ్యంతోనే ఈ మొదటి మాటను వ్రాస్తున్నాను.

ఈ యమ్మను నేను నా చిన్నప్పుడు ఎరుగుదును. ఆమె భర్త శ్రీ రెడ్డిగారిని గూడా ఎరుగుదును. వీరికి ఇద్దరు కుమారులు. వీరిలో పెద్దవానితో నాకు పరిచయ ముండేది గాని స్నేహం లేదు. రెండవ కుమారుడు శ్రీ కృష్ణమూర్తితో నాకు స్నేహ ముండేది. కన్న కుమార్తెలు ఆమెకు లేరుగాని సమాజంలో మోసగింపబడ్డ ఆడపడచులందరూ ఆమె కుమార్తెలే. తమిళనాడులో నుండిన ఒక గొప్ప యోగిని అవ్వయ్యార్ పేరిట ఈమె ఒక "అవ్వాయి హోమ్"ను స్థాపించారు. ఈ యనాథ శరణాలయంలో అనేకమంది అభాగ్యజీవులను చేర్చుకొని వారి చీకటి బ్రతుకులకు వెలుగును ప్రసాదించారు. ఈ యనాథలకు ఆమె బాసటగా, వెలుగు బాటగా నిల్చారు. ఈ యమ్మది అమృత హృదయం. నేను ఆమెను దర్శించు కొన్ననాటికే ఆమె వృద్ధురాలు. ఆమె చిన్న పిల్లలను కూడా ప్రేమతో ఎంతగానో ఆదరించేవారు తల్లినే మరిపించేవారు ఆమె ప్రేమను చవిచూసిన వారికే ఆమె ప్రేమ అర్థమవుతుంది. ఆమె స్థాపించిన అవ్వాయి హోంలో ఉండి, చదువుకొని, ఉన్నత పదవులకు వచ్చిన వారెందరో నేడు ఉన్నారు. వారిలో కొందరు ఉత్తమ జీవితాలను గడుపుతున్నారు.

ఈ యమ్మ రామకృష్ణా మిషన్లో సభ్యులుగా ఉండేవారు. ఈ మిషన్ ఆదర్శాలు ఆమెకు బాగా నచ్చాయి. అందువల్ల ఆమె తరచుగా ఈ మిషన్‌కు వచ్చి స్వామిజీలను దర్శించి వెళ్ళేవారు మమ్మల్ని ఆప్యాయంగా పలకరించి, వెళ్ళేవారు. కొన్నాళ్ళు నా సోదరి శారద ఆమె వద్ద ఉండి, చదువుకొంది. అందువల్ల నాకు ఆమె వద్ద చిన్నప్పుడు చనువు ఏర్పడింది. నేను ప్రతివారం ఒక్కసారైనా వెళ్ళి ఆమెను దర్శించి వచ్చేవాణ్ని. శ్రీ రెడ్డిగారికి కూడా నా యెడల వాత్సల్యం ఉండేది.

నాకు ఒకసారి అర్థ సంవత్సరం పరీక్షల లెక్కల్లో నూటికి నూట ఇరవై రెండు మార్కులు వచ్చాయి. ఆమెతో యీ విషయం చెప్పేవరకు నా సంతోషం ఆగలేదు. ఆమె నన్ను ప్రేమతో అభినందించి, ఇంకా బాగా చదువుకోమని చెప్పారు. ఈ విషయం ఆమె రెడ్డిగారికి చెప్పి, నన్ను ఆయన సరసన కూర్చొ పెట్టి మిఠాయి పెట్టారు. తల్లిదండ్రులను విడిచి దూరంగా రామకృష్ణా మిషన్‌లో ఉన్న నాకు ఆమె మాతృమూర్తిగా కనిపించేవారు. నావంటి వారిని ఇంకా ఎంత మందినో ఆమె ఆదరించారు. వారి జీవితాలలో ఆనందజ్యోతులు వెలిగించారు. వివేకానందులు వారు చెప్పినట్టు ఆమె ప్రతి మానవునిలోను మాధవుణ్ని చూసే వారు. ఆమె ఒక మహత్తరమహనీయ వ్యక్తి.

నేడు ప్రపంచ ప్రఖ్యాతిగాంచిన, ప్రపంచమంతా భరతనాట్యం పేరుతో ప్రచారమౌతున్న తంజావూరు నాట్యంగురించి పెద్దలెందరో ఉపన్యాసాలు ఇస్తూ ఉంటారుగాని శ్రీమతి ముత్తులక్ష్మిరెడ్డిగారి గురించి ఒక్క చిన్నమాటను గూడా ప్రస్తావించరు సరిగదా ఆమె నాట్యకళకు వ్యతిరేకి అని గూడా అంటారు.

శస్త్రచికిత్స అవసరమైనప్పుడు శస్త్రవైద్యుడు నిర్దాక్షిణ్యంగా మన శరీరంలో ఆ భాగాన్ని కోస్తాడు. అప్పుడు తాత్కాలికంగా మనకు బాధ కలిగినా దాని సత్ఫలితాన్ని తర్వాత మనం అనుభవించి ఆనందిస్తాం. అదే విధంగా ఆమె యీ కళ విషయంలో శస్త్రచికిత్స చేశారు ఊహించలేనంత, చెప్పనలవి కానంత మేలు నాట్యకళకు జరిగింది. ఆమె నాట్యకళను వ్యతిరేకించలేదు, ఆనాటి సాంఘిక దురాచారాలను వ్యతిరేకించారు. ఆమె ఆనాడు ఆ చట్టాన్ని ప్రతిపాదించకుండా యుండియుంటే ఈనాడు అన్ని కులాలవారు ఈ నృత్యకళను ఇంతగా అభ్యసించి ఉండేవారు కారు. ఇంతమంది కళాకారులు భారతదేశంలో తయారయ్యేవారు కారు. ఈ నాట్యకళకు ప్రపంచంలో ఇంత పేరు ప్రఖ్యాతులు వచ్చేవి కావు.

పూర్వం నాట్యకళారాధనకే తమ జీవితాలను అంకితం చేసిన కొంత మంది జీవితాలు దుర్భరంగా ఉండేవి. వారి సౌందర్యం, వారి ఆటపాటలు, వారి తెలివితేటలు, వారి కవితా ప్రవచనాలు కొంతమంది రసికహృదయులకు అవసర మయ్యేవి. వీటిని పూర్తిగా అనుభవించేవారు. కాని సంఘంలో వారు నీచులుగా చిత్రీకరింపబడ్డారు. ఇదీ వారికి దక్కిన ప్రతిఫలం. అది ఆనాటి సాంఘిక

వ్యవస్థ. ఈ సాంఘిక వ్యవస్థను చూచి శ్రీమతి ముత్తులక్ష్మిరెడ్డిగారి హృదయం ద్రవించిపోయింది. అందువల్లనే ఆమె దేవదాసీ చట్టాన్ని చేపట్టారు. దేవాలయాల్లో ఆ దేవాలయాలకు అర్పించబడిన కొందరు స్త్రీలు నృత్యపూజ చేసేవారు. ఈ ఆచారాన్ని ఆమె అరికట్టాలనుకొన్నారు. కొందరు స్త్రీలను గుడికి అర్పించే విధానాన్నే అరికట్టాలని ఆమె అనుకొన్నారు. ఈ స్త్రీలు నృత్యకళను ఆరాధించకపోయినా ఫరవాలేదు. వారు తోటి స్త్రీలతో కలిసి గౌరవంగా జీవించాలన్నదే ఆమె ధ్యేయం.

ఈ కళారాధనను ఒక ప్రత్యేక కులంవారికే ఎందుకు పరిమితం చేయాలి? కులాల ననుసరించి కుల విద్యను కుల వృత్తిగా చేపట్టాలన్నది పాత కాలపు వ్యవస్థ. అందరూ అన్ని వృత్తులను చేసికొంటున్న ఈ ఇరవయో శతాబ్దిలో దేవదాసీలు మాత్రమే ఈ నత్యకళకు వృత్తిపరంగా ఎందుకు కట్టుబడి ఉండాలి? ఇతర వృత్తుల్లాగే ఈ వృత్తినిగూడా అందరూ ఎందుకు చేపట్టకూడదు?

నాట్యకళ ఉత్తమమైనది, సంపూర్ణమైనది. సంగీత సాహిత్యాల సమ్మేళనంతో మానవ హృదయ భావాలను వ్యక్తీకరించే కళ, మోక్ష సాధనకు దగ్గిర మార్గం అని పెద్దలు యీ కళను కొనియాడుతూ ఉంటారు కనుక ఇటువంటి కళ ఏ కొద్దిమందికో పరిమితం కాకూడదు. అందరూ ఆరాధించాలి. కాని పూర్వం ఇలా జరగలేదు. అందుకే ఆమె దేవదాసీ చట్టాన్ని తీసికొని వచ్చారు. దీంతో దేవాలయాల్లో నృత్యపూజలు అంతమొందాయి. ఆమె నాట్యకళకు వ్యతిరేకి అని విమర్శలు వచ్చాయి. వాటికి ప్రతివిమర్శలు వచ్చాయి. అదొక చిన్న యుద్ధంగా పరిణమించింది.

ఆ తర్వాత ఈ కళకుగల పవిత్రతను చాలామంది గుర్తించి తమ బిడ్డలకు నాట్యకళను నేర్పించారు, నేడు నేర్పిస్తున్నారు, దీనిని ప్రచారం చేస్తున్నారు. ఈ ప్రచారానికి నేనూ చాలా కృషి చేశాను. అయితే ఈ కళలోగల పరమార్థాన్ని ఎంతమంది నిజంగా అర్థం చేసుకున్నారో నేను చెప్పలేను.

శ్రీమతి ముత్తులక్ష్మిరెడ్డిగారు మానవునిలో మాధవుణ్ణి చూసిన మహా వ్యక్తి. మానవుణ్ణి మాధవునిగా గౌరవించాలని అభిలషించిన అమృత హృదయిని. ఆమెవల్లనే నాట్యకళకు యీ నాడు ఉన్నత దశ వచ్చింది. అందుకే ఆమెను ఈ "రుద్రగణిక"లో ముందుగా నేను స్మరిస్తున్నాను.

—నటరాజ రామకృష్ణ

# సమర్పణ

సర్వమానవ హితైషులైన డాక్టర్ పోలవరపు వేంకటసుబ్బారావు గారు జన్మతా కడు బీదవారు. కష్టపడి స్వయం కృషితో వైద్య విద్యను అభ్యసించి డిగ్రీ పొందారు.

గాంధీజీ పిలుపుకు స్పందించి క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని కారాగార శిక్షను అనుభవించిన స్వాతంత్ర యోధులు ఈయన. వీరి అర్ధాంగి స్వర్గీయ శ్రీమతి లలితా కామేశ్వరమ్మగారు స్వాతంత్ర్యయోధుల ఇంటి ఆడపడచు.

వీరు పరమ శైవ భక్తులు, తమ తండ్రిగారి స్మృతి చిహ్నంగా తిరుమల కొండపైని ఒక కాటేజీ కట్టించారు. భార్య జ్ఞాపకార్థం ఒక కల్యాణ మండపాన్ని తల్లి గారి స్మారక చిహ్నంగా ముఖ మండపాన్ని శివరామ కృష్ణ క్షేత్రం లోని శివాలయంలో నిర్మించారు. మంగళగిరి క్షేత్రంలో లక్ష్మీనరసింహస్వామి వారి రథశాలను, అక్కడి ధర్మశాలను బాగు చేయించి, కట్టించారు. ఇంకా అనేక శివాలయాల్లో ముఖ మండపాలను, ధ్వజస్థంభాలను నిర్మించారు. విజయవాడలోని హనుమంతరాయ గ్రంథాలయంలో ప్రేక్షకులకు ఒక బాల్కానీని కట్టించారు.

వీరు దీన జన బాంధవులు. నోరు తెరిచి అర్థించినా ఎవరూ కళాకారులకు దానం చేయని ఈ రోజుల్లో ఎందరో కళాకారులకు, కళాసంస్థలకు గుప్తదానం చేసిన కళాహృదయులు డాక్టర్ సుబ్బారావు గారు. ఈయన ఎంతో మంది బీద విద్యార్థులకు ధనం సహాయంచేసి చదివించారు. కులమత భేదాలు లేకుండా సర్వజనులకు సహాయపడగల మానవహితైషి ఈయన. ఈ యుదార స్వభావునికి, దానశీలునికి ఈ రుద్రగణికను సమర్పించడం సముచితమని భావించి సమర్పిస్తున్నాను.

– నటరాజరామకృష్ణ

# సమర్పణ



డాక్టర్ పోలవరపు వెంకటసుబ్బారావుగారికి

# స్వ విషయం

నా బాల్యం మదరాసు రామకృష్ణా మిషన్లో గడిచింది. స్వామీ శాశ్వ తానంద నా బాల్యజీవితాన్ని తీర్చిదిద్దారు. ఆదర్శవంతంగా జీవించడం ఆయనే నాకు నేర్పారు.

సాంఘికంగా, కళాత్మకంగా, ఆర్థికంగా, రాజకీయంగా ఒక నూతన దృక్పథాన్ని దక్షిణాదిలో తీసికొని రావడానికి రామకృష్ణామిషన్ ఎలా దోహదం చేసిందో మనం తెలుసుకోవడం అవసరం. కనుక రామకృష్ణా మిషన్లోని నా బాల్య జీవితాన్ని కొద్దిగా వివరిస్తాను.

నాకు జన్మనిచ్చిన తండ్రి వేరైనా, నన్ను పెంచి, పెద్దజేసి, నా జీవి తాన్ని సక్రమ మార్గంలో పెట్టిన పితృసమానులు స్వామీ శాశ్వతానందగారు. ఆయన అమృతహృదయుడు. సుభాష్‌చంద్ర బోస్‌లాగ గంభీరంగా కనిపించినా ఆయన మనస్సు నవనీతం. నాది విప్లవతత్వం గల మనస్సు. నా మనస్సును వారు బాగా అర్థం చేసికొన్నారు. అందుకు తగ్గట్టుగా వారు నన్ను చూసే వారు. పూర్ణ విశ్వాసంతో మా తండ్రిగారు నన్నాయనకు అప్పగించారు. కనుక స్వామిజీ ఒక సర్వసంగ పరిత్యాగే అయినా నన్ను ఒక ఉత్తమ పౌరు నిగా తీర్చిదిద్దవలసిన బాధ్యత ఆయనపైని పడింది.

ఆయన అనుభవజ్ఞులు గనుక నే నేదైనా ఒక పని చేస్తానంటే దానిలోని మంచి చెడ్డలను నాకు ముందుగా చెప్పి నన్ను వారించేవారు. అయినా నేను మొండిపట్టు పడితే ఆ మంచి చెడ్డలను నేను అనుభవపూర్వకంగా తెలిసికొనేటట్టు నాకు స్వేచ్ఛ నిచ్చేవారు.

ఒక సారి నాకు తిరువణ్ణామలై వెళ్లాలన్న బుద్ధి పుట్టింది. అక్కడ తేజో మూర్తి అయిన శివుని ఆలయం ఉంది. ఆ యాలయమంతా ఒక్క అంగుళం ఖాళీ లేకుండా అద్భుతమైన శిల్పాలున్నాయి. వాటిని చూడాలని నాకు కోర్కె కలిగింది తర్వాత రమణ మహర్షిని గూడా చూడవచ్చునని నా ఆశ. స్వామిజీ నేను అక్కడకు వెళ్లడానికి అనుమతి ఇచ్చారు కాని భోజన సమయానికి తిరిగి వచ్చేయ మన్నారు. "ఎందుకు అంత త్వరగా తిరిగి రావాలి?" అని ఆయన్ను ఎదురు ప్రశ్న వేశాను. "నీకు అక్కడి భోజనం సరిపడక పోవచ్చును" అన్నారు. "సరిపడకపోవడ మేమిటి? సర్దుకొంటాను నేనేం పెళ్ళి భోజనానికి, విందుకు వెళ్తున్నానా? ఈ స్వామిజీ ఎప్పుడో ఏదో ఒకటి ఇలాగే అంటూ ఉంటా"రని మనస్సులో అనుకొని బయలు దేరాను.

తేజో లింగమూర్తిని ముందుగా దర్శించాను ఆలయంలోని సుందర శిల్పాలను చూశాను. అవి నాతో ఎన్నో విషయాలు మాట్లాడాయి. తర్వాత రమణ మహర్షిగారి దర్శనం చేసికొన్నాను. ఆ పవిత్ర తేజోమూర్తిని చూస్తూ అలా ఉండి పోయాను.

తెలుగు, తమిళం, హిందీ, మళయాళం ఇంకా వివిధ భాషలను మాట్లాడు తున్న వారు, వివిధ జాతులవారు ఆ మహర్షి దర్శనం చేసికొంటున్నారు. వారి సంభాషణలు వింటూ వారిని చూస్తూ ఉన్నాను. అలా ఎంత సేపు ఉండిపోయానో నాకు తెలియదు. ఇంతలో గంట వినిపించింది. ఎవరి మట్టుకు వారు అక్కడి భోజన శాలలకు వెళ్తున్నారు. అక్కడ అగ్రకులస్తులకు వేరు, ఇతర కులాలవారికి వేరు భోజనశాల లున్నాయి. నేను ఏ భోజనశాలకు వెళ్ళాలో నాకు తెలియలేదు. ఎందుకంటే నాది ఏ కులమో నాకు అప్పుడు తెలియదు. రామకృష్ణా మిషన్లో నాకీ సమస్య ఎదురవలేదు. అక్కడ పెద్ద స్వామివారు మొదలుకొని అందరూ ఒకే పంక్తిలో కూర్చుని భోంచేస్తారు. నేను ఇక్కడ ఏ శాలలోకి వెళ్ళాలో తెలియక భోంచేయకుండానే మదరాసు మరలి వచ్చాను. అప్పటికి పొద్దుపోయింది. రాగానే స్వామిజీని కలిశాను. "భోంచేశావా?" అని ఆయన అడిగారు. "లేదు" అన్నాను. "నీకు అక్కడ సరిపడదని నే ముందుగానే చెప్పాను. నీకు అన్నం ఉంచమని వంట

వానికి చెప్పాను. వెళ్ళి భోంచేసిరా" అని నన్ను ఆయన పంపించారు రామ కృష్ణా మఠం వేరు. తిరువణ్ణామలై ఆశ్రమం వేరు

రామకృష్ణా మఠం మైలాపూర్‌లో ఉంది. రామకృష్ణా మిషన్‌వారి పాఠశాలలు మైలాపూర్‌లోను, త్యాగరాయనగర్లోను ఉండేవి. శ్రీరామానుజా చారిగారు మైలాపూర్ బడిని పర్యవేక్షిస్తూ ఉండేవారు ఆయన సంగీతప్రియుడు. సెమ్మన్‌గూడి, చెంబై, మధురమణి, చిత్తూరు సుబ్రహ్మణ్య పిళ్లై మొదలైన సంగీత విద్వాంసులు అక్కడికి వచ్చి సంగీత కచ్చేరీలు చేసేవారు. తరచుగా ఎవరిదో ఒకరి కచ్చేరి ఉంటూ ఉండడం వల్ల కర్నాటక సంగీతం నాకు వంట బట్టింది.

నైనా పిళ్లై, అలనక్‌నంబి, దక్షిణామూర్తి, రాజమాణిక్యం పిళ్లై మొదలైన మరికొందరు విద్వాంసుల సంగీత కచ్చేరీలు విన్నట్టు నాకు గుర్తులేదు.

త్యాగరాయ నగర్‌లోని రామకృష్ణా మిషన్ స్కూలు మైలాపూర్ స్కూలు మఠంపద్ధతికి భిన్నంగా ఉండేది ఆ స్కూలును, దాని హాస్టల్ను కొంత మంది వైష్ణవులు నిర్వహించేవారు. అక్కడ తిరువణామలై ఆశ్రమ పద్ధతినే భోజనాల పద్ధతి ఉండేది. దినమంతా అందరు విద్యార్థులూ కలిసి, మెలిసి, తిరిగేవారు కాని భోజన సమయంలో కులాలను బట్టి వేరు వేరుగా విడిపోయేవారు. వంటంతా ఒకచే. వండేవారు ఒక్కరే. వడ్డించేవారు ఒక్కరే. కాని కులానికి, కులానికి మధ్య తెరలు ఉండేవి ఈ తెరలు ఎందుకో నా చిన్న మనస్సుకు అర్థ మయ్యేది కాదు.

ఇంతలో అండమాను జైలులో రాజకీయ ఖైదీగా ఉండిన చిన్మాత్రానంద అనే ఒక స్వామిజీ మాకు వార్డెన్‌గా వచ్చారు. ఆయన విప్లవవాది. ఆయన రాజ కీయాలకు స్వస్తి చెప్పి, అధ్యాత్మ చింతనతో రామకృష్ణా మిషన్లో చేరారు. ఆయన వచ్చిననాడే ఈ తెరలను చూసి "రామకృష్ణా మఠంలో ఈ తెరలేమిటి?" అంటూ వాటిని తొలిగించారు. ఆనాడు మాకెంతో సంతోషం కలిగింది. చాలా మంది చెప్పడానికి వీలు లేనంతగా అనంసించారు. మా యిష్టంవచ్చిన చోట మేం కూర్చుని భోంచేశాం.

రామకృష్ణా మఠంలో అప్పుడప్పుడు ఏవేవో సమావేశాలు జరిగేవి. పెద్ద లెవరో వచ్చి ఉపన్యసిస్తూ ఉండేవారు. ఒకసారి రామకృష్ణ పరమహంసగారి జయంతి జరిగినప్పుడు ఒక మహాపురుషుడు వచ్చి ఉపన్యసించారు. ఆయన ఉపన్యాసం నన్నెంతో ఆకర్షించింది మనం మాట్లాడేటప్పుడు ఉచ్చారణ ఎలా ఉండాలి. పదాలను స్పష్టంగా ఎలా పలకాలి. మన భావం అర్థమవడానికి ఎంత నొక్కి పదాన్ని ఉచ్చరించాలి. వినేవారిని ఆకట్టుకొనడానికి ఎలా మాట్లాడాలి మొదలైన విషయాలను మనం ముఖ్యంగా తెలుసుకొని ఉండాలి. ఆయన ఉప న్యాసం వల్ల వీటిని నేను కొంతవరకు గ్రహించగలిగాను. ఆ తర్వాత ఆ యుపన్యాసకులు ఎవరో నాకు తెలిసింది. ఆయన అసెంబ్లీ స్పీకరు సత్య మూర్తిగారు.

రామకృష్ణ పరమహంసగారికి జ్ఞానోదయం కలిగిన రోజును "కల్పతరువు" దినంగా రామకృష్ణ మఠంలో పాటించేవారు. ఆ దినంనాడు ఎవరేమి అడిగితే పరమహంసగారు వారికది ఇచ్చినారట. ప్రతిరోజూ ఆయన్ను దర్శించే ఒక పేద బ్రహ్మణుడు ఒక కల్పతరువు దినంనాడు ఆయన్ని దర్శించినపుడు "నీకేం కావాలి?" అని అతన్ని ఆయన అడిగారుట. "అయ్యా, నేను చాల బీదవాణ్ణి పేదరికంతో బాధపడుతున్నాను. నాకు డబ్బుకావాలి; ఇప్పించండి" అని కోరాడట, అప్పుడు పరమహంసగారు గుప్పెడు మన్ను తీసి అతని దోసిట్లో పోసి "ఇదిగో ధనం, ఇచ్చాను వెళ్ళు అన్నారట. ఆ తర్వాత అతడు బెంగుళూరులో ఒక లక్షా ధికారిగా పేరు పొందాడట.

అందువల్ల ఆ కల్పతరువు దినానికిముందురోజున చిన్మాత్రానంద స్వామిజీ మమ్మల్ని అందరినీ పిలిచి "రేపు భగవానులవారి కల్పతరువు దినం. మీకు ఎలాంటి భోజనం కావాలో చెప్పండి ఏర్పాటు చేయిస్తాను" అని మాట ఇచ్చారు. అందరం ఏం కోరుకోవాలో ఆలోచిస్తున్నాం. వంట చేసే అయ్యరు నన్ను చాటుగా పిల్చి, "రామకృష్ణా నీవు ఏది కోరితే దానిని కాదనకుండా స్వామీజీ చేయిస్తారు. కనుక ఉల్లి పాయల సాంబారు కావాలని అడుగు" అని నాకు సలహా ఇచ్చాడు.

"మాకు రేపు ఉల్లిపాయల సాంబారు కావాలి" అని అమాయకంగా అడి గాను. ఆ రోజుల్లో అయ్యర్లు, అయ్యంగార్లు ఉల్లిపాయలు ఇష్టమైనా తినేవారుకారు.

అవివారికి నిషేధింప బడ్డాయి. ఆ సంగతి తెలియక నే నా కోర్కె కోరాను. మా వంటవానికి ఉల్లిపాయ సాంబారు చాలా ఇష్టమట అంచనల్ల నాద్వారా అడిగించాడు. మా స్వామీజీ మాట తిరగని మనిషి గనుక "అదేం అంతగొప్ప కోరిక. అలాగే చేయిస్తానన్నారు. ఉల్లిపాయ సాంబారుకు ముఖంవాచిపోయిన వంటవాని ముసలి ముఖం, మా చిన్నముఖాలు సంతోషంతో వికసించాయి.

ఉల్లిపాయలు, కొత్తిమీర, కరివేపాకు వేసి మా అయ్యరు ఆ మర్నాడు సాంబారు చేశాడు. మా హాస్టలు వార్డెన్ ఇంటివరకు ఆ వాసన గుభాళించింది మా వార్డెన్‌కు ఉల్లిపాయ సాంబారు అంటే పడదు అయినా ఆయన ఏం చేయలేక ఊరుకొన్నారు.

నేను రామకృష్ణామఠంలో ఉండగా ఒకనాటి సాయంత్రం పానగల్ పార్క్ సమీపంలోని ఒక క్లబ్బు హాలులో పద్మభూషణ్ శ్రీమతి బాలసరస్వతి గారి నాట్య కచ్చేరి జరిగింది. ఆనాటి కింకా ఆమెకు ఏ బిరుదులు లేవనుకొంటి. ఆ నాట్య ప్రదర్శనం చూడడానికి నాకు మా స్వామీజీ అనుమతి ఇచ్చారు. ఆమె తల్లి జయమ్మగారు పాడగా బాలసరస్వతిగారు నాట్యాభినయాలు ప్రదర్శించారు. ఏదో ఒక చిత్ర విచిత్ర లోకంలో విహరించినట్టుగా నా కా ప్రదర్శన అనిపించింది. నాపట్ల ఇంత ప్రేమగా, సౌమ్యంగా ఉన్న స్వామిజీని వదిలిపెట్టి నేను నాగపూర్ వెళ్ళిపోయాను.

దీనికి కారణం, నాకు చిన్నప్పటినుండి పట్టుదల, పౌరుషం ఎక్కువగా ఉండేవి. ఎవరైనా కొట్టినా, పడేవాణ్ని కాను. ఎవరిచేతా మాటపడే అవకాశం రాకుండా మసలుకొనేవాణ్ని. నా తత్వ మెరిగిన నా అన్న శ్యామసుందర్ నన్ను జాగ్రత్తగా కాపాడుతూ, పెంచాడు.

మా హాస్టల్ వార్డెన్ మారిపోయారు. కొత్తగా స్వామీ మైథిల్యానంద వార్డెన్‌గా వచ్చారు. ఆయన మాకు కొత్తవారు అయితే మా నాన్నగారికి కొత్తా, పాతా అంటూ లేదు. ఏ స్వామివారితోనైనా అన్ని విషయాలు దాపరికం లేకుండా చర్చించేవారు. ఎదుటివారి మనస్సును సరిగ్గా అర్థం చేసికోకపోతే అనర్థానికి దారితీస్తుంది. నా విషయంలో అదే జరిగింది.

కొత్తగా వచ్చినా ఈ స్వామి వారికి మా నాన్నగారొక సుదీర్ఘమైన లేఖ వ్రాశారు. మా అమ్మగారి నగలు అమ్మి నాకు డబ్బు పంపుతున్నట్టు ఆ లేఖలో దాపరికం లేకుండా వ్రాశారు. నేను బీద విద్యార్థులకు బట్టలు కుట్టించడం, పుస్తకాలు కొనివ్వడం ఈ స్వామిజీ గమనించారు. మా నాయనగారి లేఖకు, నా దాన ధర్మాలకు ముడివేసి ఈ స్వామి జీ నన్ను శంకించారు. మా నాయన గారి లేఖను అపార్థం చేసికొన్నారు. నన్ను ఒంటరిగా పిల్చి మందలించి యుండి యుంటే నేను విషయాలను వివరించి యుండేవాణ్ని. కాని ఆయన విద్యార్థులందరూ మా హాస్టలులో సమావేశమై యుండగా మా నాన్నగారు వ్రాసిన లేఖను జేబులోనుండి తీసి అందరికీ చూపిస్తూ, "ఈ యుత్తరాన్ని మీ నాన్నగారు వ్రాశారు. ఇది ఉత్తరమా లేక వార్తాపత్రికకు వాఙ్మూలమా? మీ నాన్నగారు మీ అమ్మగారి నగలమ్మి నీకు డబ్బు పంపుతూ ఉంటే నీవు గొప్పకి దాన ధర్మాలు చేస్తున్నావు, జల్సాలు చేస్తున్నావు . . . " అంటూ నన్ను హేళన పూర్వకంగా మందలించారు. నా నుండి దాన ధర్మాలు అందుకొన్న పేద విద్యార్థులు గూడా నన్ను చూసి నవ్వేరు. అందరి ముందు నాకు తల కొట్టేసి నట్టయింది. నా హృదయం గాయపడింది. నేను ఆ స్థితిలో సమాధానం ఏం చెప్పలేక తల దించుకొన్నాను. అక్కడి నుండి మెల్లగా వెళ్ళిపోయాను. ఆ తర్వాత నా తోటి విద్యార్థులకు ఏదో చెప్పారు.

నాకు అవమానం జరిగినట్టుగా నేను బాధ పడ్డాను. నా హృదయానికి తగిలిన గాయం మానాలంటే నేను ఆ స్థలం వదిలిపెట్టి వెళ్ళిపోవాలి. ఆ మఠాన్నే కాదు ఆ నగరాన్నే వదిలిపోవాలి అని అనుకొన్నాను. ఆనాడు స్కూలుకు వెళ్ళబుద్ధి పుట్టలేదు. తిన్నగా పానగల్ పార్కుకి వెళ్ళి ఒంటరిగా కూర్చున్నాను. నాలో నేను తర్కించుకొన్నాను. మా స్కూలును వదిలి పెట్టారు నా తోటి విద్యార్థు హాస్టలుకు వెళ్తుండడం చూశాను. నేను వారితో హాస్టలుకు వెళ్లకుండా తిన్నగా మైలాపూర్ మఠానికి నడుచుకొంటూ వెళ్లాను. స్వామీ శాశ్వితానందగారి వద్దకు వెళ్ళి ఆయనకు నమస్కరించి, నిశ్శబ్దంగా నిలబడ్డాను. ఆయన నా భుజం మీద చెయ్యివేసి "అలా ఉన్నావేం?" అని అడిగారు. "స్వామీజీ నా కిక్కడ ఉండాలని లేదు నన్ను మరెక్కడికైనా పంపించి వేయండి. మీరు పంపకపోతే నేనే ఎక్కడి కైనా వెళ్ళిపోతా"నన్నాను, నాహృదయం గాయపడినట్టు గ్రహించారు కాబోలు,

వారు నన్ను కారణం అడగకుండా "నీ బట్టలు సర్దుకొన్నావా?" అని అడిగారు "నాకు అవేవీ అవసరం లేదు" అన్నాను. ఆతర్వాత ఆయన కాసేపు నిశ్శబ్దంగా ఆలోచించి స్వామి సర్వజ్ఞానంద గారికి కబురు చేసి నాకు కొన్ని కొత్త బట్టలు తెప్పించి ఇచ్చారు. ఆ మర్నాడే నన్ను నాగపూర్ పంపించారు. ఆనాటినుండి ఈ నాటివరకూ మళ్ళా నే నా హాస్టల్లోకి వెళ్ళలేదు. ఆనాటి ఆ సంఘటనను తలచుకొంటే ఈనాటికీ నాహృదయానికి తగిలిన ఆ గాయం రేగుతుంది.

మా మాతామహులది గొప్ప వంశం. జైనదేవుడున్న కొలనుపాక వారి సొంత గ్రామం, కొలనపాక సోమేశ్వరుడు వారి ఆరాధ్య దైవం. ఆ యింటి ఆడ పడచులు ఏడువారాల నగలు ధరించేవారు. కాలి మట్టెలు మొదలుకొని తలలోని పాపెట బొట్టువరకూ అన్నీ బంగారు నగలే.

మా యమ్మ ఒక్కర్తే మా అమ్మమ్మగారికి సంతానం. అందువల్ల ఆమెకు స్త్రీ ధనంగా మా యమ్మమ్మగారి నగలన్నీ వచ్చాయి. ఇవిగాక మా యమ్మగారికి ప్రత్యేకంగా ఏడువారాల నగలుండేవి మా యమ్మగారు చనిపోయేనాటికి ఆమెవద్ద మూడు ఏడువారాల నగలుండేవి. ఆమె చనిపోయిన తర్వాత మా నాన్నగారు మా యక్కయ్యలకు ఇవ్వవలసినవి ఇవ్వగా మిగిలినవి దాచి పెట్టి, అవసరమైనవి అమ్మివేసేవారు. అంతేగాని పేదరికంవల్ల, ఆర్థిక ఇబ్బందులవల్ల నగలను అమ్మి నాకు పంపించలేదు. ఈ కొత్త స్వామి వారికి మా కుటుంబ విషయాలను వివరంగా వ్రాశారు. అదొక సుదీర్ఘమైన లేఖ. అదొక వ్యాసంలా ఆయనకు కనబడి దానిని పూర్తిగా చదవకుండానే నన్ను నలుగురు మధ్యా అవమాన పరిచారు. నా హృదయాన్ని మాటల ఈ టెలతో పొడిచారు. అందుకే నేను నాగపూరుకు వెళ్ళిపోవలసి వచ్చింది నేనెందుకు మదరాసు రామకృష్ణా మఠాన్ని వదలి వెళ్ళానో మా నాన్న గారికి కూడా చెప్పలేదు. ఆయన నన్నెప్పుడూ అడగలేదు. నేను నాగపూర్ వెళ్ళ డం వల్ల నా జీవిత గమనమే మారిపోయింది అంతా మన మంచికే అంటారు పెద్దలు. నావిషయంలో ఇది నిజమయింది.

నా చిన్నప్పుడు మా నాన్నగారు వీలు చిక్కినప్పుడల్లా తీర్థ యాత్రలు చేసేవారు. నేనూ మా యన్నయ్యా గూడా వారితో వెళ్లేవాళ్ళం. వారితో నేనూ మా యన్నయ్యా భారత దేశమంతా పర్యటించాం. ఏ యాత్రయానికి వెళ్ళినా మా

నాన్నగారు అర్చనలు, అభిషేకాలు చేయించేవారు. మఠాలకు, ఆశ్రమాలకు ఆర్థిక సహాయం విపరీతంగా చేసేవారు. సాధు సన్యాసులకు దాన ధర్మాలు చేసేవారు ఒకసారి ఆయనతో కాశీ వెళ్ళాం. మేం కాశీ వెళ్ళిన నాటి రాత్రే విశ్వనాథుని ప్రత్యేక దర్శనం జరిగింది. హారతి ఇస్తూ గుడి తలుపులు తెరిచారు. శివలింగానికి బంగారపు కిరీటాన్ని పెట్టారు. బంగారు పూలమాలలతో శివలింగాన్ని అలంకరించారు. ఆ నగలన్ని ఖరీదైన రత్న వైడూర్యాలతో, కెంపులూ వజ్రాలతో మెరిసి పోతున్నాయి. అయినా నాకు ఆ యలంకరణ నచ్చలేదు. ఆయాభరణాలు ఏవీ లేకుండా విభూతి రేఖలు, బిల్వపత్రాలు, గన్నేరు పూవులతో అలకరించే లింగ మూర్తే నాకు నచ్చుతాడు.

అప్పుడు మేం కాశీలో ఉండగా సాధు సన్యాసులకు తగిన ప్రదేశంలేదని మా నాన్నగారు ఒక చోట మామిడి తోట వేయించారు. ఆ రోజుల్లోనే కొన్ని వేల యింది ఆ తోట కర్చు. ఈ విధంగా మా నాన్నగారి దాన ధర్మాలుండేవి నా చిన్నప్పుడు మా యింట్లో బంగారు ఇటికెలున్నాయని అందరూ అనుకొనే వారు. అది నిజమో అబద్ధమో కాని నే నెప్పుడూ వాటిని చూడలేదు. ఎవరినీ అడగలేదు. ఆ యవసరం నాకు కలగలేదు.

నేనూ, మా యన్నయ్య శ్యామసు దర్ ఏ యాలయానికి వెళ్ళినా ఆ యాలయం లోని సుందర శిల్పాలను చూస్తూ. ఆ శిల్పాలు మాతో మాట్లాడు తున్నట్టుగా ఊహించుకొని మేం ఆడుతూ, పాడుతూ, కాలం గడిపేవాళ్ళం. మా నన్నగారు మాత్రం అర్చనలతో, అభిషేకాలతో కాలం గడిపేవారు.

రామకృష్ణా మఠంలోని వారందరూ స్వాములవార్లే వారి జపతపాల్లోను ధ్యాన పూజాదుల్లోను, చదువు సంధ్యల్లోను వారంతా ఉండేవారు. నేను ఒంటరిగా ఉంటూ ఉండవలసి వచ్చేది నా గురించి వారు ఏమేమో ఊహించుకొంటూ ఉండేవాణ్ని. స్వామి పూజా మందిరాన్ని శుభ్రం చేయడం, తుడవడం, పూజకు కావలసిన పూలమాలలను అందంగా కట్టి ఇవ్వడం నావంతు. రకరకాల పూలమాలలుకట్టడం అలంకారం చేయడం - సంగీతం పాడడం ఒక స్వాములవారి వద్ద నేర్చుకున్నాను. అప్పుడు తప్ప ఇతర సమయాలలో భగవాన్ రామకృష్ణుని మఠంలో కూర్చొని ఊహాలోకాలలో తేలిపోతూ ఉండేవాణ్ణి.

ఒక స్వామిజీ తెల్లగా బాగుండేవారు. ఆయన శరీరం కండలు తిరిగి ఉండేది. ఆయన ఎవరితోనూ ఎక్కువగా మాట్లాడేవారు కారు. ఆయన పూజ చేస్తూ ఉండేవారు పూజ చేస్తున్నప్పుడు అనేక ముద్రలు పట్టేవారు. దేవతల ప్రీతికొరకు ఆలా ఆయన చేతి వేళ్ళతో ముద్రలు పడుతుండేవారని తెలుసుకొన్నాను. ప్రతిరోజు ఆయన ముద్రలు ఎలా పడుతూ ఉండేవారో గమనిస్తూ వచ్చాను, నేను అభ్యసించాను. ముద్రలు పట్టడం వచ్చింది కాని ఆ ముద్రలకుగల అర్థం నాకు అప్పుడు తెలియదు. నే నెప్పుడు ఆయన్ని అడగలేదు. ఆయన నాకు చెప్పలేదు. ఆయనెక్కువగా మాట్లాడరు గదా.

నా చిన్నతనంలో బుద్ధుని విగ్రహం నన్ను ఎక్కువగా ఆకర్షించేది. ధ్యాన సముద్రంలో నన్ను బుద్ధుని విగ్రహం కనబడగానే అక్కడ కాస్సేపు నిలబడి ఆ విగ్రహాన్ని తదేకంగా చూడాలనిపించేది. ఆ స్వామి నన్ను ప్రేమతో పిలుస్తున్నట్టు నా కనిపించేది.

ఉదయం నాలుగు గంటలకల్లా మఠంలోని వారందరం నిద్రలేచేవారం. స్వాములందరూ జపతపాల్లో నిమగ్నులై ఉండేవారు. నేను ఒంటరిగా ఉండలేక ఆ చల్లని సముద్రపు గాలిలో అడయారులోని థియోసాఫికల్ సొసైటీ వరకు నడచి వెళ్తూండేవాణ్ణి. అక్కడున్న చెట్లు చేమల్ని చూసి ఆనందించేవాణ్ణి, అక్కడ ఒక పెద్ద నీళ్ళకుంట ఉండేది. అందులో నల్లకలువలు పూచేవి. ఆ ప్రక్కనే డాక్టర్ అనీబిసెంట్ విగ్రహం ఉండేది. అవన్నీ తిరిగి, తిరిగి, మా స్వాములవార్ల పూజలు ముగిసే సమయానికి మఠానికి తిరిగి వచ్చేవాణ్ణి.

ఒకనాడు రోజూ వెళ్ళినట్టే వెళ్ళాను. అక్కడ ఒక పెద్ద వట వృక్షముంది. ఉదయ భానుని లేత కిరణాలు ఆ చెట్టు కొమ్మల్లో నుండి పడి ఆ ప్రవేశాన్ని ఒక వింత వెలుగుతో ముంచెత్తుతున్నాయి. ఆ వృక్షం మొదలులోనున్న తిన్నెపైని పసుపు పచ్చని దుస్తులు ధరించిన ఒక తెల్లని యోగీశ్వరుడు కూర్చొని, ఏదో గ్రంథం చదువుతూ కనిపించాడు. ఆయనది బోడిగుండు. ఆయనకు దగ్గరగా వెళ్ళాను. ఆయన ఏమి చదువుతున్నదీ నాకు వినిపించలేదు. ఆయన నిశ్చల సమాధిలో ఉన్నాడు. నిశ్శబ్దంగా మరీ చేరువకు వెళ్ళి

చూశాను. ఒక పాలరాతి విగ్రహానికి పసుపు బట్టలు కట్టారా అన్నట్టు ఆయన ఉన్నాడు కొద్ది నిమిషాలపాటు ఆయన్నే తదేకంగా చూస్తూ నిలబడ్డాను. ఆయనలో కదలిక లేదు. నాకు మఠానికి తిరిగి వెళ్ళే వేళయింది. అందుకని అక్కడినుండి కదలి వెళ్ళాను.

ఆ ధ్యాన మూర్తి నా హృదయంలో నిలిచిపోయాడు. అప్పటినుండి నాకు బౌద్ధగ్రంధాలను చదవాలన్న బౌద్ధ స్థూపాలను చూడాలన్న కోర్కె బలంగా కలిగింది. సారానాధ్, బుద్ధగయ, సాంచి, అమరావతి, నాగార్జున, అజంతా, ఎల్లోరా మొదలైన బౌద్ధ పవిత్ర స్థలాలను సందర్శిస్తూవచ్చాను. అవన్నీ శిథిలావస్థలోనే ఉన్నా సజీవంగా ఏదో మహత్తుతో ఉన్నట్టుగా నాకు అనిపిస్తూ ఉండేవి. ఏదో దివ్యశక్తి ఆ ప్రదేశాలలో ఉందని నాకు ఈ నాటికీ ఒక నమ్మకం ఉంది. ఈ నమ్మకం వల్లనే ఎంత క్లిష్టమైన బౌద్ధ గ్రంధాలను నేను చదివినా నాకు సులభంగా అర్థమయ్యేవి.

తర్వాత నేను నాగపూరు వెళ్ళిపోయాను. అక్కడి సేవాగ్రామానికి తరచువెళ్ళేవాడిని. ఆశాదీది, ఆర్యనాయకం,దీనబంధుప్రభాకర్‌జీ మొదలైనపెద్దలు నన్ను చేరదీశారు నన్ను అభిమానించారు. రామకృష్ణా వ్రతంలో ఆధ్యాత్మిక పరమైన ప్రబోధనలు విన్నాను. మానవుని ఆత్మా, శరీరం రెండూ ఆరోగ్యవంతంగా ఉండాలి అలా అన్నప్పుడు ప్రతివాడు ఉత్తమ పౌరుడుగా జీవించ గలడన్న సాంఘిక పరమైన ప్రబోధనలను నేర్చుకొన్నాను. ఎవరి హృదయానికీ బాధ కలుగకుండా జటిల సమస్యలను గూడా అక్కడి పెద్దలు పరిష్కరిస్తూ ఉండేవారు.

కౌమార దశలో నున్న నేను ఆరోజుల్లో నగిషీలు, నగిషీలు గల మిల్లు బట్టలను ధరిస్తూ ఉండేవాణ్ని, నాకు ఖద్దరు దుస్తులపట్ల ఆకర్షణ కలగలేదు. ఆశ్రమంలోని ఇతరులకు నా వస్త్రధారణ నచ్చక ఆశా దీదీకి ఫిర్యాదు చేశారు. నన్ను ఎలాగైనా ఒప్పించి, నేను ఖద్దరు ధరించే ట్టు చేయాలనుకొన్నారు ఆశాదీది. ఒకరోజు సాయంత్రం ఆమె నన్ను గదిలోకి పిలిచారు. అక్కడ ప్రభాకర్‌జీకూడా ఉన్నారు.

"రామకృష్ణా! నీ కి నగిషీ బట్టలంటే ఇష్టమా?" అని ప్రభాకర్‌జీ నన్నడిగారు.

"ఔను" అన్నాను

"ఖద్దరు బట్టలు వేసుకోవా?"

"అవి ముతగ్గా ఉంటాయి."

"అయితే ఒక పనిచెయ్యి. నీవు నాగపూరులో ఉన్నప్పుడు మిల్లు బట్టలు వేసికొంటూ ఉండు ఇక్కడకు వచ్చేటప్పుడు వార్ధా స్టేషన్లోనే మిల్లు బట్టలు విడిచిపెట్టి ఖద్దరు బట్టలు వేసుకొని ఇక్కడకు రా. కొన్నాళ్లు అలా చేశావంటే నీకు ఖద్దరు బట్టలు అలవాటవుతాయి" అని ప్రభాకర్‌జీ సలహా ఇచ్చారు. ఒక విధమైన సర్దుబాటు తరహాగా చెప్పారు.

ఇది జరిగిన మరికొన్ని నెలలకే తంజావూరు నుండి రాజారఘూజీని చూడ్డానికి వారి బంధువులు నాగపూరు వచ్చారు. వారు తెలుగు మాట్లాడుకొంటూంటే విన్నాను. వారిద్వారా తెలుగుభాషకుగల ప్రాముఖ్యత గురించి తెలుసుకొన్నాను. రాజావారి అనుమతి, ప్రోత్సాహంతో నేను వారితోగూడ తంజావూరు వెళ్ళాను. అక్కడ సరస్వతీ మహల్లోని గ్రంధాలను చదివాను. అవి నన్నెంతో ఆకర్షించాయి. నా నృత్యకళా పరిశోధనకు అక్కడి గ్రంధాలు నాకెంతో ఉపకరించాయి.

నేను నృత్య పరిశోధనలో నిమగ్నుడనైనందున మళ్ళా సేవాగ్రాం వెళ్ళలేకపోయాను. ఒక సంపూర్ణ కళాకారునిగా నేను ఆశాదేవీని దర్శించి ఆమె ఆశీస్సులు పొందాలని అభిలషించాను. కాని ఆమె ఇంతలోనే మరణించారు. స్వామీ శాశ్వతానందగారి విషయంలో గూడా నాకు ఇలాగే జరిగింది. నేను పెరిగి పెద్దవాడినయినా నన్ను ఆయన "రామూ" అని చిన్నపిల్లవాణ్ని పిలిచినట్టే పిలిచేవారు. వారి ఆశీస్సులు పొందాలని వెళ్ళేసరికి ఆయన రాంచీ ఆస్పత్రిలో కాలధర్మం చేసినట్టు తెలిసింది. ఇలా జరగడం నా దురదృష్టంగా భావించాను. నన్నొక ఆదర్శజీవిగా తీర్చిదిద్దిన ముగ్గురులో ఇద్దరు గతించారు. మూడోవారు ప్రభాకర్‌జీ. ఈయన్ను నేను తరచుగా ఆయన మరణించేవరకు కలుసుకొంటూ ఉండేవాణ్ని.

నా నృత్యకళా పరిశోధనలో నేను కొన్ని బౌద్ధ గ్రంధాలనుగూడా చదివాను. వాటిలోని రెండు కథలు నన్ను అమితంగా ఆకర్షించాయి.

అమరపలి అనే ఒక గొప్ప ప్రసిద్ధనర్తకి ఉండేది. ఆమె సౌందర్యవంతురాలు, ధనవంతురాలు, ఆమె గౌతమ బుద్ధుని తన ఇంటికి భిక్షకు ఆహ్వానించింది. ఆమె ఇంటివద్ద ఆమె డబ్బు కొరకు ఆమె దర్శనంకొరకు పడిగాపులు పడియుండిన కొంతమంది పెద్దలే ఆమె వద్దకు వెళ్ళవద్దని గౌతబుద్ధుణ్ని వారించారు. దయాసముద్రుడైన బుద్ధభగవానుడు వారి మాటలు లెక్కచేయ కుండా ఆమె ఇంటికి వెళ్ళాడు. ఆమె ఏమి భిక్ష ఇస్తుందా అని ఆపెద్దలు చూశారు.ఆమె తనకున్న అంత ఆస్తిని గౌతమబుద్ధునికి ధారపోసింది. ఆమె సన్యాసినిగా మారిపోయింది. "బుద్ధం శరణం గచ్చామి" అంటూ ఆమె బౌద్ధ సంఘంలో చేరిపోయింది.

నన్ను కదిలించి, నా హృదయాన్ని కరిగించిన మరోక గాథ, వాసవదత్త. వాసవదత్త ఒక ప్రముఖ నర్తకి. ఆమె ఒక అస్థాన నర్తకి. అ సంస్థానాధీశుడు ఆమెను ప్రేమించాడు. ఆ సంస్థానంలోని కవులు, పండితులు, విద్యావేత్తలు, విజ్ఞానవేత్తలు, వీరూ వారూ అని చెప్పడం ఎందుకు అందరూ ఆమె ప్రేమకోసం ఆమె గుమ్మంవద్ద పడిగాపులు కాచి యుండిన వారే.

ఒకనాడు విపరీతంగా వర్షం పడింది. సాయంత్రానికి కాస్త వెలిసింది. మేఘాలచాటునుండి సూర్యుడు తొంగి చూసి, ప్రజలకు దర్శనమిచ్చాడు. ఆ సమయంలో వాసవదత్త మేడపైని సరస్వతీ మందిరంలో కూర్చుని వీణ వాయించుకొంటూంది. క్రింద రాచబాటనుండి "మాతా భిక్షాం దేహి" అనే పిలుపు ఆమెకు వినబడింది. ఆమె వీణను ప్రక్కనబెట్టి కిటికీలో నుండి కిందకు చూసింది. బ్రహ్మ తేజస్సుతో వెలిగిపోతున్న భిక్షకుడు కనబడ్డాడు. ఆమె మంత్రముగ్ధలా అచంచలంగా ఉండిపోయింది. "మాతా భిక్షాం దేహి" అని అతడు రెండవసారి యాచించాడు. అతడు మరొక్కసారి అలా యాచించి ఇంక వెళ్ళిపోతాడు. అందువల్ల ఇంక ఆలశ్యం చేయకూడదని ఆమె నిశ్చయించుకొని పరుగు పరుగున మేడ దిగి, వీధిలోకి వచ్చి ఆ భిక్షకునికి అంజలి ఘటించి, "స్వామీ! ఈ దీనురాలు తన హృదయాన్నే మీకు భిక్షగా సమర్పిస్తున్నది స్వీకరించండి" అంది.

"అమ్మా! ఇంకా సమయం ఆసన్నం కాలేదు." అంటూ ఆ భిక్షుకుడు ముందుకు సాగిపోయాడు.

ఆ భిక్షుకుని దగ్గరగా చూడగానే ఆమె చలించిపోయింది. అతని దర్శనం ఆమె జీవితాన్నే మార్చివేసింది. తన జీవిత సరళిని మార్చుకొని పవిత్రురాలిగా జీవించాలని నిశ్చయించుకొంది. ఈ భౌతిక సుఖాలను ఆశించడం వృథా అని తలపోసింది. తథాగతుని ఆజ్ఞానుసారం కోర్కెలను విడనాడదలచుకొంది. వెంటనే ఆమె తన మందిరానికి వెళ్ళి నిలువుటద్దం ముందు నిల్చుని తన అలంకారాలను తీసివేసింది.

"బుద్ధం శరణం గచ్ఛామి
సంఘం శరణం గచ్ఛామి
ధర్మం శరణం గచ్ఛామి"

అని తనలో తానే మననంచేసికొంటూ, చేతులు ఎత్తి నమస్కరిస్తూ, కళ్ళు వాల్చి, ధ్యానంలో నిమగ్నురాలైంది,

ఆనాటినుండి రాజసభలో ఆమె నాట్యాల చేయడానికి వెళ్ళలేదు. తన ప్రేమికులను, కాముకులను దూరం చేసింది శరణాగతుని చేరడానికి సమయం కొరకు వేచియుంది. రాజుగారికి ఆగ్రహం వచ్చింది. కాముకులకు కంటక ప్రాయమయింది. ఆమెపైని కక్ష తీర్చుకొనాలని వారంతా నిశ్చయించుకొన్నారు. ఆ సమయంలోనే పాంథుడెవడో ఆమె ఇంటికి వెళ్ళాడు. ఆరాత్రి అతడు ఆమె ఇంట్లో చనిపోయాడు. వాసవదత్తే అతన్ని హత్య చేసిందని రాజుగారి సమక్షంలో ఆమెపైని ఆ యూరిపెద్దలు అభియోగం తెచ్చారు. ఆమె హంతకురాలని ఆ రాజావారు తీర్పుచెప్పి, "ఆమె కళ్ళు పీకివెయ్యాలి. ఆమె చేతులు నరికివేయాలి, ఆమెను మండుటెండలో నిలబెట్టాలి." అన్న శిక్షను విధించారు. ఆమె ఆత్మీయులు గూడా ఆమె తరపున వాదించలేదు. దిక్కుతోచని ఆ సమయంలో "నన్ను కాపాడే నాథుడే లేడా?" అంటూ ఆమె అనాథగా విలపించింది. ఆమెకు విధింపబడిన శిక్ష అమలు జరిగింది. మండుటెండలో నడిపించి తీసికొని వెళ్ళారు. ఆమె కనుగుంటలలో నుండి రక్తం కారుతూంది. మొండి చేతులనుండి రక్తం ప్రవహిస్తూంది. ఆమె శరీరాన్ని కోరుకొన్నవారు ఆ మొండి శరీరాన్ని చూసి

ఆనందించారు. ఇంతలో ఆ భిక్షుకుడు ఆమెకు ఎదురు వచ్చాడు. "ఈ విశాలవిశ్వంలో నాపైని దయ చూపించేవారు ఒక్కరూ లేరా?" అంటూ ఆమె విలపించింది.

"ఎందుకు లేరు! తథాగతుని సేవకులు ఇక్కడే ఉన్నారు" అన్నాడా భిక్షుకుడు.

"స్వామీ! మీరా:" అంటూ ఆమె ఆ భిక్షుకుణ్ని తడిమింది.

"ఔనమ్మా నేనే! సమయ మాసన్నమైంది కనుక వచ్చాను" అన్నాడాయన. ఆ మాటలు వింటూనే ఆమె నేలపైకి ఒరిగిపోయింది. ఆమె తలను ఆ భిక్షుకుడు తన ఒడిలో పెట్టుకున్నాడు. ఆమె "బుద్ధం శరణం గచ్ఛామి" అంటూ ఆఖరు శ్వాస విడిచింది.

ఇటువంటి కరుణారసపూరితమైన నాటి గణికల చరిత్ర లెన్నో బౌద్ధ గ్రంథాలలో ఉన్నాయి. కాని అన్నింటిలోనూ ఈ దయనీయమైన గాథ మానవ స్వార్థానికి దర్పణం వంటిది.

బౌద్ధమతావలంబికలు ఎక్కువగా నుండిన కాలంలో, సంపన్నులు తమ బిడ్డలకు నాట్యం నేర్పించి, పర్వదినాలలో ఆ బిడ్డలచేత స్తూపాలవద్ద, ఆ రామాలలోను బుద్ధదేవుని ప్రీతికొరకు నాట్యం చేయించేవారట. ఇది ఆ కాలంలో ఒక ఆచారంగా ఉండేదట. ఈ బిడ్డలు వారి వివాహ సమయంవరకు తథాగతుని సేవలో నృత్యమాడి, గృహస్థులైన పిదప నాట్యంనుండి విరమించుకొనేవారుట. ఈ యాచారం ఇండోనేషియా, బలిద్వీపంలో నేటికీ ఉంది. ఆ కాలంలో ఈ యాచారం మన ఆంధ్రప్రాంతంలో గూడా ఉండియుండాలి.

బౌద్ధ, జైన, హిందూ మత గ్రంథాలను, రామాయణ భారత, భాగవతాది గ్రంథాలను నేను చదివి, ప్రసిద్ధులైన అనేకమంది కళాకారులను సందర్శించి, వారితో చర్చిస్తూ వచ్చినందువల్ల మరుగుపడిన నాట్యకళా చరిత్రను వెలికి తీయ గలిగాను. దానిని మీకు అందించగలిగాను.

అశోక్‌నగర్, హైదరాబాదు-500020.
ఉగాది 30-3-87.

నటరాజ రామకృష్ణ

ఆనందించారు. ఇంతలో ఆ భిక్షుకుడు ఆమెకు ఎదురు వచ్చాడు. "ఈ విశాలవిశ్వంలో నాపైని దయ చూపించేవారు ఒక్కరూ లేరా?" అంటూ ఆమె విలపించింది.

"ఎందుకు లేరు! తథాగతుని సేవకులు ఇక్కడే ఉన్నారు" అన్నాడా భిక్షుకుడు.

"స్వామీ! మీరా:" అంటూ ఆమె ఆ భిక్షుకుణ్ని తడిమింది.

"ఔనమ్మా నేనే! సమయ మాసన్నమైంది కనుక వచ్చాను" అన్నాడాయన. ఆ మాటలు వింటూనే ఆమె నేలపైకి ఒరిగిపోయింది. ఆమె తలను ఆ భిక్షుకుడు తన ఒడిలో పెట్టుకున్నాడు. ఆమె "బుద్ధం శరణం గచ్ఛామి" అంటూ ఆఖరు శ్వాస విడిచింది.

ఇటువంటి కరుణారసపూరితమైన నాటి గణికల చరిత్ర లెన్నో బౌద్ధ గ్రంథాలలో ఉన్నాయి. కాని అన్నింటిలోనూ ఈ దయనీయమైన గాథ మానవ స్వార్థానికి దర్పణం వంటిది.

బౌద్ధమతావలంబికులు ఎక్కువగా నుండిన కాలంలో, సంపన్నులు తమ బిడ్డలకు నాట్యం నేర్పించి, పర్వదినాలలో ఆ బిడ్డలచేత స్తూపాలవద్ద, ఆ రామాలలోను బుద్ధదేవుని ప్రీతికొరకు నాట్యం చేయించేవారట. ఇది ఆ కాలంలో ఒక ఆచారంగా ఉండేదిట. ఈ బిడ్డలు వారి వివాహ సమయంవరకు తథాగతుని సేనలో నృత్యమాడి, గృహస్థులైన పిదప నాట్యంనుండి విరమించుకొనేవారుట. ఈ యాచారం ఇండోనేషియా, బలిద్వీపంలో నేటికీ ఉంది. ఆ కాలంలో ఈ యాచారం మన ఆంధ్రప్రాంతంలో గూడా ఉండియుండాలి.

బౌద్ధ, జైన, హిందూ మత గ్రంథాలను, రామాయణ భారత, భాగవతాది గ్రంథాలను నేను చదివి, ప్రసిద్ధులైన అనేకమంది కళాకారులను సందర్శించి, వారితో చర్చిస్తూ వచ్చినందువల్ల మరుగుపడిన నాట్యకళా చరిత్రను వెలికి తీయగలిగాను. దానిని మీకు అందించగలిగాను.

అశోక్‌నగర్, హైదరాబాదు-500020.
ఉగాది 30-3-87. నటరాజ రామకృష్ణ

# రుద్రగణిక

ఇదొక నూతన సమాసంగా మనకు కనిపించవచ్చును. తెలుగు కళా భాషలో ఇంతకు పూర్వం ఎవ్వరూ చేయని ప్రయోగంగా కనిపించవచ్చును.

కళా ప్రపంచంలో రుద్రరూపం అతి ప్రాచీనమైంది. ప్రణవ, ప్రణయ, ప్రళయ స్వరూపుడు రుద్రుడు. ఈ మూడింటి మూల స్వరూపంగా ఈ రుద్ర రూపాన్ని మన పూర్వులు భావించేవారు. సృష్టికి ఏ రూపం మూలకారణమో, సృష్టి వికాసానికి ఏ రూపం కారణభూతమో, సృష్టిలయలకు ఏ రూపం ప్రధానమో ఈ మూడింటికి కర్త అయినటువంటి వాని సమన్వయ రూపమే రుద్ర రూపం.

నాదరూపంలోను, శబ్దరూపంలోను, అక్షర రూపంలోను ఈ రుద్ర రూపాన్ని ఆరాధించిన స్త్రీ కళాకారులే రుద్ర గణికలు. సకల విద్యాపారంగతులు ఈ రుద్రగణికలు. తమ కళలతో సర్వేశుని ఆరాధించిన వారు వీరు. నృత్త, గీత, వాయిద్యాల సంపూర్ణ సమన్వయ స్వరూపం సంగీతం. ఆ సంగీత కళను ఆరాధించి, అనుభవించి, ఆనందించి, ఆ యానందాన్ని, ఆ రసానుభూతిని లోకానికి పంచిపెట్టినవారు రుద్ర గణికలు. వీరు దేవుని సేవకు, కొలువుకు అంకితమైనట్టివారు, వీరినే దేవ నర్తకు లంటారు.

"దేవదాసి'' అన్న పదం అర్వాచీనమైనది. ఇది మన భాషలోకి వచ్చి కొద్ది కాలమే అయింది. అంతకుముందు గణికలు, సానులు అన్న పదాలే మన భాషలో ఉండేవి. 'స" నుండి "ని" వరకుగల సంగీత విద్యలో నిష్ణాతులైన వారినే "సానులు" అనేవారు. సాని అన్నది ఒక బిరుదు వంటిది. మన తెలుగు దేశ కళాకారులకే కాక కర్నాటక, మహారాష్ట్ర కళాకారులకు గూడ ఈ బిరుదు ఉండేది. రానురాను ఈ బిరుదు ఒక కులాన్ని తెలిపే పదంగా రూపొందింది. ఆ తర్వాత ఒక న్యూన పద అర్థాన్ని వ్యవహారంలో సంతరించుకొంది.

పూర్వం ఆలయ దైవారాధనలలో వీరు పాల్గొనేవారు. బసవులు, పార్వతులు, ఎల్లమ్మలు, జోగులాంబలు వేరు గణికలు వేరు వీరిలో హరిజన తెగకు చెందిన జోగువారిలో కొందరు నృత్యం చేసేవారు, మిగిలిన వారు గణాచారులుగా జీవించేవారు. హరిజన తెగలవారికి వీరి ఆటపాటల ద్వారా వినోదాన్ని చేకూరుస్తూ డబ్బు సంపాదించుకొనేవారు. మిగిలినవారికి ఈ కళలతో ఎటువంటి సంబంధం ఉండేది కాదు.

సుమారు 16 నుండి 20 రకాల నాట్యాలను ఈ జోగువారు ప్రదర్శించేవారు. వీరి నాట్యాలకు డప్పులు ప్రధాన వాయిద్యాలు, వీరివన్నీ లయ విన్యాస నాట్యాలే. వీరి నాట్యాలకు పాట లుండేవి కావు. ముఖ్యంగా 3, 4 అక్షరాల తిశ్ర, చతురశ్ర, మిశ్రగతుల్లో వీరు నృత్త మాడేవారు. అందువల్ల లయ ప్రాధాన్యంగల అంగ విన్యాసాలు మాత్రం వీరి నాట్యాలలో ఉండేవి. వీరికి తాళాలపేర్లు తెలిసేవికావు. ఆయా మాటలపేర్లు చెప్పి, ఆ డప్పులవారు వాయించే లయకట్టు స్వరాలకు తగ్గట్టుగా నాట్యం చేసేవారు. ఒక ఆటకి, వేరొక ఆటకి మధ్య పల్లవి, జతుల్లో తేడాలుంటాయి. ధ్వనిలో తేడా లుంటాయి. ఈ తేడాలను మనం గుర్తించకపోతే అన్నీ ఒక్కలాగ కనబడతాయి. కానీ అన్నీ ఒక్కటి కావు. ఇవి వేర్వేరయినవి.

అమ్మవారిని ఆదిశక్తి అంటారు. ఆమే త్రినేత్రాలుగల పరాశక్తి. తన యోగశక్తివల్ల త్రిమూర్తులను సృష్టించ గలిగింది. వీరిలో ఇద్దరు పెండ్లిచేసుకొనడానికి ఇష్టపడలేదు. అందువల్ల ఆమె తన మూడవ నేత్రాన్ని తెరచి వీరిని భస్మం చేసింది. మూడవవాడు తెలివైనవాడు. ఆమె మూడవనేత్రాన్ని తనకిస్తే పెండ్లి చేసికొంటానన్నాడు. అందుకు ఆమె సంతోషంగా అంగీకరించి తన మూడవ నేత్రాన్ని అతని కిచ్చింది. వెంటనే అతడు రుద్రుడై తన మూడవ కంటిని తెరిచాడు. ఆ దేవి వెంటవే భస్మమైపోయింది. ఆమె శక్తిని గూడ ఇతడు సంక్రమింపజేసికొన్నాడు. ఆమె భస్మాన్ని మూడు భాగాలు చేసి ముగ్గురు అమ్మలను సృష్టించాడు. ముగ్గురు అన్నలను గూడ సృష్టించాడు. అందువల్ల వీరందరిలో తాను శక్తివంతుడైనాడు. అతని ఆ రూపమే రుద్ర రూపం. ఆ భావనతో ఏర్పడిన రూపాన్నే కళాకారులు ఆరాధించేవారు. అందుకే వారు రుద్రగణికలయ్యారు.

ఆది దేవునిగా రుద్రుడు పూజింపబడుతున్నాడు. రుద్ర, కాలరుద్ర, మహా కాలరుద్ర అని అతడు కీర్తింపబడుతున్నాడు. ఈ రుద్రుని భార్య కాళీ, మహా కాళిగా కీర్తింపబడుతున్నది. ఇతడే శివుడు. అందరికన్నా అధికుడు. త్రిమూర్తులలో ఆది దేవుడు ఇతడు ఈ రుద్రమూర్తిని నాట్యోపాసనతో ఆరాధించిన గణికలే రుద్రగణికలు.

దేవదాసీ అన్నపదం ప్రాచీన మైనది కాదని మీకు తెలుసు. ముప్పై అయిదు సంవత్సరాల క్రిందట నేను నృత్యకళా పరిశోధనను ప్రారంభించిన తొలిరోజుల్లో నేను ఈ పదాన్ని ఉపయోగిస్తే కొందరు వృద్ధ గణికలు వారి అసమ్మతిని తెలియజేశారు. మేము దాసీలం కాము, ఆరాధకులం. తెలిసో, తెలియకో మా వారు ఈ 'దాసీ' అన్న పద సంబోధనాన్ని ఏనాడు సమ్మతించారో ఆ నాటి నుండి సంఘంలో మా పరపతి తగ్గిపోతూ వచ్చింది, అని వారన్నారు.

ఊడిగం చేసే వృత్తి దాసీ వృత్తి. దేవాలయాలలో ఊడిగం చేయడానికి వీరు నియమింపబడేవారుకారు. దేవాలయంలోని దేవుణ్ణి తమ నృత్యవిద్యలతో ఆరాధించడానికి నియమింపబడినవారు వీరు. ఈ పదప్రయోగ విలువలను ఏనాడు మన పెద్దలు విస్మరించారో ఆనాడే ఈ గణికల పరపతి సంఘంలో క్షీణించింది. ఇది ఆనాటి వృద్ధ నాట్యకళాకారుల అభిప్రాయం. అయితే ఈ యభిప్రాయాలు గూడా రాను రాను మారుతూవచ్చాయి. వారు కూడా ఈ దేవదాసీ అన్న పద ప్రయోగానికి అలవాటుపడుతూ వచ్చారు. అలవాటుపడక తప్పలేదు. చివరికి వారు ఎదురు తిరిగేవరకు ఈ యలవాటు అలాగే సాగింది. అయితే ఇలాగ ఏ గ్రంథంలో నైనా వివరించబడిందా అంటే లేదనే చెప్పవలసి వస్తుంది. మూగవోయిన ఆ దేవ నర్తకుల హృదయాంతరాళాలలో మరుగుపడి ఉండి పోయింది. వారి హృదయవీణా తంత్రులను మీటగా వచ్చిన వారి ఆలాపనలలోని అర్థం ఆ సుఖదుఃఖాలను అనుభవించినవారికే, బాగా హృదయ మున్నవారు సానుభూతితో ఆ సుఖ దుఃఖాలలోని లోతుపాతులను కొలిచేవారికే వారి హృదయ వేదన అర్థమవుతుంది. బుద్ధివేరు, మనసువేరు. బుద్ధితో ఆలోచించేవారికే మానసికానుభూతులు అర్థమౌతాయా?

నర్తన విద్యవల్ల కలిగే ఆనందాన్ని అనుభవించడం మనందరకూ, తెలుసు. కాని ఆ యానందాన్ని మన కందించే ఆ నర్తకుల మనోభావాలను మనం నిశితంగా తరచి చూడం. వివిధ కళలవల్ల మనకు ఆనందం కలుగుతూ ఉంటుంది. ఆ కళాకారుల సాంగత్యాన్ని మనం అభిలషిస్తాం. అంతే కాని వారి హృదయాంతరాళాల్లో దాగియున్న వారి హృదయవేదనలను అర్థంచేసికో డానికి మనం ప్రయత్నించం. ఎందుకంటే ఆ యవసరం మన ఆనందాను భూతికి లేదు.

అటువంటి మూగ హృదయాల ప్రతిధ్వనుల సారం రుద్రగణికల ప్రణవ నాదం ప్రారంభమై, ప్రణయాన్ని అందించి, ప్రళయంతో అంతమౌతుంది. ఇదొక కొత్త అనుభూతి. ఇది ఒక కొత్త చూపు, ఇదొక కొత్త ఆలోచన, ఇదొక కొత్త వ్యక్తీకరణం. అదే ఈ చిన్న గ్రంథం

# మేనక

శివుడు, పరమ శివుడు, నటమహానటుడు, నటరాజు, నర్తనప్రియుడు ఇలా ఇంకా ఎన్నో పేర్లు శివునికి ఉన్నాయి శివ రూపాలు కూడా ఎన్నో ఉన్నాయి. ఆయన్ను మహేశునిగా, పశుపతిగా, కపాలేశ్వరునిగా, పినాక పాణిగా, మల్లికార్జునునిగా, భోలాశంకరునిగా ఆయన భక్తులు ఆరాధిస్తూ ఉంటారు.

శంకరుడు ఓంకారరూపుడు. ఓంకారం పరబ్రహ్మ స్వరూపం. అది త్రిగుణాత్మకం, త్రిమూర్తుల మూల రూపం. సృష్టి, స్థితి లయల సమన్వయ రూపం.

సృష్టి, స్థితి, లయలను తెలియజేసేదే పరమేశ్వరుని ప్రసిద్ధ తాండవం. దీనినే ప్రణవ తాండవం. ప్రణయ తాండవం ప్రళయ తాండవం అని కొనియాడుతూ ఉంటారు భక్తులు.

పార్వతి దేవి పరమేశ్వరుని అర్ధాంగి. అంబ, దుర్గ, హైమవతి, గిరిజ, శంకరి, జగదీశ్వరి, ఉమ మొదలైన పేర్లు శివుని కున్నట్టే అనేకం ఉన్నాయి. ఈమె గూడా నర్తన ప్రియ.

శివుడు ఉద్ధతమైన, గంభీరమైన, భావ సంపద గల తాండవాన్ని రచించాడు. లలితం, కోమలం, సుందరం, సుకుమారమైన లాస్యాన్ని పార్వతి రూపొందించింది. ఈ రెండు నర్తనరీతులు లోకంలో ప్రసిద్ధి చెందాయి.

వీరివురుకు ప్రీతికరమైన। ఈ నర్తనంతో వీరిని ఆరాధిస్తే, వీరు ప్రసన్నులౌతారని మన పూర్వులు విశ్వసించారు. అంతేకాక నిత్య దైవారాధనల్లో నృత్య, సంగీతాలు ప్రధానంగా ఉండేటట్టు నిర్ణయించారు. ఈ యారాధనా నృత్యాలను చేసేవారే దేవ నర్తకులు, లేక గణికలు. రుద్రుని ఆరాధనలో నాట్యం చేసి, తరించిన వారిని రుద్రగణిక లన్నారు.

గణికలు సకల విద్యాసంపన్నులు, నృత్య, సంగీత, సాహిత్యాల సారాన్ని ఎరిగినవారు, ఈ విద్యల ద్వారా లోకానికి శివరూప సందర్శనం చేయించినవారు. పరమేశ్వరుని పూజల్లో వారు ఆడేవారు, పాడేవారు, అభినయించేవారు.

ఆ పరమాత్మునిలోని ఒక అంశమే ఈ మానవ రూపమని, కళలద్వారా ఆ పరమాత్ముని ఆరాధించి, మళ్లా ఆ మహారూపంలో విలీనమయ్యేవరకు, ఎక్కడ నుండి వచ్చారో అక్కడకు చేరేవరకు జీవితాంతం వీరు తపించేవారు. ఈ దృఢ విశ్వాసంతోనే వీరు దేవుణ్ణి అరాధించేవారు.

మానవ సంస్కృతి సంతతినీ తమలో నిముడ్చుకొని, హృదయ సౌందర్యాన్ని పెంపొందించుకొని, భావసౌందర్యాన్ని గుర్తెరిగి, బ్రహ్మను, విష్ణువును, లేక ఈశ్వరుణ్ణి, లేక ఈ త్రిమూర్తుల దర్నీ లేక వీరికి అతీతమైన పరబ్రహ్మ స్వరూపాన్ని వీరు ఆరాధించేవారు అందుకే వీరు అమర నర్తకులైనారు అందుకే వీరిని దేవ నర్తకులని, దేవదాసీలని, సానులని మన పూర్వులు పిలిచేవారు

శివుని రూపాలన్నింటిలోను, రుద్ర రూపం అతి శక్తివంతమైంది. ఈ రూపాలన్నింటిలో ఆది రూపం ఈ రుద్ర రూపం.

ఈ రుద్ర రూపం పురుషుడైతే, అంబ రూపం ప్రకృతి. ఈ ప్రకృతి పురుషుల కలయికే సృష్టికి మూలకారణం, అని మన పూర్వుల విశ్వాసం అందువల్లనే,

"సంధ్యాతాండవమూర్తి శంకర శశిధర నమోనమో"
ఫాలనేత్ర పరమేశ్వర, పాహి! ధ్రువ తాళ నృత్యప్రియా!
లఘు ద్రుత లల చతుర్భాగ చారీ కరణాంగ హార!
కైశికి వృత్తి పాదఘట్టన ప్రబంధ యతి సమ్మిశ్రిత నర్తన ॥సం॥

అంటూ దేవగాంధారి రాగం, ధ్రువ తాళంలో పాడి, ఆడి, అరు పూటలా ఆ రుద్రుని ఆరాధిస్తూ తన్మయ మొంది, ఇతర భక్తులకు హృదయానందకరంగా ఈ గణికలు కేళిక చేసేవారు.

" ఓం ZZ జగజ్జననీ, ఓంకార రూపిణీ. కల్యాణీ
పార్వతీ పంచలాస్య ప్రబంధ గీత నృత్యదర్శినీ
పంచాక్షరీ ప్రణవ స్వరూపిణీ పంచభూత ఆధారమూర్తి ప్రియే
పర్వతరాజ కుమారీ. కౌమారీ, పర్వతవర్థినీ పతిత పావనీ"

అంటూ కల్యాణి రాగం, ఆది తాళంలో ఆడుతూ, పాడుతూ, ఆ యంబను, రాజరాజేశ్వరిని, అమ్మణ్ణిని నృత్యాలంకారాలతో ఈ గణికలు పూజించేవారు.

ఈ గణికలనే వేశ్యలు, గయిషాలు అనేవారు. సా నుండి నీ వరకు సంగీత శాస్త్రసారాన్ని ఎరిగి, కళల నారాధించిన సకల విద్యాపారంగతులైన సానులు వీరు. అంతేకాని వీరు వెలయాండ్రు కారు, వారకాంతలు కారు కుట్టినులు, కులటలు అసలే కారు సంఘంలోని సంస్కారాన్నంతటిని తమలో నిముడ్చుకొని, ప్రకృతికి దర్పణంగా తమ జీవితాలను కళారాధనతో తీర్చిదిద్దుకొన్న విద్యాంసులు వీరు.

స్త్రీలు లేని నృత్యకళ రాణించదని బ్రహ్మదేవుడు తలిచి, తూర్పుముఖంగా కూర్చుని ఈ అప్సరలను ఆయన సృష్టించాడు. ఒకప్పుడు బ్రహ్మకు మానస పుత్రికలైన ఈ గంధర్వకాంతలు ఆనందంతో పాడుతూ, ఆడుతూ ఆ సృష్టి కర్తను ఆనందడోలికలో నోలలాడించారు. ఆ బ్రహ్మ పరవశుడై వీరి నృత్య విన్యాసాలను తిలకిస్తూ కూర్చున్నాడు. వీరు తూర్పునుండి దక్షిణ దిక్కుగా కదిలి నృత్యం చేశారు. బ్రహ్మ తన ముఖాన్ని అటు తిప్పడానికి వీలు లేక అటువైపు తన కొక శిరస్సును సృష్టించుకొన్నాడు. ఈ అప్సరలు తర్వాత పడమర దిక్కుకు, ఉత్తర దిక్కుకూ మరలి వెళ్ళి నాట్యమాడారు. అటువైపులకు గూడా రెండు శిరస్సులను బ్రహ్మ సృష్టించుకొన్నాడు ఆ ముఖాలు శాశ్వతంగా ఆయన కుండిపోవడం వల్ల ఆయన చతుర్ముఖుడైనాడు. యవ ద్వీపవాసులు చెప్పే కథ ఇది.

దేవనర్తకులైన రంభ, ఊర్వశి, మేనకలే ఈ అప్సరసలు. వీరు విశ్వ సుందరులు. వీరు ముగ్గురూ మూడు ప్రత్యేక నృత్య సంప్రదాయాలను ఏర్పరచారు.

ఈ ముగ్గురూ ఇంద్రుని దర్బారు నాట్యకళాకారులుగా నియమింపబడ్డారు. వీరు కళా పిపాసులు, కళోపాసకులు అయినా వీరి విద్య వీరి రూపం కొన్నాళ్ళకు ఇంద్రునికి విసుగు కలిగించాయి. అందువల్ల వేరొక కళను నూతనంగా సృష్టించాలనుకొన్నాడు ఇంద్రుడు. ఉన్నదానితో తృప్తి చెందనివాడు ఈ యింద్రుడు. కొత్తదానిని పొందాలనే తహ తహ లాడే తత్వం ఈయనిది. నిత్యనూతనాన్ని కాంక్షిస్తూ, ఉన్నదానిని వదులుకొని లేని దానికోసం అర్రులు చాచే వింత గుణంగలవా డితడు. తాను కష్టపడకుండా తన పనులను ఇతరుల చేత చేయించు కొని, వాటి ఫలితాలను అనుభవించగల నేర్పరి.

నర్తన కళ ఎంత విస్తృతి చెందినా నృత్తం, నృత్యం, అభినయం, నాట్యం,లాస్యం, తాండవం అన్న విభాగాల్తే అందులో ఉంటాయి. ఎవరు నర్తన మాడినా ఎంతగా పండితులను మెప్పించినా, ఒప్పించినా, చర్చించినా, తర్కించినా వీటికి మించి కొత్త విభాగాలు ఏర్పడవు. అయినా దేవత లందరూ సమావేశమై, ప్రపంచంలోని సౌందర్యాన్నంతటినీ కలయబోసి ఒక బంగారు బొమ్మను సృష్టించారు.

ఈ బంగార్ర బొమ్మ అతిలోక సుందరి. చంపకు చారిడేసి ఉన్న కళ్ళు మాట్లాడుతూ ఉంటాయి. మదనుడు ఎక్కుపెట్టిన విల్లులా ఉన్నాయి ఆమె కను బొమలు, ఆమె నొసలు చంద్రరేఖలా ఉంది. తుమ్మెద రెక్కలా ఉన్నాయి ఆమె ముంగురులు, శివుని శిరాన్ని అలంకరించిన నల్లత్రాచులా ఉంది ఆమె జడ, ఆ నాసిక సంపెంగ మొగ్గ. ఆమె పెదవులు లేచిగురులు. పళ్ళు ముత్యాలవరుస. చెవులు రెండు శ్రీకారాలు. కంఠం ఒక శంఖం, రెండు మేరు మంధరాలు మొన దేరిన ఆమె కుచాలు, లేత తామర తూళ్లు ఆమె చేతులు. గుప్పిట ఇమిడిపోతుంది ఆమె నడుం. అరటి బోదెలు ఆమె తొడలు.

ఆమె పలుకులలో తేనె లొలుకుతూ, కదలికల్లో రాగవాహినులను ప్రవ హింపజేస్తూ లతలాంటి లాలిత్యంతో కోటిపేజలను గొంతుకలో పలికిస్తూ ఆ కోమలాంగి ఆడుతూ, పాడుతూ, అభినయం మొదలు పెట్టింది.

కాని ఆటపాటల్లో కొత్తదనం ఏముంది? అదంతా కొత్త పాత్రలో పోసిన పాత సోమరసమే. రంభా, ఊర్వసీ, మేనకలు ఇదివరకే ఈ యాట పాటల్ని అభినయాన్ని ప్రదర్శించారు. కొత్తదనం లేని ఆమె కళ వెల వెల బోయింది. ఆమెను సృష్టించిన దేవతలు ఖిన్న వదనులయ్యారు.

వారు సృష్టించిన తిలోత్తమ త్రిలోకాల్లోను ఉత్తమనర్తకే కాని ఖంగుతింది. వారి ప్రయత్నం వృథా ప్రయాసయింది. కొండను తవ్వి ఎలుకను పట్టినట్ట యింది. రంభ, ఊర్వసీ, మేనకలకు తెలిసిన విద్య తిలోత్తమకు తెలిసినా వారి కొచ్చిన ప్రఖ్యాతి ఈమెకు రాలేదు. తిలోత్తమ నర్తనానికి పేరుకూడా రాలేదు.

మన లాస్య నర్తనానికి రంభ ఊర్వశి, మేనకలను దేవీత్రయంగా చెప్ప వచ్చును. వీరికి మూల పీఠం జగదాంబ, పరాశక్తి, ఆదిశక్తి అయిన పార్వతి. సృష్టి, స్థితి లయలకు ఆధారభూతులు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు. ఐనా వారికి అతీతమైన శక్తి పరబ్రహ్మమైనట్లు, లాస్యానికి మూర్తిత్రయమైన రంభ ఊర్వశి, మేనకలకు మూల శక్తి పార్వతి. చెట్టు పేరు చెప్పుకొని కాయలమ్మి నట్లు శివుని అర్థాంగి పార్వతి కనుక ఆమె లాస్యనర్తనానికి సృష్టి కర్త అని చెప్ప డానికి వీలు లేదు. ఆమె శివునితోనే నాట్య ప్రదర్శనానికి పోటీ పడింది. శివునికి తాను ఏమాత్రం తీసి పోనని చాటి చెప్పింది శివుడంతటి ప్రసిద్ధ నాట్యకళాకారిణి నని ఆ పోటీలో రుజువు చేసికొంది.

పరమ శివుడు సప్తతాండవాలను ప్రదర్శిస్తే పార్వతి ప్రత్యేకంగా ఐదు రకాల తాండవాలను ప్రదర్శించింది.

ఆనంద తాండవం, సంధ్యాతాండవం, కలికతాండవం, విజయతాండవం, ఊర్ధ్వతాండవం, ఉమాతాండవం, సంహారతాండవం. ఇవి శివుని సప్తతాండవాలు.

## 1. సంధ్యా తాండవం

సాయంసమయమందు సర్వదేవతలు కైలాసంవద్ద చేరగా రత్నఖచిత సింహాసనంపైని ఆశీనురాలైయుండగా ఆమె ప్రీతికొరకు శివుడు ప్రదర్శించిన తాండవ మిది.

## 2. ఊర్ధ్వ తాండవం

అంబతో పోటీపడి శివుడు చేసిన తాండవ మిది.

## 3. ఉమా తాండవం

పార్వతీ పరమేశ్వరు లిద్దరూ కలిసి ప్రదర్శించిన తాండవ మిది. మిగిలిన నాలుగు తాండవాలను రుద్రుడు ప్రదర్శించాడు.

1. నికుంచిత, 2. కుంచిత, 3. ఆకుంచిత, 4. పార్శ్వకుంచిత, 5 అర్ధ కుంచిత అనే ఈ యయిదు తాండవాలను పార్వతి లాస్యరీతిలో ప్రదర్శించింది.

పార్వతి తన వామ భాగంలో ఉండాలని కోరుకొన్నందున ఆ భాగాన్ని ఆమెకు శివుడు దాన మిచ్చాడు అందువల్ల అతడు అర్ధనారీశ్వరుడైనాడు అర్ధనారీశ్వరుడుగా అతడు నర్తన మాడినప్పుడల్లా ఆ వివిధ నర్తనాలలోని రసానుభూతిని ఆమెకూడా అనుభవించడానికి అవకాశం కలిగింది

ఇటువంటి మహత్తర కళా రూపానికి వారసులైన దేవనర్తకులు తమ నృత్యకళను సంపూర్ణమైనదిగా తీర్చిదిద్దుకొన గలిగారు.

పార్వతీ దేవి నాట్యాచారిణిగా బాణాసురుని కుమార్తె ఉషకు నర్తనం నేర్పినట్లు పురాణాలలో ఉంది. ద్వారకాధీశుడైన శ్రీకృష్ణునికి మనుమడూ, ప్రద్యుమ్నుని కుమార్తుడూ అయిన అనిరుద్ధుని ఉష పెండ్లి చేసి కొంది. పెండ్లి కాక పూర్వం ఆమె నృత్య కేళికలు చేసి యుండెనేమో కాని అనిరుద్ధుని పెండ్లియాడిన తర్వాత అమె నాట్యం చేసినట్లు పురాణాల్లో ఎక్కడా కనిపించదు. నేటికాలంలో లాగే ఆనాడు కూడా ఎందరో యువతులు పెండ్లి చేసుకొన్న తర్వాత నాట్యం చేయడం మానివేసి ఉంటారు. ఉషాభరత మనే ఒక నాట్యశాస్త్ర గ్రంధాన్ని ఈమె రచించినట్లు చెబుతారు.

నాట్యకళారాధన కోసమే గంధర్వకాంతలు సృష్టింపబడ్డారు. నాట్యకళ నుండి వీరు విరమించుకొనడానికి వీలులేదు. వీరు నాట్యకళలోనే జీవించాలి. తమ గురువులవద్ద నేర్చుకొన్న విద్యతోనే వీరు తృప్తిపడక, దేశకాల పరిస్థితుల ననుసరించి ఎన్నో నూతన ప్రక్రియలను వారి కళలో చేర్చుకొని నాట్య కళను పెంపొందిస్తూ వచ్చారు. వీరు ఒక్కొక్కరుగా కేళికలు చేసేవారు. ఒకరితో ఒకరు పోటీపడి కేళికలు చేసేవారు. అందువల్ల నాట్యకళ, అభివృద్ధి చెందింది. తాము పెంపొందించిన కళను మానవలోకానికి అందించారు. వీరు మూడు విశిష్ట కళా రూపాలకు సృష్టి కర్తలు. వీరి కళారూపాలకు మించిన లాస్య కళా రూపం వేరొకటి లేదు

# మేనక సంప్రదాయం!

మొగ్గలు మొదలైన వింత విద్యలతో కూడుకొన్న నాట్యం చాలా కష్టమైనది. దీనిలో అనేక దొమ్మరి ప్రదర్శన లుంటాయి. లలాట తిలకం, గంగావతరణం నికుంచిత, భుజంగచిత్ర విద్యుత్ర్భాంత, శకటాస, చక్ర మండల,మయూరలలిత మొదలైన శివుని నూట ఎనిమిది కరణాలలోనివి అతిసులభంగా, అతి సునాయాసంగా ఈ సంప్రదాయంలో ప్రదర్శింపబడతాయి. వివిధ రకాలైన ప్లవనాలు భ్రమణాలు అతి రమణీయంగా ప్రదర్శింపబడతాయి. ఈ సాంప్రదాయక నృత్యాలను చూస్తే కనుల పండువుగా ఉంటుంది ఈ సంప్రదాయంలో శిక్షణ పొందే వారి సాధన అలాంటిది, శరీరపోషణ అట్టిది. వీరి క్రమశిక్షణ అట్టిది.

తీగపైని నడుస్తూ నాట్యం చేయడం గడ ఎక్కి ఆడ్డం, కుండపై కుండ అలా ఏడు కుండలు నెత్తిపైని పెట్టుకొని ఆడ్డం, పళ్ళెంలో నీళ్ళుపోసి, దాని అంచులపైని నిల్చొని, రెండు చేతుల్లోను జ్యోతులు పెట్టుకొని పళ్ళెంలోని నీళ్లు తొలక్కుండా ఆడ్డం, నాట్యం చేస్తూ కాళ్ళతో బొమ్మలు వేయడం, నేలపైని చితాసాలు పరిచి అవి చిటికి పోకుండా చాతుర్యంతో నర్తన మాడడం, గాలిలో ఎగిరి మొగ్గవేయడం వలయాలు వలయాలుగా తిరుగుతూ ఆడడం మొదలైన విద్యలన్నీ ఈ సంప్రదాయంలో రూపొందాయి. ఎప్పుడు, ఎక్కడ, ఏ ప్రేక్షకుల ముందు ఈ సంప్రదాయాన్ని మేనక ప్రదర్శించిందో తెలియదు కాని నేటికీ ఈ సంప్రదాయం ఆదరింపబడి పోషింపబడుతున్నది. ఈ విద్యను ప్రదర్శించే వారు మేనకను స్మరించకపోయినా ఆమె లాస్యనర్తనానికి ఇచ్చిన కానుకే ఈ కళ.

నేడు 'మేనక' అనగానే విశ్వామిత్రునితో గూడిన మేనకనే గుర్తు తెచ్చుకొని మేనకా విశ్వామిత్రుల శృంగారాన్ని వర్ణిస్తారు. వీరికి శకుంతల పుట్టింది. శకుంతలకు భరతుడు పుట్టాడు. ఆ భరతుడు రాజ్యమేలిన దేశమే ఈ భరత ఖండం. అందరూ మామూలుగా చెప్పే విషయాలే ఇవి.

విశ్వామిత్రుడు రాజర్షి. బ్రహ్మత్వం పొందడానికి అతడు చేస్తూండిన తపస్సుకు భంగం కలిగించడానికి మేనక ఎలాంటి నర్తన విన్యాసాలను ప్రద

ర్శించింది? ఆమె ఎలాంటి భావ ప్రదర్శనలను చూపించింది? ఆమె ఎలాంటి భంగిమలను ప్రదర్శించింది? తాళ విన్యాసాలు ఎలాంటివి? ఆంగికాభినయం ఎటునంటిది? అడవులను ఎలా ప్రదర్శించింది? వీటిని గురించి ఎవరైనా చెప్పారా? ఎవరైనా వర్ణించారా? లేదు. మన కవులు ఎంతసేపూ శృంగారాన్నే ప్రధానంగా తీసికొని ఆమె కచ, కుచాలను వర్ణించారు. ఒక్క రవివర్మ మాత్రం ఒక్క దివ్యసుందర భంగిమను "విశ్వామిత్ర మేనక" చిత్రంగా చిత్రించాడు. అదే మన నృత్య కళాకారులకు శరణ్యమయింది. కవికుల తిలక కాళిదాసు కూడా తన శాకుంతల నాటకంలో ఎక్కడా ఈమె నర్తనాల గురించి వర్ణించినట్టు కనబడదు.

కర్పూరవసంతరాయ బిరుదాంకితుడు, రాజకొమరగిరి బావమరిది కాటయవేముడు గూడా మేనక నర్తనంపైనివ్యాఖ్యానించినట్టు కనబడదు. శాకుంతలం నాటకం వ్రాసిన కాళిదాసు, దానిపైని వ్యాఖ్యానించినవారు కథకే ఎక్కువ ప్రాముఖ్యమిచ్చారు గాని మేనక నృత్యంతోని సాంకేతిక విషయాలకు ప్రాధాన్యతను ఇవ్వలేదు. అందువల్ల ఈ విశిష్ట నాట్యరీతిని గురించిన వివరణలు మనకు లభ్యంకావు నృత్యకళకు మేనక చేసిన సేవ మరుగున పడిపోయింది.

ఇంద్రుని దర్బారు నర్తకీమణులలో మేనక కూడా ఒకర్తె అని మనకు తెలుస్తోంది. కవుల శృంగార నర్తనలకు ఆమె ఒక ఆటవస్తువు అని చెప్పవచ్చు.

కవులు తమ కావ్యాలలో కొంత నాట్యశాస్త్రాన్ని చొప్పించవచ్చుగదా? అని మనం అనుకోవచ్చును. కాని వారు ఛందస్సు, వ్యాకరణం మీద ఎక్కువ శ్రద్ధ చూపించవలసి యుంటుంది. ఒకవేళ వారు నాట్యశాస్త్రాన్ని చదివినావారికి సంప్రదాయం తెలియనద్దూ? ఒకవేళ ఎవరైనా సంప్రదాయం నేర్పుతామన్నా వారికి తీరిక, ఓపిక, సహృదయం ఉండవద్దూ?

# ఊర్వశి

నృత్త, నృత్యాలకంటే అభినయం విశిష్టమైనదని, అది నాట్య, నృత్త, నృత్యాల సారమని పండితులు ఎందుకన్నారు?

ఉత్తమమైన అభినయకళా ప్రదర్శనను చూస్తే, అదొక దివ్యానుభూతిగా, రసలోక విహారంగా మనకే అనిపిస్తుంది. మానవ హృదయాన్ని అవలీలగా చదివి దానిని వ్యాఖ్యానించగలవారు ఎంతో గొప్పవారు. ప్రాంత మేదైనా, భాష ఏదైనా, మతం మరి ఏదైనా, రాజకీయాలు భిన్నమైనవైనా వాటి నన్నింటిని ఒకచోట చేర్చి, వాటి అర్థానుభూతిని అవగాహన చేసికొని, ఆ యర్థానుభూతికి భావాన్ని కల్పించి ఆ భావానికి రసానుస్ఫూర్తిని ఇవ్వడమే అభినయం. ఇది కళలకు పరాకాష్ట. అన్ని ప్రాంతాలవారి హృదయాలను ఒకే తీరున స్పందింపజేసి కరిగించి, రసవాహినులను అభినయం ప్రవహింపజేస్తుంది. అదే రసవికాసం.

ప్రపంచంలో కాళిదాసు రచించిన శకుంతల నాటకం ప్రసిద్ధమైంది. ఆ నాటకమంతా కాకపోయినా కరుణరసాన్ని చిప్పిల్లి చేసిన శ్లోకాలు నాలుగు ప్రపంచ హృదయాలను కదిలించి వేశాయి. అలా కరిగించిన ఆ శ్లోకాలు అమరత్వం పొందాయి.

ఇక తెలుగులోని క్షేత్రయ్య పదాలు సాటిలేనివి. అభినయకళకు అవి రసనిలయాలు.

కాళిదాసు భావాన్ని అనుభవించడానికి సంస్కృత భాషా పాండిత్యం అవసరం లేనట్టే క్షేత్రయ్య పదాల అభినయాన్ని అనుభవించడానికి తెలుగు భాషా పాండిత్యం అవసరంలేదు. తెలుగురానివారు కూడా ఈ పదాలను పాడుతున్నారు. అర్థం చేసికొని అభినయిస్తున్నారు. ఆ యభినయాన్ని తిలకించే ప్రేక్షకులు ధన్యులై రసలోకంలో విహరిస్తున్నారు.

ఈ కళాకీర్తికి మకుటంలేని మహారాణి ఊర్వశి. ఆనాటినుండి ఈనాటి వరకు సాటిలేని మేటి కళాకారిణిగా ఆమె కొనసాగుతూనే ఉంది. ఆమె తన తండ్రికి తగ్గ కూతురే కాదు, తండ్రిని మించిన కుమార్తె. భూలోకంలోని ఆలయాల్లో నృత్యం చేసే దేవ నర్తకులు ఈమె సంతతివారే గనుక విశిష్ట కళా ప్రసిద్ధులైనారు. అందుకే వీరు రుద్ర గణికలైనారు. శివతాండవంలోని జిగిబిగిని గాంభీర్యాన్ని, హూంకారనాన్ని, పార్వతి లాస్యంలోని లాలిత్యాన్ని, మాధుర్యాన్ని కోమల భావ వికాసాన్ని వీరు పుణికి పుచ్చుకొన్నారు అందువల్లనే వీరి కళ సంపూర్ణమైంది. ఇంతకుమించి భరత విద్యలో మిగిలిం దేమీ లేదు.

ఇంతటి మహత్తుగల కళ, ఈ కళను ఆరాధించిన కళాకారులు సంఘానికి ఒక పీడ కలగా తయారవడానికి, సంఘం దృష్టిలో నీచత్వాన్ని పొందడానికి కారణమేమిటి !

ఆదిదంపతులైన పార్వతీపరమేశ్వరులు రూపొందించిన కళ, విష్ణుదేవుడు అభిమానించిన కళ, తాళధారియైన బ్రహ్మదేవుడు ఆడించిన కళ, తన వీణ పైని స్వరాలను పలికించి, సరస్వతి తీర్చిదిద్దిన కళ, ఇంద్రుని మురళీనాదానికి లక్ష్మీదేవి వంతపాడిన కళ, యక్ష, గంధర్వ, కిన్నెర, కింపురుష, సిద్ధసాధ్యులు భక్తితో చూచి, ఆనందించి ప్రణమిల్లిన కళ, దైవ పూజలో ఒక విశిష్ట స్థానాన్ని పొందిన కళ, ఓంకారనాద బ్రహ్మ స్వరూపమైన కళ ఈ నృత్య కళ. ఇంత పూర్వ చరిత్రగల ఈ నృత్యకళ చిన్నచూపుకు ఎందుకు గురైంది?

ఊర్వశి నాటినుండి నేటివరకు వంశ పారంపర్యంగా తరతరాల నాట్యకళావేత్తలు అభిమానించి, ఆరాధించిన ఈ కళ ఎందువల్ల అపవాదుకు లోనైంది?

అర్ధశతాబ్ది క్రితం ఈ కళకు ఇంతటి కళంకం రాకుండా ఉండి ఉంటే ఎన్నో ప్రాచీన నర్తనరీతులు కాల గర్భంలో కలిసిపోకుండా మనకు దక్కేవి. మన భారతీయులది ఒక వింత ప్రవృత్తి. మన ఋషులూ మనవంటివారే. "నవ మాసాలూ మోసి, నన్ను గన్న ఓ తల్లీ నీవు దైవ స్వరూపివి" అని ఒకరు భక్తితో ప్రణమిల్లి, ఆమె పాద ధూళిని నెత్తిని చల్లుకొంటే, మరొకరు "సకల సుఖ దుఃఖాలకు స్త్రీయే కారణం, మానవుని పతనానికి స్త్రీయే మూలకారణం"

అని తూలనాడేరు. ఇవి పరస్పర విరుద్ధ భావాలు. అమ్మ లేకుంటే మనం లేమన్న వాస్తవాన్ని ఈ రెండవ వారు విస్మరించినట్టే.

రాను, రాను స్త్రీ ఒక విలాస వస్తువుగా పరిగణించబడింది. వంశోద్ధారకులను కనే ఒక యంత్రంగా స్త్రీని ఎంచారు. పురుషుని చేతిలో ఒక పనిముట్టయింది. చివరకు ఒక ఆట వస్తువయింది. ఇదే మన సంస్కృతి అంటూ మనదేశ పురుషులు ఆనందించారు. భళిరా! భారతీయుడా!

తన ఇంటనున్న గృహిణి చాలక ప్రతి నాగరిక భారతీయుడు బయట వేరొక ఉంపుడుకత్తెను ఉంచుకొన్నాడు. ఆమె లేకపోతే అతనికి సంఘంలో గౌరవ ముండదు. అప్పటికి గాని తన మగటిమి నలుగురికీ తెలిసిరాదు. అదొక గొప్ప విషయంగా చాటుకొనేవారు. ఆ ఉంపుడుకత్తె చదువుకొన్నదయితే తీరిక వేళల్లో ఆమె ఇంటివద్ద సభలూ సమావేశాలూ గూడా జరిగేవి.

అయ్యగారెక్కడ ఉన్నారని ఇంటివద్ద ఇల్లాలిని అడిగితే చిన్న ఇంట్లో ఉన్నారని సగర్వంగా ఆమె సమాధానం చెప్పే స్థాయికి వచ్చింది. సంఘంలో ఆయనకు హోదావచ్చేది. అయితే ఆ చిన్నావిడకు కలిగిన సంతానానికి సంఘంలో చోటులేదు. వారికి తండ్రి ఎవరో చెప్పుకొనే అర్హతలేదు తల్లిపేరు చెప్పుకొనే జీవించవలసి వచ్చేది. పరస్త్రీతో కాలంగడిపి, గొప్పగా మీసాలు మెలివేసే ఈ రసిక చక్రవర్తులు ఆమె సంతానం తన సంతానం అని చెప్పుకొనే ధైర్యవంతులు కారు. ఆస్తి హక్కుల విషయంలో తగాదాలు వస్తాయన్న భయం వీరికి అందుకే తమ అవసరాలకు వెలయాండ్రను వినియోగించుకొన్న ఈ రసికాగ్రేసరులు వారి నెప్పుడూ కిందమెట్టు మీదనే ఉంచేవారు. ఈ వెలయాండ్రు ఆరాధించే కళలు వీరికి వినోదాన్ని చేకూర్చాలి. వాత్సాయుని కామశాస్త్ర ప్రయోగాలకు ఈ వెలయాండ్రు కావాలి. సరస వినోదాలు కావాలి. వెన్నెల వేడుకలు కావాలి. ధనమిచ్చి వారి మానాలను దోచుకొన్న ఈ రసికులు చివరకు స్వార్థపరులుగా నారికి స్థానమిచ్చేవారు కారు. వారిని సంఘంలో అణగదొక్కి ఉంచేవారు. వారుపొందిన తృప్తికి ప్రతిఫలంగా ఈ స్త్రీలకు వెల చెల్లించేవారు తమ జీవితాలు ఇంతేనన్న తృప్తితో వారు కాలం వెళ్ళబుచ్చేవారు. ఈ వెలయాండ్రలో చాలామంది నాట్య

కళను, ఆ నటరాజును ఆరాధించినవారే. అందుకే ఆ నటరాజు తన మూడవ కంటిని తెరిచాడు. దీంతో సంఘంలో మార్పు వచ్చింది. ఏ పెద్దలైతే నాట్య కళను నీచంగా చూశారో ఆ పెద్దలే తమపిల్లలకు నాట్యాన్ని ఒక ఉత్తమ కళగా నేడు నేర్పిస్తున్నారు. ఏ కళాకారులను కులటలుగా చిత్రించారో ఆ స్త్రీల విశిష్టతకు విజ్ఞానానికి తలవంచి నేడు జోహార్లు అర్పిస్తున్నారు. మన భారతీయుల మనః ప్రవృత్తిలో ఎంత మార్పు! అయితే లోగడ ఎంతమంది కళాకారిణులు పురుష అహంకారానికి బలి అయ్యారో! తన బిడ్డల దీనస్థితికి కళాసరస్వతి ఎన్ని తడవులు కన్నీరు కార్చిందో! చెప్పలేం.

ఆ యాదిదంపతులైన పార్వతీ పరమేశ్వరులు ఈ పుణ్యభూమిని తమ పాదధూళితో పవిత్ర మొనరించి ఎన్నివేల సంవత్సరాలయిందో! మోహినిగా విష్ణుమూర్తి ఈ పుణ్య భూమిపైని నర్తనమాడి ఎంతకాలమయిందో! తమ పసుపు పారాణి పాదాల నలంకరించి రత్న మంజీరాలను మధురంగా పలికిస్తూ రంభా, ఊర్వశులు ఈ భూమిపై నాట్యమాడి ఎన్నితరాలు గడిచాయో! కాని ఆనాటినుండీ పురుషుడు అసమర్థుడైనా, సాంఘికంగా తాను అధికుడనని, స్త్రీ తనకన్నా తక్కువదని నిరూపించడానికి ఎంత శ్రమించాడో! అయితే ఈ యవకతవక ఈనాటిదా! పార్వతీ పరమేశ్వరుల కాలంనుండీ వస్తున్నదే!

ఉమా, శంకరులిద్దరూ నాట్యశాస్త్రవేత్తలని మీకు ఇదివరకే తెలియజేశాను. అయితే ఈ యిద్దరిలో ఎవరు గొప్ప నర్తకులన్న వివాదం తలయెత్తింది ఈ యిద్దరూ ఎవరికివారే గొప్పవారమని వాదించుకొన్నారు. చివరకు ఇద్దరూ పోటీ పడ్డారు. ఉమకు తానె గెలవగలనన్న గట్టి నమ్మకం ఉంది. శివునికీ గట్టి నమ్మకమే ఉంది. అంతేకాక న్యాయనిర్ణేతలను మగవారిని పెడితే తనపైని పక్ష పాతం చూపించగలరన్న ఆశకూడా అతనికి ఉంది.

పోటీ ఏర్పాటయింది. బ్రహ్మ, విష్ణువు, ఇంద్రాది దేవతలు, గంధర్వులు యక్ష కిన్నెర, కింపురుష, సిద్ధ, సాధ్య లందరూ ఆపోటీకి పెద్దలుగా విచ్చేశారు.

పోటీ ప్రారంభమయింది. అంబ ముందు శివుడు తీసికట్టయినాడు. అంబే గెల్చే ట్టు ఉంది. ఎలాగైనా తాను గెలవా లని శివుడు నిశ్చయించుకొన్నాడు. న్యాయంగా అయితే తాను గెలవలేడు. కనుక ఏదో మాయోపాయంతో గెలవాలని ఆలోచించాడు. తన 108 కరణాలలో 'నికుంబిత' కరణం జ్ఞప్తికి వచ్చింది. వెంటనే ఒక కాలును తన శిరస్సుపైన పెట్టుకొని రెండవ కాలుతో నాట్యం చేయ డం ప్రారంభించాడు. అంబ ఆ నాట్యం చూసింది. తనకన్నా కూడా ఆ నాట్యం వచ్చు. ఆ నాట్యం తను చేస్తే శివుడు ఓడిపోవడం తథ్యం. కాని ఆ భంగిమ స్త్రీలకు అనుచితమైంది, అసభ్యకరమైంది. తాను స్త్రీలకు ఆదర్శకురాలు. భావి భారత నారీమణులకు తాను ఆదర్శప్రాయంగా ఉండాలి. పోటీలో మొదటి బహు మతి వచ్చినా రాకపోయినా తను ఈ భంగిమలో నాట్యమాడితే అసభ్యతకు శ్రీకారం చుట్టినట్టవుతుంది.

"ఆనాడు పార్వతే ఆడింది, మనం ఆడితే తప్పేమిటి?" అని భావి శాస్త్రీయ కళాకారులు ఇంతకన్నా అసభ్యకరంగా ఆడవచ్చును. కళకు కళంకం చేకూరుతుంది. ఓడిపోయినా ఫర్వాలేదు" అని తర్కించుకొని పార్వతి ఆభంగిమలో ఆడకూడదని నిశ్చయించుకొంది.

ఆమె అలా ఎందుకు ఆడలేదో తన అభిప్రాయాన్ని సభికులకు తెలియ జేసేలోగా హైమ శంకరునితో ఆడలేకపోయిందని ఆ పెద్దలు నిర్ణయించారు. శివుడు గెలిచినట్టు ప్రకటించారు. "నట మహానటుడు, నటరాజమూర్తి" అని ఆయన్ను ఆ పెద్ద లందరూ శ్లాఘించారు. అయితే శివునికి తెలుసు తాను చేసిన మోసం. అందుకు పశ్చాత్తాపం పడ్డాడు. తత్ఫలితంగా తన అర్థ శరీరాన్ని అంబకు ధారపోశాడు. అర్ధనారీశ్వరుడైనాడు అంతేగాక అంబ పేరు ముందు పలికి తర్వాత తనపేరు పలకాలని మానవకోటికి ఆదేశాలు ఇచ్చాడు. అందుకే మనం "పార్వతీ పరమేశ్వరుడు, గౌరీశంకరుడు, ఉమాశంకరుడు, దుర్గా మల్లి కార్జునుడు" అని అంటున్నాము.

అయితే పురుషాధిక్యత నృత్య హస్తాలలో గూడ మనకు నేటికీ కన్పి స్తుంది. స్త్రీకి మృగ శీర్షికను, పురుషునికి శిఖరాన్ని పట్టాలి. నేను అన్న భావాన్ని శిఖర హస్తం వ్యక్తంచేస్తుంది. అర్థాంగి ఎంత గొప్పదయినా పురుషుని

కంటే కాస్త తక్కువే కనుక అణకువగా ఉండాలన్న భావాన్ని మృగశీర్షిక వ్యక్తం చేస్తుంది

అమ్మణ్ని పినాకునికి అర్ధాంగి కనుక ఆదర్శ గృహిణిగా, పెద్దలతో వాదించకుండా తన ఓటమిని వినయంగా ఒప్పుకొంది. అయితే అందరు స్త్రీలు ఇలా ఉండరు. ఉదయభారతి ఒక మహా విద్వాంసురాలు. సర్వవిద్యాపారంగతురాలు. ఆత్మవిశ్వాసం నిండుగాగల వ్యక్తి. ఆమె ఆదిశంకరాచార్యునంతటివాడినే నిలబెట్టేసింది.

ఆదిశంకరునికి ఎదురునిలబడిన మహా మహా యోగిపుంగవులె ఆతని పాండిత్యానికి తలవగ్గి జోహార్లు అర్పించేరే అలాంటిది ఈ యుదయభారతి ఆయనను ఎదిరించిందా అన్న సందేహం చాలామందికి కలగవచ్చు. కాని ఇది నిజం.

మహాతత్వ వేత్తయిన మండన మిత్రుని అర్ధాంగి ఈ యుదయభారతి. ఈ మండన మిశ్రుని ఆదిశంకరుడు మత విషయంలో వాదించి, ఓడించాడు. అప్పుడు శంకరుని మతాన్ని ఈ మండన మిశ్రుడు స్వీకరించాడు. అతనితో కలిసి ఆదిశంకరుడు అతని ఇంటికి వచ్చి "అమ్మా! నీ భర్త నాతో వాదించి ఓడిపోయాడు నా మతాన్ని అతడు స్వీకరించాడు గనుక నీవు కూడా నా మతాన్ని స్వీకరించిన ట్టె" అని ఉదయభారతితో అన్నాడు.

"ఆర్యా! నా భర్త ఓడితే ఆతడు సగమే ఓడినట్లు. ఆయన అర్ధాంగిని నేను కనుక నన్నుకూడా ఓడించండి. అప్పుడు నేను మీ మతాన్ని స్వీకరిస్తా"నని ఆమె నెమ్మదిగా, సమాధానం చెప్పింది.

"సరే" నన్నాడు ఆదిశంకరుడు.

"తమకు కామశాస్త్రం తెలుసా?" అని ఆమె అడిగింది.

"నేను అస్ఖలిత బ్రహ్మచారిని, పుట్టు బ్రహ్మచారిని, ఆ శాస్త్రం నాకేమి తెలుస్తుంది" అన్నాడాయన.

"అయితే నేను ఏం వాదించాలి! మన పుట్టుకశాస్త్రం అదే తెలియదా? ముందు ఆ శాస్త్రాన్ని చదివిరండి. అప్పుడు వాదానికి దిగుదాం" అందామె.

అంత గొప్ప శంకరాచార్యుడూ నిశ్చేష్టుడయ్యాడు. సభనుండి లేచి వెళ్ళక తప్పలేదు. ఆమెను ఎలాగైనా ఓడించి తన మతంవైపు తిప్పుకోవాలి. కాని ఎలాగ అని ఆలోచిస్తూ, తిరుగుతూ ఉండగా చనిపోయిన ఒక రాజుగారి మృత దేహం కనిపించింది. వెంటనే ఆయన ఆ మృతదేహంలో ప్రవేశించి, రాణివాసానికి వెళ్ళాడు అక్కడ సర్వ శృంగారాలను అనుభవించి, ఆమెను ఓడించాడు. తర్వాత అమరుక కావ్యాన్ని రచించాడు. అదొక శృంగార కావ్యం. అమరుకానికి అమరత్వం చేకూర్చినది అభినయం. భారతదేశమంతటిలోని ఈ కావ్యంలో యీ శ్లోకాలను అభినయించగలవారు ఆంధ్రదేశ నర్తకీమణు లొక్కరే. ఇది ఇతరులకు అలవడని, సాధ్యపడని విద్య. అయితే ఇది వందల సంవత్సరాల క్రిందటి విష యం. కనుక ఈ సందర్భంలో ఒక విషయం చెప్పవలసియుంది.

తూర్పుగోదావరి జిల్లాలోని కోనసీమ, వేదపండితులకు నిలయంగా ఉండేది, అభినయ శాస్త్రవేత్తలకు పుట్టిల్లువంటిది. ఆ కోనసీమలో అంబాజీపేట అనే గ్రామ మొకటి ఉంది. ఆ గ్రామంలో రెడ్డెమ్మ అనే ఒక గణిక ఉండేది. ఆమె సంగీ తంలో నిధి. అభినయంలో అపర సరస్వతి. ఆమె సంగీతంలోనేకాక తర్క, వేదాంత, మీమాంస, వ్యాకరణాదులలో గొప్ప పండితురాలు. ఆమె ఆటకచ్చేరీలు పాటకచ్చేరీలు చేయడమేకాక విద్వత్ సభల్లోకూడ పాల్గొనేది. పండితులతో శాస్త్ర చర్చలు చేసేది. ఓటమి నెరుగని ఆ పండితురాలి పాండిత్యాన్ని మెచ్చి అనాటి పండితులు ఆ రెడ్డెమ్మకు "శాస్త్రి" అన్న బిరుదు నిచ్చారు. ఆనాటి నుండి ఆమె "రెడ్డిశాస్త్రి" అయింది.

ఆమె వృద్ధాప్యంలో ఆమెకు రాగాలు సాక్షాత్కరించేవి. సప్తస్వర కన్యలు ఆమె కనుల ఎదుట లాస్యకేళికలు చేసేవారు. తోడి రాగాన్ని ఆలపించడంలో ఆమె ప్రసిద్ధురాలు. ఆమె ఒంటరిగా ఒకచోట ప్రశాంతంగా కూర్చుని తోడి రాగాన్ని పాడుకొంటూ ఉంటే ఎవరో తన కనులముందు తచ్చాడుతున్నట్టు ఆమె

భావించి వారితో చర్చలు జరిపేది. ఆ మానసిక స్థితి ఏమిటో అర్థంగాక ఆమె బంధువులు, ఆమెకు వృద్ధాప్యంలో మతిభ్రమించిందని అనుకొనేవారు కాని ఆమె విద్యల లోతు ఎరిగినవారు ఆమెకు చెయ్యెత్తి జోహారు లర్పించేవారు.

పూర్వకాలంలో కళాకారిణులు ఎంతో విద్యానేత్తలు, వినయ విధేయతలు గలిగినవారు. గౌరవ మర్యాదలను ఇచ్చి పుచ్చుకొనడంలో పట్టుదలగలవారు. ఎదుటివారిని ఎలా గౌరవించాలో తెలిసినవారు. ఎదుటివారినుండి తగిన గౌరవం పొందడం కూడా తెలిసినవారు. అదీ ఆనాటి సంస్కారం.

తళ్లికోట యుద్ధానంతరం ఆంధ్ర కళాలక్ష్మి తంజావూరుకు తరలివెళ్ళింది. విజయనగర రాజులలోని రామరాయలు చంద్రగిరిలో ఉండేవాడు. ఆతనికి ఒక యుద్ధంలో తంజావూరు రఘునాథ నాయకుడు సహాయపడ్డాడు. ఆ యుద్ధంలో విజయలక్ష్మి రామరాయల్ని వరించింది. అందుకు రామరాయలు రఘునాథ నాయకునికి ఏదైనా కానుక కృతజ్ఞతాపూర్వకంగా ఇవ్వాలని తలిచి ఆయన్నే ఏమి కావాలో కోరుకోమన్నాడు.

"రామరాయా! నాకు ధన ధాన్య వస్తు వాహనాలు ఏవీ వద్దు. సర్వేశ్వరుడు ఆ సర్వాన్నీ నా కిచ్చాడు. కాని నా సరస్వతీ సదనానికి ఒక లోటు ఏర్పడింది ఆ లోటును మీరు తీర్చాలి. నాకు కళలయెడల గల ప్రీతి మీకు తెలిసిందే గదా" అన్నాడు రఘునాథ నాయకుడు.

"అదేదో మీరే సెలవియ్యండి" అన్నాడు రామరాయలు.

"తమ ఆస్థాన నర్తకీమణి ముద్దు చంద్రరేఖను మా ఆస్థానానికి ప్రసాదించండి చాలు" అన్నాడు రఘునాథుడు.

నిండు సభలో రామరాజు రఘునాథ నాయకుని కోర్కెను మన్నించాడు. ఆ మర్నాడు రఘునాథ నాయకుడు తంజావూరు ప్రయాణానికి సిద్ధ మయ్యేడు. ముద్దు చంద్రరేఖకు ముత్యాల పల్లకి ఆమె ఇంటి ముందు నిలిచింది. అప్పుడు ముద్దు చంద్రరేఖకు అసలు విషయం తెలిసింది. ఆమె తన పల్లకి నెక్కి తిన్నగా

రాజ సభకు వెళ్ళింది. రామరాజు ఎదుట నిలబడి "రాజవరేణ్యా రామరాయా! నే నేమైనా నిర్జీవ ఆట వస్తువునా? నాకు తెలియకుండా ఈ చేతి మార్పులు చేయడానికి? నేను తమ ఆస్థాన విదుషీమణిని. తమరు రఘునాథ నాయకులవారికి మాట ఇచ్చారు. నేను తమ మాటను నిలబెట్టదలచాను కాని ఇందుకు కొన్ని షరతు లున్నాయి. వాటిని చెబుతాను తమరు మన్నించాలి. రఘునాథ నాయకులువారు నా షరతులకు అంగీకరిస్తే వారి కోరిక తప్పక నెరవేరుతుంది. నేటి వరకు చంద్రగిరిలో పలికిన చంద్రరేఖ పాద మంజీరాలు రఘునాథ నాయకుల వారి దర్బారులో రేపు ధ్వనిస్తాయి. చంద్రగిరి నుండి నృత్యకళా సరస్వతి తరలిపోతుంది. కాని చరిత్రలో తమ ఆస్థాన కళాకారిణిగా నా పేరు నిలిచి ఉండాలి. నా విద్య ప్రశంసింప బడాలి ఇందుకు నా షరతులు----'

"సరే. నీ షరతులు ఏవో విన్నవించు" అన్నారు ఆ యిరువురు మహారాజులు.

"వినండి మహారాజా !

నేను తంజావూరులో నా మందిరం నుండి రాజమహల్‌కు కేళిక నిమిత్తం వెళ్ళడానికి మహారాజావారు ముత్యాలపల్లకిని పంపించాలి.

పగటి దివిటీల వారు నా పల్లకికి ముందు నడవాలి.

బిరుదు మిటారులు స్తోత్రగానంచేస్తూ పల్లకీ వెంట నడవాలి. నా పేరుతో బాటు రామరాయలు వారి పేరును కలిపి వారు స్తోత్రం చేయాలి.

వీటికి అంగీకరిస్తే రఘునాథ నాయకుల వారితో వెళ్ళడానికి నేను సిద్ధంగా ఉన్నాను" అని ఆమె చెప్పింది.

విద్యల విలువలను ఎరిగిన ఆ మహారాజు లిరువురు ఆ షరతులను ఆమోదించారు. పగటి దివిటీలవారు పల్లకి ముందు నడవడమంటే ఆ రోజుల్లో అత్యంత గౌరవ సూచకం.

ఆ కళాలక్ష్మి తంజావూరుకు చంద్రగిరి నుండి తరలి వెళ్ళింది. అక్కడ ఇందిరామందిరంలో సరస్వతితో నాట్యమాడింది. ఆమె ప్రదర్శించిన పేరిణి ప్రసిద్ధిగాంచింది. నాయకరాజుల తర్వాత వచ్చిన మహారాష్ట్ర ప్రభువుల కాలంలో రూపొందిన భరతనాట్యానికి ఈమె పేరిణి నాట్యమే ప్రేరణ అయింది. ముద్దు చంద్రరేఖ ఆత్మగౌరవ ప్రదర్శనానికి నా జోహార్లు.

# ఊర్వశి సంతతి

గణిక లంటే సానులా? అయితే గణికలకు సానులన్న పేరు ఎలా వచ్చింది?

నేను భరతుని నాట్యశాస్త్రం, నందికేశుని అభినయ దర్పణం చాలా సార్లు చదివాను. ఆ గ్రంధాలలో నా కెక్కడా ఈ పదాలు కనబడలేదు. ఆ యా శాస్త్రాలలో స్థానకాలు, చారులు, రేచకాలు, కరణాలు, అంగహారాలు, నృత్త హస్తాలు మొదలైన శాస్త్ర పరమైన విషయాల గురించి ఉంది కాని ఈ పై పదాలను గురించి ఎక్కడా లేదే! నృత్యకళ గురించి పై గ్రంథాలలో ఉంది గాని నృత్యం చేసేవారి గురించి వర్ణించవలసిన అవసరం వారికి కలగలేదు. అయితే కొంతమంది పండితులు ఈ మాటల గురించి పట్టించుకొనకుండా ఉండలేక వారికి తోచిన విపరీతార్థాలను ఈ పదాలకు ఆపాదించారు, "సాని - సంసారి" వంటి వ్యతిరేకార్థ పదాలను సృష్టించారు. ఇవి అభూత కల్పనలు, అసహ్యకర మైన ఆలోచనలు. వీరికి అసలు వ్యుత్పత్తి తెలియదు. తెలుసుకోవలసిన అవసరం వీరికి లేదు. తెలిసికొనడానికి తగిన సమయం వీరికి లేదు. ఇలాంటి కవులు, పండితులు, సామాన్య ప్రజలు ఆ యర్థాలు, ఆ వ్యాఖ్యానాలు చెప్పారు. వీరి భాష్యాలు నిజ మని ఇతరులు నమ్మారు. ఇలాంటి నమ్మకాలు ఇంకా ఎన్నో మూఢ నమ్మ కాలుగా మనం సంఘంలో ప్రచారంలో ఉన్నాయి.

సంగీతమంటే నోటితోను, వాయిద్యాలపైని ప్రదర్శించే సంపుటని కవుల రచనలను పాడడమని ఒక పరిమితార్థాన్ని నేడు పెద్దలు చెబుతున్నారు. అయితే పూర్వం ఇలా లేదు. గీతం, వాద్యం, నృత్యం ఈ మూడింటి చేరికతో ఏర్పడిన ఒక సంపూర్ణ కళాస్వరూపాన్ని పూర్వం సంగీత మన్నారు. "సరిగమపదని," అనే స్వయం రంజితమైన ధ్వనుల్ని స్వరా లన్నారు. ఇవి పలువిధాలుగా ఒక దానితో ఒకటి చేరడంవల్ల వివిధ రాగాలు ఏర్పడ్డాయి. ఈ రాగాలద్వారా అనేక భావాలను సువ్యక్తం చేయవచ్చును. ఈ రాగాలను అనేక లయల్లో, తాళాల్లో, గమకరీతుల్లో, ఛందస్సుల్లో బంధించి, వినడానికి ఇంపుగా కూర్చవచ్చును. వీటికి

అనేక వర్ణాలు, శబ్ద చిత్రాలు ఏర్పడుతూ ఉంటాయి. అనేక సంచారులతో అందంగా అలంకరించుకొని, అనేక రాగాలుగా శ్రోతలను అలరిస్తాయి. విన డానికి అహ్లాదంగాను, నృత్తమాడినప్పుడు మనోరంజకగాంను ఉంటాయి.

ఈవిధంగా కూర్చడంలోను, తీరికలు ఇవ్వడంలోను రంభ ప్రసిద్ధురాలు. స్వయం రంజితమైన స్వరాలు ఏడే గదా, మరి ఈ స్వరాలను ఎలా కూరుస్తారు? ఇవి రాగాలు, రాగిణీలుగా ఎలా ఏర్పడుతున్నాయి? వీటికి మృదంగ జతులను ఎలా కూరుస్తారు? వీటికి నృత్త, నృత్యాలను, తీర్మానాలను ఎలా ఏర్పరుస్తారు? గేయభావాన్ని, రాగభావాన్ని ఎలా సమన్వయపరుస్తారు? ఒకానొక రసాన్ని ప్రక టించడానికి తగిన రాగాన్ని ఎలా పలికిస్తారు? ఆ రసభావాన్ని విశ్శృతంగా విన్యాసం చేయడానికి జతులను ఎలా కూర్చాలి? ఇలాంటి సందేహాలు సామాన్యులకు కలగడం సహజం.

వీటన్నింటికి ఒక పద్ధతి ఉంది. భాషకు వ్యాకరణం వంటిది ఈ పద్ధతి. ఈ క్రమ పద్ధతిని అనుసరించి సక్రమంగా పైవాటిని కూరిస్తే రసభంగం జర గదు, సంపూర్ణంగా రసాలు వికసిస్తాయి. రసికులు పరిపూర్ణానందాన్ని పొందు తారు.

అయితే ఆ క్రమం ఎలా ఉంటుంది?

సరిగమపదని అనే సప్తస్వరాలను ఒకానొక పద్ధతిలో కూరిస్తే ఆదొక రాగమవుతుంది. ఆ రాగాన్ని 3, 4, 5, 7, 9 అక్షరాల నడకలలో దేనిలోనైనా బంధించి, దానినే చక్రంగా తిప్పుతూ ఉంటే వినడానికి సొంపుగా ఉంటుంది. అయితే ఆ రాగధ్వనులను రకరకాలుగా పలికిస్తూ ఉండాలి. దీనినే జతుల కూర్పు అంటారు. ప్రతి జతికి ఒక ప్రారంభం, ఒక ముగింపూ అంటూ ఉంటాయి. ఈ అద్యంతాల మధ్య వచ్చే స్వరాలను లేక మృదంగ పాటవ అక్షరాలను పలు రకాలుగా కూర్చవలసి యుంటుంది ఇవి గతి ప్రస్తారం, జాతి ప్రస్తారం, యతి ప్రస్తారం, ఛందోప్రస్తారం, బంధరచనా ప్రస్తారం అంటూ వివిధ రకాలుగా ఉంటుంది.

సమగతి అంటే రెండక్షరాల నడక, విషమగతి అంటే మూడక్షరాల నడక. ఈ సమ, విషమగతుల నడక కలిస్తే అయిదక్షరాల ఖండగతి అవుతుంది రెండు

సమగతులు కలిస్తే నాలుగు అక్షరాల చతురశ్రగతి అవుతుంది. చతురశ్రం, తిశ్రం కలిస్తే మిశ్రమ మవుతుంది. అలాగే రెండు సమములు ఒక తిశ్రం కలిసినా మిశ్రమం అవుతుంది. మూడు సమములు ఒక తిశ్రం కలిసినా, ఒక చతురశ్రం. ఒక సమం ఒక తిశ్రం కలిసినా, ఒక చతురశ్రం ఒక ఖండం కలసినా సంకీర్ణమవుతుంది. దీనినే గతి, జాతి ప్రస్తార మంటారు. ఈ గతిప్రస్తారం ఇంకో విధంగా గూడా ఉంది. ప్రకృతిని బాగా పరికించి, పశుపక్ష్యాదుల, జలచరాల, మానవుల నడకలను జాగ్రత్తగా పరిశీలిస్తే, ఆ నడకల ప్రమాణానికి తగిన విధంగా కూర్చడం. వీటినే మనష్యగతి, మరాళగతి, మత్తేభగతి, హరిణగతి, శుకగతి, పికగతి, సర్పగతి అని పలు విధాలుగా అంటారు. ఈ గతుల్లో కూర్చిన స్వరసంపదను గాని మృదంగ జతి కూర్పునుగాని పలికించినప్పుడు మన కళాచక్షువులకు ఆ యా ఆకృతులు ఆడుతున్నట్లు, ఎగురుతున్నట్లు, దూకుతున్నట్లు గోచరిస్తుంది ఈ పద్ధతిలో స్వరాలను కూర్చి, పలికించి, తీర్మానించి మళ్ళా జాగాకు రావడం గతి, జాతి విన్యాసమవుతుంది.

ఒక క్రమపద్ధతిని ఈ జాతుల్లో స్వరాలను, శబ్దాలను మార్చడం జతి, జతికి ముగింపు ఉంటుంది. ఈ ముగింపును మూడు సార్లు ప్రదర్శించడం ఒక ఆచారం. అయితే ప్రేరణ తాండవాలలో అయిదుసార్లు ముగింపును ప్రదర్శించాలి.

## యతులు

సమయతి, విషమయతి, డమరుకయతి, మృదంగయతి, గోపుచ్ఛయతి, పిపీలికయతి అని యతుల కూర్పు పలు రకాలుగా ఉంది.

రెండక్షరాల నడకతో ప్రారంభించి గతిని అదే క్రమంలో నడిపిస్తే అది సమగతి అవుతుంది. అలాగే మూడక్షరాల నడకతో ప్రారంభించి, అలాగే నడిపిస్తే విషమ గతి అవుతుంది. మూడు రెండు, నాలుగు అక్షరాల నడకల కలియకతో నడిపించవచ్చును. ఈ హెచ్చు, తగ్గుల గతి ప్రస్తారాన్ని కూడా విషమం అంటారు.

స్వరాలు ప్రారంభంలో దీర్ఘంగా ఉండి, పోను, పోను తగ్గిపోయి, మళ్ళా పెరుగుతూ వచ్చి ఒక తీర్మానంతో ముగిస్తే దాన్ని డమరుకం అంటారు. ఈ

కూర్పు డమరుకం ఆకారంలో ఉంటుంది గనుక ఈ పేరు వచ్చింది. మృదంగ ఆకారంలో స్వరాలను గాని పాటవాక్షరాలను గాని కూరిస్తే అది మృదంగ యతి అవుతుంది. ఆవుతోక ఆకారంలో స్వరాలను కూరిస్తే అది పృచ్ఛమౌతుంది. మెలికలు తిరిగే స్వరసంపుటి పిపీలకం అవుతుంది. ఈ విధమైన విన్యాసాలను యతి విన్యాసా లంటారు.

ఖడ్గ బంధన, పద్మబంధన, నాగబంధన, లతాబంధన, ఛత్రబంధన మొదలైన బంధ రచనలు ఉన్నాయి. ఇవి చాలా క్లిష్టమైనవి. ఇవి సమర్థవంతులైన కళాకారులకే సుసాధ్యమైనవి. ఈ బంధ రచనలను పలికించినప్పుడు ఆ యా భావాలు ప్రేక్షక హృదయాలలో రసానుభూతిని కలిగించాలి.

## ఖడ్గ బంధన

కత్తితో శత్రు హృదయాన్ని పొడిచేటప్పుడు ఉండే శక్తి ఈ రచనలో చరించాలి.

## పద్మ బంధన

శత పత్రాలుగల తామరపువ్వు వికసించినట్లు, ఆ పుష్పసౌరభం ప్రసరిస్తున్నట్లు, ఝంకారనాదంతో ఎక్కడినుండో తుమ్మెదలు వచ్చి, ఆ పూవుపై వాలి, మధువును గ్రోలుతున్నట్లు అనుభూతులు ఈ రచనలో కలగాలి.

## నాగ బంధన

రెండు నాగుపాములు పెనవేసికొన్నట్లు ఈ రచనలోని స్వరాలు పెనవేసికొనిపోవాలి.

## లతా బంధన

మల్లెతీగ పందిరిని అల్లుకొన్నట్టు, అది పూచినట్టు, మలయమారుతంలో ఆ మల్లెపూలవాసన ప్రసరించి, హాయిని గొల్పుతున్నట్టు అనుభూతులు ఈ రచనలో కలగాలి.

## ఛత్ర బంధన

మందు వేసవిలోని ఎండ తాపంనుండి గొడుగు కాపాడినట్టు, జడివానలో తడిసి, వణుకుతున్నవానికి గొడుగు రక్షణయిచ్చినట్టు ఈ ఛత్ర బంధంలోని స్వరాల కూర్పు ఉండాలి.

అయితే ఇవన్నీ ఊహా చిత్రాలు. ఈ యూహానుభూతులు స్వరకల్పనలలో, మృదంగ జతి కట్టుబాట్లలో కలిగించడం అపూర్వం. ధ్వనుల కూర్పుతో ఈ విధమైన చిత్ర విచిత్ర ఊహా చిత్రాలను ప్రేక్షక హృదయాలలో చిత్రించడం ఎంత కష్టమో మనం ఆలోచిస్తే ఆశ్చర్యం వేస్తుంది. ఈ బంధనాలను గూర్చిన ఆ రోజుల్లో నేడు ఉన్నట్టుగా శాస్త్రీయ పరికరాలు, పరిశోధనా సౌకర్యాలు లేవు. 'అయితే రంభ ఎంత ప్రజ్ఞావంతురాలు! సంగీతం సంపూర్ణ పరిజ్ఞానం గలది. స' నుండి 'ని' వరకు పరిపూర్ణ పూర్ణ పాండిత్యాన్ని సంపాదించుకొన్న కళా కారిణి ఆమె.

'స' నుండి 'ని' వరకు పరిపూర్ణ సంగీత పాండిత్యాన్ని సంపాదించుకొన్న గంధర్వాంగనలకు 'సాని' అన్న బిరుదు నిచ్చేవారు. ఈ బిరుదును పొందిన ప్రథమ సంగీత విద్వాంసురాలు రంభే అయుండాలి.

రంభా! అంబ ముద్దుల బిడ్డా!! నీ కివే జోహార్లు !!!

## ఊర్వశి

ఈమె ఉత్తమ వంశంలో పుట్టింది. ఈమె జన్మ చిత్ర విచిత్రమైంది, సామాన్య మానవుల ఊహ కందనిది. ఈమె నారాయణుని మానస పుత్రిక. ఆయన హృదయ సౌందర్యాన్ని పంచుకొని పుట్టింది, రంగనాథుడైన ఆ నారా యణుని అంశ ఈమెలో ఉంది. ఊహాతీత హృదయ సౌందర్యాన్ని, ముల్లోక వాసులను ముగ్ధులను చేసే భావ సౌందర్యాన్ని, రస సృష్టిని ఆమె తన కనుగవ కదలికలతో, అధర చలనాలతో, పలువరుస ప్రదర్శనతో, కనుబొమల కదలిక లతో, కనురెప్పల ఆర్పులతో, నాసటి రేఖలతో, ఉచ్ఛ్వాస నిశ్వాసాలతో స్వేదం

రోమాంచం, గగుర్పాటు స్వరభంగాలతో ప్రదర్శించగలిగింది. ఆమె తండ్రి నారాయణుని హృదయం ఒక రసనిలయం. ఆ రసనిలయంనుండే ముల్లోకాల భావ, భాష, గానం ఆవిర్భవిస్తాయి. అట్టి తండ్రికి గారాలపట్టి, ముద్దులబిడ్డా అయిన ఈ యూర్వశి అభినయాన్ని పలికించకపోతే ఇంకెవ్వరు పలికించగలరు!

నారాయణుని హృదయం ఎంతో విశాలమైంది ఆయన ఎంతో క్షమా గుణం కలవాడు ఆకాశమంత విస్తృతమైంది ఆయన ఓర్పు. అందువల్లనే ఇంద్రుడు ధన్యుడైనాడు.

బదరికావనంలో నరనారాయణులు తపస్సు చేసికొంటున్నారు. అప్పటి కింకా ఊర్వశి పుట్టలేదు. ఎక్కడో ఇంద్రలోకంలో ఉన్న ఇంద్రునికి కన్ను కుట్టింది. తన పదవికి ఏం కీడు కలుగుతుందోనని భయపడ్డాడు. తనకు ఏం హాని కలుగుతుందోనని శంకించాడు వారి తపస్సు ఫలిస్తుందేమోనని ఈర్ష్య పడ్డాడు. ఎన్నోసార్లు దేవతలకు సహాయంగా వెళ్ళి, వారిని నారాయణుడు, రక్షించాడు. మందరగిరిని కవ్వంగా చేసి, వాసుకిని తాడుగా ఉపయోగించి క్షీరసాగరాన్ని అమృతంకోసం దేవదానవులు చిలికినప్పుడు, వెన్నలా అమృతం పైకి తేలింది. ఆ యమృతాన్ని సేవించినవారు అమరులౌతారు. ఆ యమృతం కోసం దేవదానవులు తగవులాడుకొంటూంటే, దేవతలకు సహాయపడడానికి ఒక వేషంలో నారాయణుడు అక్కడ ప్రత్యక్షమైనాడు. తాను చేస్తున్నది న్యాయం కాదని తెలిసీ కూడా అన్యాయానికి ఒడిగట్టాడు. అంతకు ముందుకూడా ఎన్నో వేషాలు వేసి, ఎన్నో అవతారాలు నారాయణుడు ఎత్తాడు. ఇప్పుడు కూడా అంతే. అంతా అన్యాయమే !

అందాలరాశిలా, వలపు చూపుల మిటారిలా, మరునిచేతి కటారిలా, ఆట పాటల మేటిలా, తన కాళ్ళ అందెలను ఘల్లు ఘల్లున మోగిస్తూ... "వచ్చె నిదే మోహిని, వయ్యార మోహిని" అని హొయలు మీర అడుగులు వేస్తూ, దానవులను ఊరిస్తూ, ఉవ్విళ్ళూరిస్తూ, కవ్విస్తూ, కమ్మని కంఠస్వరంతో పాడుతూ, మానస సరోవరంలోని హంసలా నారాయణుడు మోహినీ అవతారంతో ప్రత్యక్షమైనాడు.

వారి అవసరాలలో నారాయణుడు ఆదుకొంటాడని దేవతలకు తెలుసు. అందువల్ల మోహిని ఎవరో వారు సులువుగా తెలుసుకొనగలిగారు ఆనందంతో చప్పట్లు కొట్టారు.

ఆ దివ్యసుందరిని చూచి దానవులు తన్మయులైపోయారు. అమృతంమాట మరిచిపోయారు. ఆ మోహిని పొందు లభిస్తే చాలు అనుకొన్నారు. చేష్టలుడిగి, ఆలోచనాశక్తిని గోల్పోయారు. నోరు వెళ్ళబెట్టి ఆ దివ్యసుందర విగ్రహాన్ని చూస్తూ వుండిపోయారు.

"మీలో మీకు తగవెందుకు? నేను ఈ అమృతాన్ని మీకు పంచనా?" అంటూ ఆ కోమలి ఆ యమృత భాండాన్ని అందుకొంది. తన నడుం అల్లన అసియాడగా, ఆ లతాంగి, ఆ కోమలాంగి, ఆ తేజస్విని ఆ దేవదానవులను వేర్వేరుగా రెండు వరుసల్లో కూర్చోబెట్టింది. చంకలో అమృతభాండాన్ని పెట్టుకొని తన దివ్యనర్తనాన్ని మొదలుపెట్టింది నర్తనప్రియులైన దానవులకు ఆ అమర నర్తనాన్ని చూసే భాగ్యం కలిగితే అమరులకు అమృతం తాగే భాగ్యం కలిగింది. అంతా అయిన తర్వాత ఆ మోహిని చేసిన మోసాన్ని దానవులు తెలుసుకొన్నారు. ఇంక ఆ మోహినిని వారేం చేయగలరు?

తమ కింక మరణం లేదన్న సంతోషంతో నవ్వుతూ, కేరింతలుకొడుతూ ఆ యమరులు వెళ్ళిపోయారు చిన్నబుచ్చుకొన్న మనసులతో, కృంగిన హృదయాలతో, కళ తప్పిన వాడిన వదనాలతో దానవులు వెళ్ళిపోయారు.

ఈ విధంగా మోసంతో నారాయణుడు దేవతలకు అమరత్వాన్ని కలిగించాడు. అయినా ఇంద్రునికి నారాయణునిలో విశ్వాసంలేదు. ఒకవేళ ఉందనుకొంటే, నరనారాయణుల తపస్సును భంగపరచడానికి రంభను పంపుతాడా! మేనకను వేరే కార్యంమీద పంపి ఉండవచ్చును.

ఈ సందర్భంలో ఒక ముఖ్యవిషయాన్ని చెప్పాలి దేవదానవులు ఎవరి మట్టుకు వారు వెళ్ళగానే ఆడి యాడి అలసిపోయిన ఆ మోహిని, అలసట తీర్చుకొనడానికి ఆ సముద్ర తీరాన చల్లగాలిలో విహరిస్తోంది. అంత వరకూ ఇక్కడ జరుగుతూ ఉండిన తతంగాన్ని శివుడు గమనిస్తూనే ఉన్నాడు. ఆ మోహినీ సుందర్ని శివుడు చూస్తున్నాడు. మన్మధుడు వెంకి తనంగా తన పూలబాణాలను ఆతనిపైని కురిపించాడు. దాంతో శివుడు చలించిపోయి మదన జ్వరం తెచ్చుకొన్నాడు. తాపంతో వేగిపోయాడు. దేవదానవు లందరూ ఉన్నారన్న

శంకతో అంత వరకు వేచి ఉన్నాడు. ఇప్పుడు ఆ మోహిని ఒంటరిగా ఉంది. ఇదే తగిన అదను అనుకొన్నాడు. "చిక్కిందోయి చిక్కిందోయి! చక్కని చుక్క చిక్కిందోయి!" అని సంతోషంగా పాడుకొంటూ ఆమె వద్దకు వచ్చాడు.

అలనాడు హిరణ్యకశ్యపుని నృసింహుడు సంహరించి, తన ఉగ్ర రూపాన్ని ఉపసంహరించుకొనడానికి కర్నూలు ప్రాంతంలోని నల్లమల అడవులకు చేరుకొన్నాడు అక్కడ ఒక చెంచు జవ్వనిని చూడగానే తన కోపమంతా ఎగిరిపోయింది. తన హృదిలో ప్రేమ మొలకెత్తింది. చిరునవ్వులు చిందులాడాయి. ఆ సగం మనిషి సగం సింహంగా ఉన్న ఆ నారాయణుడు "నన్ను పెండ్లాడవే చెంచీతా! నీ పాదాలు పట్టెదనే చెంచీతా" అంటూ ప్రణయ గీతాలు పాడ్డం మొదలు పెట్టాడు. ఆ నారాయణుడులాగే ఇప్పుడు శివుడు మోహిని వద్దకు వచ్చాడు. తన ప్రేమనంతనూ ఆమె ఎదుట వెళ్ళగక్కాడు. "ఒల్ల, నేనొల్ల! తగునా నీకిది?" అంటూ కొన్ని రకాల పాటలు పాడి ఆ మోహిని పరుగు లంకించుకొంది. ఆమె వెంట పడ్డాడు శివుడు. ఆమె ముందు, ఆయన వెనుక పరుగెత్తారు. కొండలు, కోనలు దాటి వారివురూ మాయల మలయాళ దేశం చేరుకొన్నారు. మోహిని అలిసిపోయి ఆగిపోయింది. ఆమెను శివుడు తన బాహువులో బంధించి తన కామేచ్ఛను తీర్చుకొన్నాడు. తర్వాత తన దారిన తాను పోయాడు. ఆ బలత్కార సంయోగంవల్ల మోహిని ఒక మగ శిశువును కంది. ఈ శిశువుకు తండ్రి ఎవరని ఎవరైనా అడుగుతారని భయపడిందేమో, ఆమె ఆ శిశువును ఆ యరణ్యంలోనే వదిలిపోయింది. ఆ శిశువే కేరళ ప్రజల అయ్యప్ప. ఈ మధ్య మన ఆంధ్రులకు ఆరాధ్యుడైనాడు.

అసలు కథను వదిలి ఇందులో పడ్డాను. దీన్ని ఇక్కడ వదిలి అసలు కథకు వస్తాను.

రంభను బదరికా వనం వెళ్ళమని ఇంద్రుడు ఆజ్ఞాపించాడు, మేళతాళాలతో, బాజాభజింత్రీలతో, చాలా అట్టహాసంగా రంభ బదరికా వనం వచ్చింది. వనమంతా నవ్వుల పూవులు పూశాయి, వలపు వెన్నెలలు కాశాయి. ఆడవారి వాసనలు అలుము కొన్నాయి. ఆ వాసనలు భరించలేక నారాయణుడు కళ్ళు తెరిచాడు, విషయాన్ని గ్రహించాడు. "ఔరా! ఇంద్రా! ఎంత మోసం తల

పెట్టావు!" అని తల పంకించాడు. ఇంతలో ఆయన తన యెదుట రంభ ప్రత్యక్ష మయింది. "ఊర్వశీ! ఊర్వశీ!" అంటూ తన ఊరువును తట్టాడు. తక్షణమే ఊర్వశి తన తొడలో నుంచి ఉద్భవించింది. ఊర్వశిని చూడగానే రంభ ముఖం వెల వెల పోయింది. ఊర్వశి తన కన్నా అందంగా ఉందని రంభ తెలుసు కొంది. మేళతాళాలవారు చేష్ట లుడిగి ఆ దివ్యసుందరిని చూస్తూ ఉండిపోయారు.

ఇంద్రుని పథకం నెరవేరలేదు. అతడు ఓడిపోయాడు. ఓడిపోయిన అందరిలాగానే "క్షమించండి మహాప్రభో! ఈ యొక్కసారి క్షమించండి" అంటూ చేతులెత్తి నారాయణమూర్తికి నమస్కరించాడు. దాంతో నారాయణుని హృదయం కరిగి నీరయిపోయింది. ఆయనిది దయార్ద్ర హృదయం. ఆయన కరుణామయుడు. అందువల్ల ఇంద్రుణ్ని క్షమించాడు. అంతేకాదు తన ఊరువు నుండి జన్మించిన తన కుమార్తెను, ఆ దివ్యమంగళ స్వరూపిని, దివ్యనర్తకిని తన దర్బారులో నాట్యకర్తెగా ఉంచుకొనమని ఇంద్రునికి దానం చేశాడు. ఇంద్రుని సభలో తన తోటి నాట్యకర్తెలలో సాటిలేని మేటి నర్తకిగా ఆమె అలరారింది. శాస్త్రవేత్త వేత్తలను, పండితులను, రసికులను ముగ్ధులను చేసి, వారి హృదయా లను దోచుకొని, అభినయం ఆమె సొత్తే అని వారి మెప్పును పొందింది. హృదయ భాషను అర్థం చేసికొని, ఆ భాషకు వ్యాఖ్యానం చెప్పడం ఆమెకు వెన్నతో పెట్టిన విద్య అయింది.

నారాయణుని రక్తం పంచుకొని ఆమె పుట్టింది గనుక ఆమెకు ఇంద్ర సభలో గౌరవం పెరిగింది. ఆమె సంతతివారే భూలోకంలోని దేవాలయాల్లో నృత్య పూజలు చేయడానికి అర్హత పొందారు.

# మాచల్ దేవి

ఆదిలో కాకతీయులు జైన మతస్థులు. ఆ తర్వాత శైవ మతాన్ని స్వీకరించారు. అందులోను పశుపతి సంప్రదాయ శైవ మతాన్ని అవలంబించారు మహమ్మదీయులు, "అల్లాహో అక్బర్!" అని అయిదు సార్లు నమాజ్ చేస్తే, ఈ కాకతీయులు "హర హర మహా దేవ రుద్రా !" అని ఆరు సార్లు రుద్ర నర్తనాంతో శివుని ఆరాధించే వారు. ఆ కాలంలోనే వీర నాట్యాలు, వీర కోలలు అభివృద్ధి చెందాయి. మంటలు గ్రక్కుతున్న నాసరాలను నాలికలోను. కంఠంలోనూ గుచ్చుకొని వీరాంగ సమరోత్సాహ నాదాలను మోగిస్తూ, ఖడ్గాలు చదువుతూ రుద్రుని అర్చించిన కాలమది. కాకతి గణపతిదేవుని కాలంలో వెన్నెలగంటి కుందయామాత్య, సూరయామాత్య అనే ఇద్దరు ప్రసిద్ధ నాట్యాచార్యులు ఉండేవారు.

గణపతి దేవునికి నారమ్మ, పేరమ్మ అనే ఇద్దరు భార్యలుండే వారు. వారి తమ్ముడు జాయప్ప. ఈ జాయప్ప కాకతీయ సామ్రాజ్య గజ సేనలకు అధిపతిగా ఉండేవాడు. ఈతడు కుందయామాత్యునివద్ద నాట్యం నేర్చుకొన్నాడు. ఈ గజసేనాపతి కత్తి పట్టి ఝళిపించిన చేతితో కలం కూడా పట్టి "నృత్త రత్నావళి" అనే నాట్యశాస్త్ర గ్రంధాన్ని రచించాడు.

సుమారు వెయ్యి సంవత్సరాల క్రితం ఆంధ్రుల నాట్యం ఎలా ఉండేదో ఈ గ్రంథంలో వివరించబడింది. ఈ కాలంలోనే ముద్దసాని అనే ప్రసిద్ధ నర్తకీమణి ఉండేది. ఈమె గూడా వెన్నెలగంటి వారి శిష్యురాలే.

గణపతి దేవుని అనంతరం వీర రుద్రమ్మ, ప్రతాపరుద్ర మహారాజు రాజ్యమేలేరు.

శాంతి, అహింసలను ప్రబోధించి మన దేశంలో ప్రేమవాహినులను ప్రవహింప జేసిన మతము జైనం. బౌద్ధ మతం తర్వాత జైన మతమే మన భారతీయులకు అభిమాన మత మయింది. జైన మతాన్ని విడనాడి కాకతీయులు శైవ

మతాన్ని అవలంబించిన తర్వాతనే జైన మతానికి మన ఆంధ్రలో ఆదరణ తగ్గింది. కాకతీయులు ఈ కాలంలో అనేక హింసలకు గురైనారు కూడ. మతకలహాల వల్లనే కాకతీయ సామ్రాజ్యం పతన మైంది.

కాకతి ప్రతాపరుద్రుని ఆస్థానంలో విద్యానాథు డనే శాస్త్రజ్ఞుడు ఉండే వాడు. ఈయన ప్రతాపరుద్రీయమనే అలంకార శాస్త్ర గ్రంథాన్ని రచించి ప్రతాప రుద్రునికి అంకిత మిచ్చాడు. ఇదొక గొప్ప శాస్త్ర గ్రంథం. నాట్యాచార్యులందరూ చదివి తమ శిష్యులకు బోధించ తగ్గ గ్రంథం. ఈ గ్రంథాన్ని ఆధారం చేసికొని రేచర్ల వంశీయుడైన రాచకొండ నేటిన వెలమ ప్రభువు సర్వజ్ఞ సింగ భూపాలుడు 'రసార్ణవ సుధాకరం' అనే గ్రంథాన్ని రచించాడు. ఈ సర్వజ్ఞ సింగ భూపాలునకు సమకాలికుడే బమ్మెర పోతన. ఈయన రచించిన ఆంధ్ర మహా భాగవతాన్ని తనకు అంకిత మిమ్మని సింగభూపాలుడు కోరాడు గాని "పలికెడిది భాగవత మట, పలికించెడు వాడు రామ భద్రుండట---" అని విశ్వసించిన పోతన తన భాగవతాన్ని మానవ మాత్రులకు అంకితం చేయడానికి ఇష్టం పడలేదు

ఇటువంటి ఆత్మ గౌరవం, స్వతంత్ర స్వభావాలు గల కవులు, కళాకారులు ఆ కాలంలో ఉండేవారాయీ, ఆ కాలంలో యీ కోవకు చెందిన నర్తకీమణే మాచల్ దేవి. లక్ష్మి సరస్వతు లిద్దరూ ఆమెను కరుణించారు.

క్రీడాభిరామం ఒక అద్భుత కవితా రచన. దీనిని వల్లభ రాయుడు వ్రాశాడని కొందరూ, శ్రీనాథుడు వ్రాశాడని మరి కొందరూ అంటారు. దానిని ఎవరు వ్రాసినా అది ఓరుగల్లు పట్టణ ప్రజాజీవితానికి ఒక దర్పణంవంటిది. అందులో మాచల్ దేవి గురించి గూడా ఉంది.

సర్వ సాధారణంగా దేశ చరిత్ర గ్రంథాలలో రాజులు, రాణివాసం, రాజ్యకాంక్ష, రాజ్య విస్తరణకు యుద్ధాలు, యుద్ధాలలో దోపిడీలు, కొల్లగొట్టడం, పల్లెలు, పట్నాలు నాశనమవడం, రాజులను కవులు భట్రాజుల్లాగ పొగడడం, వారికి రాజులు కానుకలు ఇవ్వడం మొదలైనవే ఉంటూ ఉంటాయి. ఇవే కాక ఆ రాజ్యానికి అలంకారాలుగా భాసించే కవి, పండిత, గాయక, నర్తన, చిత్ర లేఖన, శిల్ప

శాస్త్రజ్ఞుల గురించి కూడా ఉండాలి. రాజ్యంలోని అందరి గురించి చెప్పడం కష్టం గనుక కనీసం ప్రముఖుల గురించయినా చారిత్రక గ్రంథాలలో ఉండడం సముచితం. ఇటువంటి అభిప్రాయంతోనే మాచల్‌దేవి ఒక యక్షగానాన్ని రచన చేయించింది. ఇందులో తమ పూర్వులు నాట్యకళకు చేసిన సేవలు వివరించబడ్డాయి నాట్య మేళాలవారి చేత ఈ యక్షగానాన్ని ప్రదర్శింపజేసింది. కాకతి ప్రభువుల చరిత్రతోబాటు తన వంశ చరిత్రను గూడా దీని మూలంగా ప్రచారం చేయించింది ఆమె. కాని దురదృష్టంవల్ల ఆ యక్షగానం మనకు లభ్యంకాలేదు.

ఈ విధంగా యక్షగానాన్ని రచింపజేసి ప్రదర్శింపజేసి, ప్రచారం చేయించిన మాచల్‌దేవి శ్రీమంతురాలేగాదు ధీమంతురాలు గూడ. ఇటువంటి ప్రచారాన్ని అంతకుముందు చూడని ఆనాటి పెద్దలకు రుచించకపోయి యుండవచ్చును. అందువల్లనే ఇటువంటి తొలి యక్షగానం శాశ్వితంగా మరుగున పడిపోయి ఉంటుంది. ఈ యక్షగానం అదృష్టవశాత్తు మనకు లభిస్తే ఆనాటి నాట్యకళాకారుల సాంఘిక జీవితం, వారి ఆచార వ్యవహారాలు మనకు తెలియగలవు. కాని ఇంతవరకు దీనిని గురించి శ్రమించినవారు ఉన్నట్టు కనబడదు. ఇంతకూ ఈమె ఒక సాధారణ నర్తకి అన్న ఏహ్యభావం మన పరిశోధకులకు ఉండి ఉండవచ్చును.

# లకుమ

గుంటూరు సీమ ప్రాచీన సంస్కృతి ప్రసిద్ధమైంది. శాతవాహనుల రాజధాని ధాన్యకటకం. బౌద్ధుల యాత్రా స్థలం అమరావతి, విష్ణు కుండినుల గుహాలయాల ఉండవల్లీ గుంటూరు సీమలోనే ఉన్నాయి.

బాపట్లలో శ్రీమన్నారాయణుడు భావన్నారాయణుడుగా వెలిసి ఉన్నాడు. ప్రతిపాలపురం బౌద్ధుల దివ్యక్షేత్రంగా ఉండేది. చేబ్రోలులో అపూర్వమైన బ్రహ్మాలయ ముంది. మంగళగిరిలో పానకాల లక్ష్మీనరసింహస్వామి స్థిర వాసం ఏర్పరచుకొని ఉన్నాడు.

ఇంక మన నాట్యకళ విషయానికొస్తే కాజా గ్రామంలో యతినారాయణ తీర్థులవారు జన్మించారు ఒంగోలు పీరి తరంగాల గానానికి ప్రసిద్ధిగాంచింది. చదలవాడలో ప్రసిద్ధ నర్తకు లుండేవారు. చదలవాడ ఇంటి పేరు గలవారు ఆంధ్ర దేశంలో పలుచోట్ల ఉన్నారు. వీరందరూ కళాకారులే. వీరిలో కొందరు గాయకులు, కొందరు వాయిద్యకులు, మరికొందరు నర్తకులు. చదలవాడ సామ్రాజ్యం గారు ప్రసిద్ధ నట్టువరాలు. చదలవాడ సుబ్బయ్యగారు ప్రసిద్ధ వాయులీన వాయిద్యకులు. వీరందరూ ఒకప్పుడు ఈ వూరువారే.

దుగ్గిరాల జగదాంబ, దుగ్గిరాల శ్రీరాజితం, సంగీత సరస్వతి దుగ్గిరాల మాణిక్యం (మండపేట) మొదలైన కళాకారు లందరిదీ ఒకప్పుడు దుగ్గిరాలే. వీరందరూ ప్రసిద్ధ నర్తక కుటుంబాలవారు.

మాచుపల్లి కైఫియత్‌లో పేర్కొనబడిన కూచిపూడి నర్తకులు గుంటూరు జిల్లాలోని వినుకొండ ప్రాంతంవారు.

పూర్వం ఈ ప్రాంతంలో నాట్యం రెండు విశిష్టరీతుల్లో ఉండేది. ఒకటి కాకరపర్తివారి బాణీ. వీరిది భాగవత సంప్రదాయం. కూచిపూడి భాగవతు

లాగే వీరు వీధి భాగవతాలను ప్రదర్శించేవారు. రెండో బాణీ మైనంపాటి వారిది. ఇది నట్టువమేళానికి చెందినది. మైనంపాటివారు స్త్రీలకు కర్నాటక విద్య నేర్పేవారు. దురదృష్టవశాత్తు ఈ రెండు బాణీలు నేడు అంతరించిపోయాయి.

మైనంపాటివారు భరత కళాచార్యులేకాక కవులుగూడ. వీరు హరికథలు రచించి ప్రదర్శించేవారు. హరికథలో గూడ భరతాభినయాలను ప్రదర్శించేవారు. వీరు జావళీ, లావణీ బాణీలలో రచనలు ఎన్నో చేశారు. మైన పాటివారి ముద్రగల కొన్ని శృంగార కవితలను నేను సేకరించాను. నాచిన్నతనంలో నేను మదరాసులో ఉండగా మైనంపాటి నరసింహారావుగారి కథాగానం విన్నాను. వారి అభినయాన్ని చూచే భాగ్యం నాకు కలిగింది.

ఈ గుంటూరు ప్రాంతంలోని ధేనువుకొండ వంశీయులు గొప్ప సంగీత విద్వాంసులు. వీరు ఎందరో నట్టువరాండ్రకు శాస్త్రీయ సంగీతం నేర్పారు.

కొండవీడు రాజధానిగా చేసికొని రెడ్డిరాజులు రాజ్యమేలిన ప్రాంత మిది. కొమరగిరి ప్రభువు రసికశిఖామణి. ఈయన వసంతోత్సవాలను కడుప్రీతితో జరిపించేవాడు. ఈ ఉత్సవాలలో కల్లాపు జల్లించి, ముగ్గులు పెట్టించి కర్పూరం జల్లించేవాడు. అందుకే ఈయనకు కర్పూర వసంత రాయలన్న బిరుదు వచ్చింది. కాళిదాసు నాటకాలపైని వ్యాఖ్యానం రచించిన కాటయవేముడు ఈయనకు బావమరిది.

పూర్వకాలంలో బాపట్ల భావనారాయణ స్వామివారికి అంకితమై ఆయన సేవల్లో నృత్యపూజలు చేసిన ప్రసిద్ధ దేవనర్తకి మల్లమ్మ. ఈమె కుమార్తె లకుమ. తన తర్వాత ఈ లకుమను భావనారాయణస్వామి వారి సేవకు కైంకర్యం చెయ్యాలని మల్లమ్మ ఆశించింది. అందుకు తగినట్టుగా పాంచరాత్ర ఆగమాను సారంగా తన కుమార్తెకు శిక్షణ ఇప్పించింది.

నారాయణుని కుమార్తె ఊర్వశి. ఆ ఊర్వశి వారసులే వీరు. కనుక ఆ దేవదేవుని సేవలో తరించవలసిన దేవనర్తకులు వీరు. ఇది వంశాచారం.

లకుమ అతిలోక లావణ్యవతి. అందాలరాసిగా, దివ్యమోహన విగ్రహంగా ఆమె రూపొందింది. నృత్య సంగీతాలలో పరిపూర్ణ పాండిత్యాన్ని సంపాదించింది ఈమె అందచందాల గురించి, యీమె ఆటపాటల గురించి, యీమె తల్లికుండిన ఆదర్శాల గురించి కొండవీటి ప్రభువు కొమరగిరి విన్నాడు. అప్పటి కింకా ఆయన ఆస్థాన నర్తకిని నియమించలేదు. ఆయన "వసంతరాజీయం" అనే నాట్యశాస్త్ర గ్రంథాన్ని వ్రాయాలని సంకల్పించిన కాలమది.

శాస్త్రసంప్రదాయాలతో భరతకళను తెలిసిన నర్తకిని తన ఆస్థాన నర్తకిగా నియమిస్తే తాను వ్రాయబోయే నాట్యశాస్త్ర గ్రంథానికి ఆదర్శంగా ఉంటుందని, లక్షణ,లక్ష్యాలను సమన్వయపరిచి గ్రంథరచన చేయవచ్చునని కొమరగిరి ప్రభువు యోచిస్తున్న సమయంలో ఆయనకు లకుమ గురించి తెలిసింది.

బాపట్లవారి భరతరీతిని గురించి అంతకుముందే వినియుండడంచేత ఆయన తన సైన్యాధిపతి దొరపరెడ్డిని బాపట్ల పంపాడు. ఆయన వెంట రెండు ముత్యాల పల్లకీలు పంపాడు. ఒకటి ఆస్థాన నర్తకీమణిగా లకుమను ఆహ్వానించడానికి, రెండవది ఆమె తల్లి మల్లమ్మ ఆస్థానాన్ని సందర్శించమని ఆహ్వానించడానికి. మహారాజావారిచ్చిన ఆహ్వానలేఖలను దొరపరెడ్డి మల్లమ్మకు అందజేశాడు.

లకుమను భావనారాయణునికి పూజా పుష్పంగా సమర్పించుకొనడానికి సిద్ధంగా నున్న సమయంలో ఈ లేఖలు అందాయంటే ఆ భగవంతుడే ఆమెను ఆ భూమీశుని సేవకు నిర్ణయించాడని, ఆదే ఆ దేవుని ఆజ్ఞ అయితే అసమ్మతిలో తాను అడ్డుకొనడం సాధ్యం కాదని ఆమె తలిచింది. తరతరాలుగా తన వంశీయులు ఈ భావనారాయుణ్ని సేవించి తరించారు. కనుక ఈ విషయంలో తన ప్రమేయం ఉండకూడదని నిశ్చయించుకొని తుదినిర్ణయాన్ని లకుమకే ఆమె వదిలిపెట్టింది.

రాజనర్తకిగా ఖ్యాతి గడించి చరిత్ర పుటల్లో స్థిరస్థాయిగా ఉండి పోయే అవకాశాన్ని ఇమ్మనమని లకుమ తల్లిని వేడుకొంది.

"అదే నారాయణుని నిర్ణయమయితే, నాకెందుకమ్మ అభ్యంతరం? అలాగే వెళ్ళు" అని మల్లమ్మ అంగీకరించింది. నిర్ణీత ముహూర్తానికి లకుమ తన దాసదాసీ జనాన్ని తీసికొని కొండవీడు పయనమయింది. "నేను భావనారాయణుని

సేవకురాలను. నాకు ఈ ఆస్థాన మర్యాదలతో పనిలేదు" అంటూ మల్లమ్మ కొండవీడు ప్రభువు ఆహ్వానాన్ని స్వీకరించలేదు. లకుమ మాత్రమే కొండవీడు వెళ్ళింది. ఆస్థాన నర్తకిగా ఈమె నియమించబడింది. కొమరగిరి ప్రభువు రాజ్య భారానంతా తన బావమరిది కాటమదేవునికి అప్పగించి 'వసంతరాజీయం' రచనలో పడ్డాడు. అలా కొన్ని ఏళ్ళు గడిచిపోయాయి.

మల్లమ్మ వృద్ధురాలయింది. అంత్యదినాలు సమీపించాయి. ద్రాక్షారామ భీమేశ్వరాలయంలో తన పేర అఖండదీపారాధన చేయించమని తన కుమార్తెకు తన చివరి కోర్కెగా లేఖ వ్రాసి పంపింది. ఆమె చనిపోయింది. కొడుకూ, కూతురూ గూడా లకుమే గనుక తల్లి కోర్కెను తీర్చడానికి లకుమ నిర్ణయించు కొంది.

ఆ కాలంలో ఆ భీమేశ్వరాలయంలో నృత్యపూజ ఉండేది. ఈ పూజకు కొన్ని ఎన్నికైన కుటుంబాలవారే అర్హులు. ఎవరు పడితే వారు గజ్జెకట్టి ఆ యాలయంలో నృత్యం చేయడానికి వీలుండేది కాదు. ఇది ఆ యాలయ సంప్ర దాయం.

కొండవీటి ప్రభువులు శివకేశవులను సమానంగా ఆరాధించేవారు. అందు వల్ల కొమరగిరి ప్రభువు మల్లమ్మ కోర్కెను విని మన్నించదలచాడు లకుమతో గూడ తాను ద్రాక్షారామం పయనమై వెళ్ళాడు. ఒకానొక పౌర్ణమినాడు మల్లమ్మ పేర భీమేశ్వరాలయంలో అఖండదీపారాధన చేయించాడు. ఆనాటి సాయంత్రం స్వామివారి సంధ్యపూజలో వందమంది నర్తకీమణులు స్వామివారికి సహస్ర హారతు లిచ్చి, కైవారాలతోబాటు నాట్యపూజ చేశారు. ఆ నృత్యపూజను తిలకించిన కొమర గిరికి "ఈ పుణ్యసమయంలో భీమేశ్వరుని సన్నిధిలో లకుమ నాట్యం చేయా" లన్న కోర్కె కలిగింది. ఆ కోర్కెను లకుమకు చెప్పాడు.

"నేనా ప్రభూ! ఆ యర్హత నాకు లేదు. నేను మీ ఆస్థాన నర్తకిగా నియ మింపబడిననాడే నా కా అర్హత పోయింది మహారాజా!" అని ఆమె విన్నవించింది.

"వసంతరాజీయం నాట్యశాస్త్రకర్త, కొండవీటి ప్రభువు, ఈ కర్పూర వసంతరాయుడు నిన్ను కోరుతున్నాడు లకుమా!" అన్నాడు ఆ కొండవీటి ప్రభువు.

"శాసనాలను చేసినవారే శాసనాలను ధిక్కరిస్తారా ప్రభూ?"

"నా కోర్కె ఒక శాసనం!"

"దైవసాన్నిధ్యంలో మానవ శాసనాలకు విలువలేదు ప్రభూ!"

"నా శాసనంతో నిన్ను బలవంతపెడితే!"

"నాకు మరణమే శరణ్యం ప్రభూ!" అంటూనే తన బంగారు వడ్డాణంలో మరుగు పరచియున్న చురకత్తిని ఆమె పైకి తీసింది. కొమరగిరి ప్రభువు నిశ్చేష్టుడై నిలచిపోయాడు.

# రంగాజమ్మ

కళాకారులు, కవులు, పండితులు స్వేచ్ఛాజీవులు, ఆత్మాభిమానంగలవారు. ఆత్మగౌరవాన్ని కాపాడుకొనడం వారికి తెలుసు. వారు ఒకరిని నొప్పించరు, తమను ఎవరైనా నొప్పిస్తే సహించరు.

రంగాజమ్మ పసుపులేటి వెంకటాద్రి నాయుని కుమార్తె. విజయరాఘవుని ఆస్థాన కవయిత్రి, అష్టభాషా ప్రవీణ, సుప్రసిద్ధ యక్షగాన రచయిత్రి, విజయ రాఘవుని ధర్మపత్ని. విజయరాఘవుడు రణరంగంలో నిపుణుడు, కవి పండిత పోషకుడు. స్వతహాగా కవి ఎన్నో యక్షగానాలను రచించినవాడు. ఆయన రచించిన యక్షగానాలను చదివితే ఆనాటి ఆస్థాన మర్యాదలు, కవిపండిత పోషణ నృత్య సంగీతాది కళల తీరులు, అలంకరణ రీతులు, పండిత సత్కారాలు మొద లైన వెన్నో తెలుసుకొనవచ్చును. ఈ రచన ఒక చారిత్రక కైఫియత్ వంటిది.

నాయక ప్రభువులు విష్ణుభక్తులు. మన్నారు రాజగోపాలుడు వీరి ఇలవేల్పు. వీరి దర్బారులో కవులు, పండితులు, గాయకులు, నాట్యశాస్త్రవేత్తలు, నర్తకులు. బహుముఖ ప్రజ్ఞావంతులు మొదలైన వారెందరో కొలువుతీరి ఉండగా రంగాజమ్మ తాను రచించిన "మన్నారుదాసు విలాసం" అనే గ్రంథాన్ని విజయరాఘవునికి అంకితమిచ్చింది.

సంస్కృతం, తెలుగు, తమిళ, కన్నడ, భాషలందేకాక, పాళీ ప్రాకృతం మాగధి, శౌరసేని భాషలందు గూడా తన పాండిత్య ప్రతిభను తెలియజేయ డానికి ఆ గ్రంథంలోని కొన్ని పద్యాలు యీ భాషలలో రచించింది.

అంతటి మహా పండితురాలు వ్రాసిన ఈ కవితను అంకితం తీసికొన్న విజయరాఘవ నాయకుడు ఆమెను కనకాభిషేకంతో గౌరవించాడు. సాయంత్రం ప్రారంభింపబడిన ఆ సభ ఆ మర్నాటి ఉదయం వరకు కొనసాగింది, మంగళ వాద్యకులు భూపాల రాగాన్ని ఆలపించారు కోటపైని నగారా మ్రోగింది. నవబత్ సంగీతం వినిపించింది.

ఆ క్రిందటి సాయంత్రం సభ ప్రారంభించే సమయంలో మహారాణీ వారు తమ అంతఃపురంలో అద్దంముందు కూర్చుని అలంకరించుకొంటున్నారు ప్రౌఢ, అనుభవజ్ఞురాలైన ఒక చెలియ జడవేసి అలంకరిస్తున్నది. మహారాణి వారు ముచ్చటగా ఆ జడను చూసుకొని, చిరుకోపాన్ని అభినయిస్తూ "రాజనిభాననా! సరసురాలవు, ఈ జడను జబ్బుగా నల్లినా వేమే?" అని చేటియను అడిగింది.

నవరత్నాలు తొడిగిన జడగంటలతో శోభిస్తున్న జడను పరీక్షించి, అందు లోప మేమిటో తెలియక ఆ చేటియ ఆశ్చర్య పడి "ఇంత కంటే బాగా ఎవరు వేయగల" రంది.

"వలనొప్ప, బిగించి అల్లవే ఓ జవరాలా! ఈ జడతో వేరొక పని ఉంది" అంది మహారాణి.

మహారాణీ వారి ఆంతర్య మెరిగిన ఆ చెలియ మహారాణి బుగ్గ మీద మీటి, "దోషం దోషమే చెలీ! విజయరాఘవ మహారాజు మేను తళిరాకే కోమలీ!" అంది.

మహారాణీ వారి ముస్తాబు ముగిసింది. సర్వాలంకార శోభితయై ఆమె ముచ్చటగా అలంకరించబడిన శయ్యామందిరానికి వెళ్ళి స్వామికొరకు వేచియుంది.

నడిరేయి గడిచింది గాని స్వామివారు రాలేదు. తెల తెలవారుతూంది, అంతఃపుర దాసీలు మేల్కొలుపులు పాడుతున్నారు కాని విజయరాఘవుని జాడ లేదు. మహారాణీవారి హృదయం కోపంతో భగ్గుమంది. ఆ గడిచిన రాత్రంతా విజయరాఘవుడు రంగాజమ్మ సేవలోనే గడిపియుంటాడని ఆమె భావించి, తన కోపాన్నంతా వెళ్ళ గక్కుతూ రంగాజమ్మకు ఒక లేఖ వ్రాసి తన చెలికత్తె ద్వారా ఆమెకు పంపింది.

ఆ క్రితం రాత్రంతా నిద్ర లేకుండా సాహిత్య గోష్ఠితోనే రంగాజమ్మ గడిపింది. ఉదయమే తన యిల్లు చేరి, స్నానం చేసి, బంగారు తూగుటుయ్యాల్లో విశ్రాంతి తీసికొంటున్న సమయంలో మహారాణి వారి చేటి ఆ కమ్మను అందించింది. ఆ ఉయ్యాలలో నెమ్మదిగా ఊగుతూ, ప్రశాంతంగా రంగాజమ్మ ఆ లేఖను

చదువు కొంది. ఆమె పెదవుల పైన చిరునవ్వు వెల్లివిరిసింది. ఆ లేఖకు ఇలా జవాబు వ్రాసింది.

" ఏ మగువల్ మము దలంప నేమి పనో?
తమ రాడువారు కారో?
వలపించు నేర్పెరుగరో తమ కౌగిటలో నుండగా
రావది ఏమిరా విజయరాఘవ అనుచు ఇలు దూరి
బలిమిన్ పైబడి పెనుంగుకొని వచ్చితినా తలోదరీ!"

ఈ కమ్మకు కస్తూరి, పునుగు, జవ్వాది, చందన లేపములను పూసి పంపింది. ఎలాంటి యుగమది? ఒకరితో నొకరు పరుషము లాడుకొనుట కూడా కవిత్వంలోనే!

# కుహ్వాయి

విజయనగర సంస్థానంలోని శ్రీకృష్ణ దేవరాయుని కొలువు కూట మొక భువన విజయం. రాయలువారు రత్నఖచిత సింహాసనంపై ఆశీనుడై యున్నాడు. తాతాచార్యులు తన శిష్య బృందంతోను, అప్పాజీ తన పాలక వర్గంతోను, అష్ట దిగ్గజాలు ఇతర కవి పండితులతోను, విదేశీ యాత్రికులు, రాయబారులు ఆ దర్బారును అలంకరించారు.

రత్నాలను తొడిగిన ఒక బంగారు అందెను రాయలువారు ఖాళీగా నున్న ఒక ఆసనంపై నుంచారు. ఆ యాసనాన్ని అలంకరించడానికి ఎవరు అర్హులు? కరకు ఖడ్గాన్ని ధరించి, ఎన్నో యుద్ధాలలో జయాన్ని చేకూర్చిన "దేశభాషలందు తెలుగు లెస్స" అన్న తేనె లొలికే తెలుగు భాషలో ఆముక్త మాల్యదను రచించిన, రాజదండాన్ని ధరించి యావత్ దక్షిణా పథాన్నేలిన దక్షిణ హస్తంతో ఆ యందెను తొడిగించు కొనటకు అర్హు లెవరు?" అని ఉద్దండులైన ఆ కవి పండితుల్ని అడిగి తన ఎడమ చేతితో కుడిమీసాన్ని రాయలువారు మెలివేశారు. ఐతే ఆ యర్హత ఎలాంటికో గూడా తెలియజేశారు

సంస్కృతాంధ్ర భాషల్లో సమాన పాండితీ ప్రతిభతో ఆశువుగా కవిత్వం చెప్పగలగాలి. పద్యంలో మొదటి సగాన్ని తెలుగులోను రెండవ సగాన్ని సంస్కృతంలోను చెప్పగలగాలి. ఈ షరతులను విన్న కవి పండితులు నిశ్శబ్దంగా కూర్చున్నారు ఉత్కంఠతతో ఇతరులు వేచి యున్నారు. గడియలు గడిచాయి. నిమిషాలు గడుస్తున్నాయి."

నన్ను అధిష్టించడానికి అర్హత గలవాడు లేడా?" అన్నట్టు ఆ యాసనం వెల వెల బోతూంది. "ఈ భువన విజయంలో ఈ గండపెండేరాన్ని తొడిగించు కొనడానికి అర్హులే లేరా?" అని ఆ మెలివేసిన కుడి మీసాన్ని దింపివేయడానికి రాయలువారి ఎడమ చేయి మీదకు వెళ్ళ బోతున్న సమయంలో, "ఆగండి మహారాజా! ఇంకా ఈ పెద్దన జీవించే ఉన్నాడు" అంటూ అల్లసాని పెద్దన్న లేచి, నిండు

సభను చూచి, ఆశువుగా ఉభయ భావల్లోను పద్యాన్ని చెబుతూ, గండపెండేర మున్న ఆసనం వద్దకు నడిచి వెళ్ళి, తన ఎడమ కాలును దానిపైని మోపాడు.

రాయలు ఆ పద్యాన్ని విని, ఆనందించి, జల జల ఆనందాశ్రువులను రాలుస్తూ సింహాసనం నుండి దిగి పెద్దన వద్దకు వచ్చి, తమ దక్షిణ హస్తంతో పెద్దన్న గారి వామ పాదానికి ఆ గండపెండేరాన్ని అలంకరించారు. సభలోని వారందరూ కరతాళ ధ్వనులను పలికించారు.

రాయలువారు మళ్ళా సింహాసనాశీనులై మందరంగా గంటను మోగించారు. విద్వత్ సభా రంజక రంజకం శ్రీ రంగరాజు తన వాద్యబృందంతో సభలోకి ప్రవేశించి సభకు నమస్కరించి ప్రత్యేకంగా అలంకరించబడిన రంగస్థలంపైకి వెళ్ళాడు. వాద్య బృందంవారు కుతుపాన్నిచేసి, సంసిద్ధులైనారు. మేళప్రాప్తి జరిగింది. ముఖవీణపైని అంబరం జరిగింది. ఆయిుత్తగానాన్ని వాద్యకులు ప్రారంభించారు ఇరుప్రక్కలా కాగడాలు వెలుగుతూ ఉండగా ఇద్దరు జవ్వనులు తెరపట్టుకోగా, ఆస్థాన నర్తకి కుప్పాయి రంగప్రవేశం చేసింది.

ఆయిత్తగానం ముగియగానే తెర తొలిగింది. తల పుష్పపుట కరణంలో కుప్పాయి నిలబడియుంది. నాట్యాచార్య రంగరాజు స్తోత్ర చూర్ణికను ఆలపించాడు. కుప్పాయి సభకు పుష్పాలను సమర్పించి, ప్రక్కకు వెళ్ళి సువర్ణ మంజీరాలు ధరించి వచ్చి, సమస్థానకంలో నిలబడింది.

ఖండగతిలో అడ్డితగీతాన్ని ఆ యాచార్యుడు నాటరాగంలో ప్రారంభించాడు. ఆమె విన్యాసం చేసింది. అడ్డితతో ప్రారంభమైన గీతం మొహరతో ముగిసింది. తర్వాత రాయలు వారికి కైవారాన్ని సమర్పిస్తూ ఆమె నృత్యమాడింది.

ఈవిధంగా నాటరాగంతో ప్రారంభమైన కేళిక, నృత్త, నృత్య, అభినయాల ప్రదర్శనానంతరం సురటిరాగంతో ముగిసింది.

మంత్ర ముగ్ధులై, రసలోకంలో విహరిస్తూండిన సభికులు కేళిక ముగిసినా అలా చూస్తూనే ఉండిపోయారు ఇంతలో ఆమె తన సువర్ణ మంజీరాలను విప

తన పరిచారికకు అందించి సభకు నమస్కరించింది. సభికుల కరతాళధ్వనులు వినిపించాయి. సభలోని వారంతా "భేష్" అన్నారు.

రాయలువారి ఆస్థాన నర్తకి పదవి నలంకరించిన ఆ కుప్పాయి గొప్ప నాట్యవిద్వాంసురాలు. ఆమెకు భరత విద్యను చక్కగా నేర్పి, ఆమెకు లాస్య నర్తనాన్ని రంగరించిపోసిన ఆమె తండ్రి, గురువు ఆచార్య రంజకం శ్రీరంగ రాజు గొప్ప నాట్యవిద్వాంసుడు అందుకే ఆయనకు "విద్వద్సభారాయ రంజక" అన్న బిరుదును రాయలవారు ఇచ్చారు. ఆనాటినుండి "రంజకం" అన్నది వారింటి పేరయింది. ఇదంతా ఒక చారిత్రక కథ. వేరొక కథ చెప్తాను వినండి.

లోకానికి చంద్రుడు ఎంతో మేలు చేస్తున్నాడు జారులకు, చోరులకు, విరహినులకు వియోగులకు, ప్రియులకు అభిసారికలకు, కవులకు గాయకులకు, వీరూ వారూ అని చెప్పనేమెందుకు పృథ్విలోని సమస్త జీవకోటికి అతని చల్లని వెన్నెల ఎంతో మేలు చేస్తున్నది. అతనివల్ల ఎంతో మేలు పొందుతున్నా అతనిలో మచ్చ ఒకటి ఉందని లోకం అంటుంది. ఆ మచ్చని మరిచిపోకూడదూ? మరిచి పోదు, అది లోక సహజం. అలాగే హిందూ మతాన్ని, హైందవ కళలను సంర క్షించి, వాటిని ఎన్నో విధాలుగా వికసింపజేసిన, మహనీయుడూ, శౌర్యవంతుడూ అయిన కృష్ణదేవరాయ సార్వభౌమునికి ఒక మచ్చ ఉందని లోకం అంటూ ఉంటుంది. అతనొక దాసీపుత్రుడని లోకంలో ఒక అపవాదు ఉంది. అది సందేహా స్పదమైన విషయం. నిజం దేవు డెరుగు అన్నారు.

ఆయన కాలంలో కొన్ని ప్రముఖ నర్తన కుటుంబాలు ఆనెగొందెలో ఉండేవి. ఆ కుటుంబాలవారు భరత విద్యలో ఆరితేరినవారు. కాని వీరు రాయలు వారి సభను దర్శించలేదు "ఒక దాసీ పుత్రునికి నమస్కరించడమా? అది కళకే అపచారం" అని వీరి విశ్వాసం. అందువల్ల ఈ దేవనర్తకులు ఆనెగొందెను విడిచి పెట్టి కృష్ణా తీరానికి వలసవెళ్ళారు. దివ్యసీమగా పేరుపొందిన దివిసీమ లోని కృష్ణవేణీ సముద్ర సంగమ ప్రవేశమైన హంసలదీవి దాపులో వున్నారు. అక్కడ వెలిసిన వేణుగోపాలస్వామికి ప్రణమిల్లి, ఆ స్వామి సేవకు అంకితమై నర్తన మాడారు. అక్కడ నుండి మరికొంత దూరం వెళ్ళి సస్యశ్యామలమైన ఒక ప్రదేశాన్ని ఎన్నుకొని అక్కడ స్థిరపడ్డారు. వారిలో ప్రముఖ నర్తకి 'సంగి' ఆ నర్తకి పేరున అక్కడ ఒక గ్రామాన్ని నిర్మించుకొన్నారు. అదే

సంగిగడ్డ. తర్వాత ఆ యూరికి రెండు చెరువులను ఇరువురు నర్తకీమణులు తవ్వించారు. ఆ చెరువులు నేటికీ అక్కడ ఉన్నాయి. ఆ ప్రాంతానికి వీరి నృత్యకళ వల్ల పేరు వచ్చింది. ఆ ప్రాంత పరిసరాల్లో గల అన్ని ఆలయాల్లోను వీరు నృత్య పూజల్ని చేసేవారు. ఈ వంశీయులలో మిగిలియున్న ఆఖరి నర్తకీమణి కృష్ణవేణి ఆమె ప్రస్తుతం కడువృద్ధురాలు.

తపో్ప, ఒప్పో కాని వారొక ఆశయానికి కట్టుబడ్డారు. ఒక ఆదర్శాన్ని విశ్వసించారు. తమ సంప్రదాయాన్ని గౌరవించుకొన్నారు. రాయల వారి ఆస్థాన మహా భోగాలను స్వీకరించకుండా త్యాగం చేశారు. సామాన్య జీవితాన్ని గడుపుతూ నృత్య సరస్వతిని ఆరాధించారు. ఆ రోజుల్లో ఇంతటి త్యాగాన్ని చేయడం సామాన్య విషయం కాదు. అందువల్ల వీరు నిజమైన త్యాగధనులు. వీరి జీవితాలు ధన్యమైనవి.

ఆంధ్ర మహా సామ్రాజ్యానికి తొలి రాజధాని కృష్ణాజిల్లాలోని శ్రీకాకుళం. అది నేడు కృష్ణవేణమ్మ పొత్తిళ్ళలో ఉంది. ఆ కాకులేశుని ఆలయం తన పూర్వ వైభవాన్ని కోల్పోయి దీనంగా నిలిచియుంది. ఇక్కడ స్వామివారికి వైఖానస ఆగమ రీతిలో పూజలు జరుగుతూ ఉంటాయి.

మహా విష్ణువు కుడి చేతిలో చక్రం, ఎడమ చేతిలో శంఖం ఉండడం సర్వ సాధారణంగా మనం చూస్తూంటాం. కాని ఈ యాలయంలోని విష్ణువుకి కుడిచేతిలో శంఖం, ఎడం చేతిలో చక్రం ఉన్నాయి. ఇదొక విచిత్ర విషయం. దీనికి కొన్ని కారణాలున్నాయంటారు పెద్దలు. ఇలాగే పశ్చిమ గోదావరి జిల్లాలోని కొవ్వూరు సమీపంలో గోదావరినది మధ్యలో నున్న ఒక గుట్ట పైని వెలిసిన విష్ణువు కుడి చేతిలో శంఖం, ఎడమ చేతిలో చక్రం ఉన్నాయి. ఈ విష్ణువు భావన్నారాయణుని రూపంలో ఉన్నాడు. ఇలాంటి వింతలూ, విడ్డూరాలు మన ఆంధ్రప్రదేశ్‌లో ఎన్నో ఉన్నాయి.

ఈ శ్రీకాకులేశుని ఆలయంలో ముద్దుపళని అనే ఒక నర్తకి స్వామి వారికి నృత్య పూజ చేసేది. ఆమె తంజనాయికి కుమార్తె.

ఆ కాలంలో మహారాష్ట్ర రాజులు తంజావూరును పరిపాలిస్తూ ఉండేవారు. నాయక రాజుల తర్వాత మహారాష్ట్రులు తంజావూరును ఆక్రమించుకొన్నారు.

# తారావతి - హేమావతి

తురుష్కుల పాలనలో మన ఆలయ సంప్రదాయాలకు, లలితకళలకు, ఎటువంటి ప్రోత్సాహం సాధారణంగా ఉండేది కాదు. అంతేకాదు వారు మన దేవాలయాలను గొల్లగొట్టారు. కోటలూ, పేటలూ అగ్నికి ఆహుతి చేసేవారు. స్త్రీలను చెరబట్టేవారు సుందర శిల్పాలను ఖండ ఖండాలుగా చేసి పారేసేవారు. జుట్టు పన్నులను, పిలక పన్నులను విధించేవారు. ఇలాంటివారి పాలనలో మన నృత్యకళకు ప్రోత్సాహం ఎలా లభిస్తుంది?

అక్బర్ పాదుషా రాజపుత్ర వనితను వివాహమాడేడు. ఆమెను పట్ట మహిషిని చేశాడు. వారికి కలిగిన పుత్రునికి సామ్రాజ్యాధిపత్యాన్ని ఇచ్చాడు. కాని తన కుమార్తెను ఒక హిందువుకిచ్చి పెళ్ళిచేయడానికి సంశయించాడు. అక్కడ తన రాజరిక సంప్రదాయాలు అడ్డు వచ్చాయి.

ఇంక ఔరంగజేబుని గురించి చెప్పవలసింది ఏముంది? అతడు పూర్తిగా ఖురాన్‌ను అవలంబించినవాడు. భారతదేశ సమ్రాట్టు అయ్యుండి కూడా తన జీవన భృతికి స్వయంగా టోపీలు కుట్టుకొని డబ్బు సంపాదించుకొనేవాడు. అతడు అంత నిష్ఠాపరుడు.

మహమ్మదీయ మత గ్రంథాల్లో లలితకళలు నిషేధింపబడ్డాయో లేదో నాకు తెలియదుగాని ఔరంగజేబు వీటికి వ్యతిరేకి.

అక్బర్, జహంగీర్, షహజహాన్ చక్రవర్తుల కాలంలో లలిత కళలకు మంచి ప్రోత్సాహం లభించింది. ఇవి మహోన్నత శిఖరాలను అందుకొన్నాయి. అక్బర్ పరిపాలనా కాలంలో తాన్‌సేన్ తన సంగీతంద్వారా ఒక దివ్య సందే శాన్ని లోకానికి అందించాడు రస గంగాధరాన్ని రచించిన తెలుగు కవి పండిత జగన్నాథ రాయలు షహజహాన్ దర్బారుకు వెళ్ళి ఆయన్ను మెప్పించి ఆస్థాన కవి అయ్యాడు. ప్రసిద్ధ నర్తకి లవంగిని ఆయన పరిణయమాడాడు. కొందరు

మొగల్ చక్రవర్తులు మన లలితకళలను పోషించినా ఔరంగజేబు పాలనలో వీటికి ఆదరణ లేకపోవడమేకాదు, నాశనమయ్యే స్థితికి వచ్చాయి. ఆనాటి కళాకారులు కవులు, గాయకులు, పండితులు ఈ దుస్థితిని భరించలేక ఔరంగజేబు కళ్ళు తెరిపించాలని ప్రయత్నించారు.

ఒకనాడు వారు ఒక లలితకళల దిష్టిబొమ్మను తయారుచేశారు. దానికి పాడికట్టి పడుకోబెట్టారు. ఒకడు కుండ పట్టుకొని ముందు నడుస్తూంటే నలుగురు ఆ పాడిని మోస్తూ నడిచారు. వారివెనక అనేకమంది శోక రాగాలను తీస్తూ శ్మశానంవైపు బయలుదేరారు.

ఆ లలితకళామ తల్లి చాలా అందమైనదని, అందర్నీ మురిపించేదని, అందరినీ అలరించేదని కూడా పాడుతూ వారంతా వెళ్తూంటే, ఆ నగరంలోని కళాకారులు, కళాప్రియులు కళాపోషకులు తండోపతండాలుగా వచ్చి వారి వెనుక నడవడం మొదలు పెట్టారు. ఆ ఊరేగింపు అలా వెళ్తూ, వెళ్తూ ఔరంగజేబు పాదుషావారి కోట గుమ్మం చేరుకొంది. పాదుషావారు తమ గోడు వినాలని, వారు తమ గోడును ఆలకించి, పరివర్తనం చెంది, కళలయెడ సుముఖుడు కాగలడని ఆశించి ఆ కోటగుమ్మంవద్ద మరింత గట్టిగా, హృదయవిదారకంగా శోక రాగాలు తీయడం మొదలు పెట్టారు ఆ గాయకులు. రాళ్ళనే కరిగించగల సంగీతం పాదుషావారి హృదయాన్ని కరిగించకపోతుందా అని వారు ఆశించారు.

కోటలో దీక్షతో టోపీలు కుట్టుకొంటున్న ఔరంగజేబు పాదుషావారి చెవులకు సోకింది ఆ గానం. వారి దీక్షకు అంతరాయం కలిగింది. ఆ గానాన్ని వింటూంటే ఆయన హృదయం ద్రవించించి, వెంటనే ఆయన తన ఆంతరంగిక నౌకర్ని పిలిచి, "ఆ విషాద సంగీతానికి కారణమేమిటి?" అని అడిగాడు. సంగీత ప్రియుడైన ఆ నౌకరు మంచి సమయం దొరికిందని, పాదుషావారికి తాను చెప్పవలసిన నాలుగు ముక్కలు చెప్పవచ్చునని సంతోషించి "మహాప్రభూ! తమ సామ్రాజ్యంలో సంగీతం అకాల మృత్యువుకు బలైందని కళాకారులు విలపిస్తూ ఆమెను శ్మశానానికి రాజావీధి ద్వారా తీసికొని వెళ్తున్నారు," అని గద్గద స్వరంతో, వినయంగా సమాధానం చెప్పాడు.

ఒక్క క్షణం ఔరంగజేబు పాదుషా ఆలోచించాడు. ఒక నిర్ణయానికివచ్చాడు "పాపం! సంగీతం చచ్చిపోయిందా! శ్మశానంలో చక్కగా, లోతుగా ఒకపెద్ద గొయ్యితీసి పాతిపెట్టమని చెప్పు. మళ్ళా అది బ్రతికి బయటకు రాకుండా దాని మీద బండరాళ్ళు వేసి పాతిపెట్టమను" అని చెప్పి, తనలో తాను ముసిముసిగా నవ్వుకొన్నాడు. మళ్లా టోపీలు కుట్టుకొనడంలో నిమగ్నుడై పోయాడు.

ఇటువంటి ఘనమైన అనాదరణ మన సంగీతానికి ఇతర కళలకు ఢిల్లీ దర్బారులో లభిస్తూండిన కాలంలో దక్కన్ గోలుకొండ పాదుషాలు వాటిని ఆద రించారు పరిమళ పుష్పాల పూజలను రత్నాల స్వర్ణ పళ్ళేలతో ముత్యాల హారతు లను కళామతల్లి అందుకొంది.

ఒక పాదుషా సంస్కృతాన్ని నేర్చుకొని ఆ భాషలో ఒక అలంకార శాస్త్ర గ్రంథాన్ని రచిస్తే, వేరొక పాదుషా ఒక నూతన నృత్య సంగీత రచన జక్కిణిని సృష్టించాడు కవులను పండితులనే కాక వివిధ కళావేత్తలను గూడా వీరు ఆదరించి పోషించారు. క్షేత్రయ్య వంటి వాగ్గేయకారుణ్ని పరీక్షించే టంతటి ప్రముఖ శాస్త్రవేత్తలు తులిసిమూర్తి వంటి వారు వీరి ఆస్థానంలో ఉండేవారు.

ఈ గోలకొండ పాదుషాల కాలంలోనే ఉర్దూభాష చక్కగా పెంపొందింది. కళలలో ముఖ్యంగా నృత్యకళకు ఎంతో ఆదరణ లభించింది. వీరి కాలంలోనే తారామతి, ప్రేమామతి అనే ఇద్దరు గొప్ప కళావేత్తలు ఉండేవారు. గోల కొండకు వెళ్ళే దారిలో వీరుండిన భవన శిథిలాలు నేటికి గోచరిస్తు ఉన్నాయి. ఆ శిథిలాలలో నుండి మనకు విషాద సంగీతం వినిపిస్తూనే ఉంటుంది. ఒకప్పుడు అది వీరి మహలు. ఆ మహల్లో కూర్చుని ప్రేమామతి పాడుతూంటే నవాబుగారు తన కోటలో కూర్చుని ఆ సంగీతాన్ని ఆలకిస్తూ ఆనందించేవారు. ఆ గానామృతాన్ని వినే అదృష్టం ఆయనకే దక్కింది.

తారామతి ఒక ప్రముఖ నర్తకీమణి. ఆమె తన మహల్ నుండి పాదుషా వారి కోటకు ఒక దట్టమైన ఇనుప తీగపై నడిచి వెళ్ళేది. కోటలో కేళిక చేసి, తిరిగి ఆ ఇనుప తాటి పైని నడిచి వచ్చేది. ఈ సాహస కార్యం చరిత్ర పుటల్లో నిలిచిపోయింది.

తారామతి, ప్రేమావతి, ఇద్దరూ తెలుగు వనితలు. తెలుగు, ఉర్దూ భాషలు రెండూ క్షుణ్ణంగా నేర్చినవారు తెలుగు పాటలనే కాక ఉర్దూ భాషలోని గజలు, టుమ్రీలు, టప్పా, ఖ్యాల్ మొదలైనవి గూడా వీరు పాడేవారు. పారశీ, సంస్కృత భాషల్ని గూడా వీరు అభ్యసించారు. క్షేత్రయ్య పదాలను ఎంత చక్కగా పాడి అభినయించే వారో అంత చక్కగా ఉర్దూ కవితలను గూడా పాడి, వీరు ఆడేవారు అభినయించేవారు.

ఆ కాలంలోనే గోలకొండ పాదుషా అబుల్‌హసన్ తన పరివారంతో రాచ కార్యం పైన కృష్ణా జిలాలోని బందరు వెళ్ళారు. ప్రయాణ బడలికను తీర్చుకొనడానికి ఆయన సముద్ర తీరాన ఒక చోట మజిలీ చేశారు. ఆ సమయంలో ఆ ప్రాంతాన కొందరు బ్రాహ్మణ భాగవతులు వీధి నాటకాలను ప్రదర్శించడానికి వచ్చి ఉన్నారు. ఆ సంచార భాగవతులు అమాత్యులను ఆశ్రయించి, పాదుషా వారి వినోదార్థం ఒక వీధి భాగవతాన్ని ప్రదర్శించారు. ఆ పాదుషా వారితోబాటు పరివారము అందరూ, తారామతి, ప్రేమావతులు ఆ కేళికను తిలకించి ఆనందించారు. ఆ నిష్ఠాగరిష్ఠులైన ఆ బ్రాహ్మణ కళాకారుల పేదరికానికి వారి హృదయం ద్రవించింది కళాపోషకులైన ఆ పాదుషా వారు ఈ బీద బ్రాహ్మణులకు ఒక అగ్రహారాన్ని ఇనాముగా ఇచ్చారు. అదే నేటి కూచిపూడి. వారే కూచిపూడి భాగవతులయ్యారు.

తారామతి, ప్రేమావతులు ఆ నవాబు గారి ఆస్థాన కళాకారులు. తమ జీవితాంతం ఆ పాదుషా వారిని తమ కళా ప్రావీణ్యంతో మెప్పించవలసినవారు. అది వారికి ఒక అగ్నిపరీక్ష. అయినా ఆ పాదుషావారు వారికి ప్రత్యేకంగా మడులు, మాన్యాలు వ్రాసి ఇవ్వలేదు. ఒకే ఒక్క రాత్రి ఒక భాగవతాన్ని ప్రదర్శించినందుకు ఈ బ్రాహ్మణ భాగవతులకు ఒక అగ్రహారాన్నే పాదుషావారు ఇనాముగా ఇచ్చారు. అయినా వారికి కినుక రాలేదు. మంత్రివర్యులు బ్రాహ్మణ పక్షపాతులై వారికి అగ్రహారాన్ని ఇప్పించారని దూషించలేదు. అదే ఈ కాలంలో అయ్యుంటే ఆ యిద్దరూ అడ్డుపడేవారేమో! తారామతి, ప్రేమావతి ఆ భాగవతులను హృదయ పూర్వకంగా అభినందించారు. ఆ విశాలహృదయు లిద్దరూ నిజమైన కళాకారులు

తెలుగుజాతి చరిత్రలో ఈ పాదుషా వారి కళాపోషణ చిరస్థాయిగా నిల్చిపోయింది ఈ గోల్కొండ నవాబు గారి కోట శిథిలమై పోయినా తారామతి, ప్రేమామతుల మహళ్ళు మొండిగోడలుగా దర్శనమిస్తున్నా కూచిపూడి అగ్రహారం మాత్రం నాట్యానికి నిలయమై విరాజిల్లుతున్నది

# భాగామతి

గొల్లకొండను ముఖ్యపట్నంగా చేసికొని తెలుగునాడును పాదుషాలు పరిపాలించిన కాలమది. పాదుషాలు మహమ్మదీయులే అయినా ఇతర తురుష్కుల్లాగా కాక తెలుగు ప్రజలను, తెలుగు సంస్కృతిని గౌరవించారు, తెలుగుభాషను పోషించారు హిందుమతం యెడల సహనం చూపించారు. తెలుగువారి మత విశ్వాసాలను ఆదరించారు. తెలుగు కవిత యెడల మక్కువ చూపించారు.

నేటి ఉర్దూ భాషకు మాతృక అయిన దక్కని అనే భాష వీరి ఆస్థానంలోనే రూపొందింది. వీరి రాజ్య పరిపాలనలలో మతసామరస్యం ఉండేది కాని అక్బరు, హుమయూను మొదలైన మొగల్ చక్రవర్తులకు వచ్చిన పేరుప్రతిష్టలు వీరికి రాలేదు. వింధ్య పర్వాతాలను దాటి దక్షిణాదికి వెళ్తే అక్కడేమీ లేదనే అపోహ ఉత్తరదేశాన్ని పాలించిన చక్రవర్తుల కుండేది. దక్షిణ దేశమంతా ఒక కీకారణ్యం, అక్కడ కిరాతకులే జీవించేవారని వీరి హృదయాలలో ఒక ముద్ర పడిపోయింది దక్షిణదేశంలో నాగరికత, సంస్కృతి లేని అటవికులు నివసించేవారని ఈ పాలకులు అనుకొనేవారు. దక్షిణ దేశంపైని వీరికి చులకన భావం ఉండేది.

శాలివాహన, ఇక్ష్వాకుల చక్రవర్తులు ఆంధ్ర నుండి మగధవరకు వారి సామ్రాజ్యాన్ని విస్తరింపజేశారని చెప్పినా ఉత్తరాదివారు తేలిగ్గా కొట్టి పారేస్తారు. ఉత్తరాదిని గురించి మనకు పూర్తిగా తెలుసుగాని ఉత్తరాదివారికి దక్షిణాదిగురించి పూర్తిగా తెలియదు. కనీసం దక్షిణాదిలో ఎన్నిరకాల భాషలను మాట్లాడుతారో వారికి తెలియదు. అలాంటిది దక్షిణాది నేలిన చక్రవర్తులగురించి, ఇక్కడి సుందర మందిరాల గురించి వారికి ఏం తెలుస్తుంది.

అశోకుడు ఉత్తరాదివాడు గనుక అతని గురించి ఉత్తరాది వారికి తెలుసు. కాని కలింగ యుద్ధం గురించి వారికి వివరంగా తెలియదు. వీర మరణం పొందిన

కాలింగుల గురించి వారికి తెలియదు. శౌర్యవంతులైన కాలింగులు అశోకునికి తల వంచక ఆయనతో తలపడడంతో కళింగ యుద్ధంలో రక్తపుటేరులు ప్రవహించాయి. దానివల్లనే అశోకునిలో మార్పు వచ్చింది. అహింసాయుతమైన బౌద్ధ మతాన్ని ఆయన స్వీకరించాడు. ప్రథమ బౌద్ధస్తూపం శాలిహుండంలో నెలకొంది. అయితే ఇవన్నీ ఉత్తరాదిలోని విద్యావంతులకే తెలియవు.

అమరావతిలోని బౌద్ధ స్తూపాలు, సుందర శిల్పాలు హీనయాన బౌద్ధం, ప్రఖ్యాత నాగార్జున విశ్వవిద్యాలయం వీటిని గురించి కూడా మన ఉత్తరాదివారికి సంపూర్ణంగా తెలియదు. నాగార్జుని కాలంలోనే బౌద్ధ మతం ఆంధ్రదేశం నుండి విదేశాలకు విస్తరించినట్టు మన ఉత్తర దేశస్థులకు తెలియదు.

కాని ఎక్కడో మారు మూల నున్న గోండ్వానలోని గోండు మహారాణి దుర్గావతి సలిపిన స్వాతంత్ర్య పోరాటం గురించి, ఝాన్సీలక్ష్మీబాయి గురించి మన దక్షిణాది వారికి తెలుసు. ఝాన్సీలక్ష్మీబాయి గురించి మన స్వాతంత్ర్య సమర గీతాలలో మనం పేర్కొన్నాం. కాని ఒక మహారాజ్యాన్ని స్థాపించడానికి విజయ శంఖం పూరించి, శత్రువుల పాలిట వీర దుర్గగా యుద్ధాలు చేసి, తుదకు ఒక సామ్రాజ్యాన్ని స్థాపించి, పాలించిన మన వీరరుద్రమను గురించి ఉత్తరహిందూస్థానంలో ఎంతమందికి తెలుసు?

మీరాదేవి, సూరదాసు, తులసీదాసుల గురించి మనకు తెలిసినంతగా మన ఉత్తర భారతీయులకు త్యాగరాజు, శ్యామశాస్త్రి, పోతనల గురించి తెలుసా?

అయితే ఇదంతా మన తప్పే. ఉత్తరాదివారు ప్రచారం చేసినట్టు మనం మన గురించి ప్రచారం చేసికోలేదు. వారి చెవుల్లో వీరి గురించి, శంఖం పెట్టి ఊదలేదు. అందువల్ల మన ప్రాచీన సంస్కృతిని గురించి, విశిష్టతను గురించి వారికి తెలియదు. తెలియని విషయాల గురించే మానవుడు ఎక్కువగా మాట్లాడతాడు. ఇది మానవునిలోని సహజ గుణం.

మన గోల్కొండ నవాబుల గురించి ఉత్తరాది వారికి బాగా తెలియదు, వారి పరమత సహనం గురించి అసలే తెలియదు.

గోల్కొండ పాదుషా తానీషా అక్కన్న మాదన్న అనే ఇరువురు బ్రాహ్మణులను తన మంత్రులుగా నియమించాడు. వారి మేనల్లుడే కంచెర్ల గోపన్న. ఇతడు భద్రాచల ప్రాంతానికి తహసిల్దారుగా నియమించబడ్డాడు. అతడు శిస్తుల కింద వసూలుచేసిన రాజధనాన్ని, తానీషా వారి అనుమతి లేకుండా భద్రాచలంలో రామునికి ఆలయం కట్టడానికి వినియోగించాడు. అతడు ఆ ధనాన్ని తన సొంతానికి వినియోగించుకోకపోయినా రాజ ధనాన్ని వినియోగించడం నేరమేగదా! అందువల్ల గోల్కొండ ప్రభువు విచారణ జరిపి, గోపన్న నేరస్థుడని రుజువు అయిన తర్వాత అతనిని గోల్కొండ కోటలోని చెరసాలలో బంధించారు. ఆ రామున్నే నమ్ముకొన్న ఆ రాముడే ఆ అప్పును పాదుషావారికి తీర్చి గోపన్నను జైలునుండి విముక్తుణ్ణి చేశాడు. తానిషా వారికి గూడ శ్రీరామునియందు విశ్వాసం ఏర్పడింది. అందుకే ప్రతి సంవత్సరం సీతారాములవారి కల్యాణానికి ముత్యాల తలంబ్రాలు పంపేవారు. నేటికీ ఆ సంప్రదాయం కొనసాగుతూనే ఉంది. ఆ కంచెర్ల గోపన్ననే అందరూ రామదాసు అన్నారు. ఈ పేరే ఆయనకు స్థిర పడింది. తులసిమూర్తి అనే ఒక తెలుగు కవి పాదుషాల పోషణలో ఉండేవాడు.

ఉత్తరాదిలో మతకలహాలు రెచ్చిపోయి, భారతదేశం ముక్కలు చెక్కలు అవుతున్న ఆ రోజుల్లో ఈ పాదుషాలు మత సామరస్యానికి పాటుపడి ఆదర్శ వంతులైనారు. వీరిని గురించి మనం ఎన్నో కథలు, గాథలు చెప్పుకొంటాం కాని ఉత్తరాదివారికి వీరిని గురించి ఏమీ తెలియదు. వారికి తెలియకపోవడం వారి తప్పుకాదు. వారికి తెలియజెప్పకపోవడం మన తప్పు.

సప్త వ్యసనాలలో మహాఘోరమైన వ్యసనం జూదం. ధర్మరాజు, నల చక్రవర్తి వంటి మహారాజులు తమ రాజ్యాలను ఓడిపోయారు. వారి భార్యలు అవమానాలకు, కష్టాలకు గురైనారు. ఇటువంటి కథల్ని మనం చిన్నప్పుడే చదువుకొన్నా "తోచీ తోచనమ్మ తోటి కోడలి పుట్టింటికి వెళ్ళినట్లు" మనం పేకాటలవంటి జూదాలను నేటికీ ఆడుతూ ఉంటాం. పేకాటలాగే కొందరు కోడి పందేల జూదం ఆడుతూ ఉంటారు.

బొబ్బిలి రాజులు, విజయనగరం రాజులు ఒకప్పుడు కోడిపందేలు ఆడారు. ఇటువంటి పందేలలో ఇరుపక్షాలవారు గెలవడం జరగదు. వీరి పందేలలో విజయ

నగరంవారు ఓడిపోయారు. వారి ప్రమేయం లేకుండానే ఆ రాజకుక్కుటాలు రెండూ పోటీపడ్డాయి బుద్ధిలేని మానవులపంతాలలో నోరులేని ఒకకోడిచనిపోయింది. విజయనగరం రాజావారి పౌరుషం దెబ్బ తిన్నది. ఆయన కండ్లు ఎర్రజేసి, పళ్లు పటపట లాడించి, మీసం మెలివేసి, యుద్ధానికి సిద్ధమైనాడు. కోడి పందేలలో విజయం సాధించిన బొబ్బిలి వారు మరి ఊరుకొంటారా! వారు రెండు చేతులతోను వారి మీసాలు మెలివేసి, రెండు చేతులతోను రెండేసి కత్తులు పట్టుకొని రణ రంగానికి సిద్ధమయ్యారు.

రెండు కోడి పుంజుల పోట్లాట ఇద్దరు రాజులమధ్య యుద్ధానికి దారితీసింది. ఆ రాజులమధ్యా ఏర్పడిన వైరం ప్రజలలో గూడా ఏర్పడింది. ఇరుపక్షాల వారు యుద్ధానికి సంసిద్ధులైనారు. పుణ్య స్త్రీలు తమ భర్తలకు, కుమారులకు వీర తిల కాలను దిద్ది రణరంగానికి పంపించారు. యుద్ధంలో రక్తపాతం తప్పలేదు. ఊళ్లు నాశనమైనాయి. ఆస్తినష్టం, జననష్టం అనివార్యంగా జరిగింది.

మహావీరులైన బొబ్బిలిరాజు, తాండ్ర పాపారాయుడు మొదలైనవారు మరణించారు. విజయనగర విజయరామరాజు మొదలైన వీరులు మరణించారు. బొబ్బిలిరాణి మల్లమ్మదేవి మొదలైనవారు అగ్ని ప్రవేశంచేసి ఆహుతి అయ్యారు. ఇదంతా జరిగింది రెండు కోళ్ళ దెబ్బలాట గూర్చి. ఛీఛీ! తెలుగు పౌరుషం ఎంతకు దిగజారింది!

ఆ తర్వాత ఈ యుద్ధాన్ని వర్ణిస్తూ కవులు తందాన పాటలు వ్రాశారు. ఈ పాటల్ని ఈనాటికీ మనం ఆ ప్రాంతాలలో వీరజంగాలు పాడగా వినవచ్చును.

ఈ బొబ్బిలి యుద్ధంలాగే పల్నాటియుద్ధం గూడా కోడి పందేలతోనే ప్రారంభమయింది. బ్రహ్మనాయుని కోడి ఓడిపోయింది. నాగమ్మ కోడి గెల్చింది. ఓడిపోయినవారి పక్షం వనవాసం చేయవలసి వచ్చింది. గెల్చినవారు ఓడినవారి రాజ్యాన్ని కైవసం చేసుకొన్నారు. "ఎవర్ని అడిగి ఈ పందేలు ఆడారు. మనుష్యులు చచ్చి ఉల్లిపాయలు బస్తారా? మీ పిల్లాసోకు వాడుకోవడ మేనా! ఏమిటి ఈ అన్యాయం?" అని సామాన్య ప్రజల్లోనుండి అడిగే మగవాడే

తక్కువయ్యాడు! వనవాసం తీరిన తరువాత తమ రాజ్యాన్ని తమ కిమ్మనమని మహాభారతంలోని పాండవులు అడిగినట్టుఅడిగారు చేతచిక్కిన రాజ్యాన్ని ఇచ్చివేయ డానికి ఎవరిమనస్సు ఒప్పుతుంది? నాగమ్మ తిరిగి రాజ్యాన్ని బ్రహ్మనాయునికి ఇవ్వ డానికి నిరాకరించింది. దాంతో బ్రహ్మనాయుడు యుద్ధానికి సిద్ధమయ్యేడు రాయ బారాలు జరిగాయి. ఎత్తులకు పై యెత్తులు వేశారు. రాజకీయ తంత్ర కుతంత్రా లతో యుద్ధం జరిగింది. వారివారి మిత్ర రాజ్యాలవారు గూడా ఈ యుద్ధంలో పాలు పంచుకొన్నారు. జననష్టం, ఆస్తినష్టం, జరిగింది. ఎవరికి ఒరిగిందీ ఏమీ లేదు.

"పెండ్లి పెద్దల కంటే పెట్టెలు మోసేవాడి హడావిడి ఎక్కువ" అన్నట్టు అసలువారి కంటే వారి హంగుదారుల హడావిడి ఎక్కువైంది. ప్రజలను యుద్ధా నికి రెచ్చగొట్టారు. అసలు ఈ యుద్ధం ఎందుకు వచ్చింది? ఎవరికోసం ఈ రాజులు యుద్ధం చేస్తున్నారు? ఏ యాశయం గురించి ఈ యుద్ధం చెలరేగింది అని యోచించే వీలు ప్రజలకు కలగలేదు. ఆ విచక్షణా జ్ఞానం ప్రజల కుంటుందా?

కోడి పందేలతో ప్రారంభమైన వైరం నాగమ్మ, బ్రహ్మనాయుళ్ళ మర ణంతో అంతమొందింది. పల్నాడు వల్లకాడయింది. కవులకు మంచి కథావస్తువు దొరికింది. న్యాయాన్యాయాల ప్రసక్తి లేకుండా బ్రహ్మనాయుడు మంచివాడు, నాగమ్మ చెడ్డది అంటూ గేయకథలు వ్రాశారు. దీనిని పల్నాడు భారతమన్నారు.

ఇంతకూ ఈ యుద్ధాలకు మూలం ఏమిటి? జూదం! కోడిపందెం!!

ఈ జూదాలను గొప్పగా అభివర్ణించి, వీర పల్నాటియుద్ధం, వీర బొబ్బిలి గాధా అంటూ కవులు కవితల్లారు. ఇలాంటి గేయకథల్నే అనేక రాజకీయపార్టీల వారు వ్రాయిస్తున్నారు. రాజకీయాలతో సంబంధం లేని సామాన్య ప్రజల్ని రెచ్చ కొడుతున్నారు.

పరమత సహనం గురించి, మతసామరస్యాన్ని గురించి, ఒకర్ని ఒకరు గౌరవించుకొనే విధానాల గురించి తెలియజేసే సంఘటనలు గోల్కొండ నవాబుల చరిత్రలో మిక్కుటంగా ఉన్నాయి. మన చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖించదగ్గ

అనేక ముచ్చటలను వీరి చరిత్రలో నుండి ఎన్నుకొని మన కవులు ఎందుకు చక్కని గాథలను వ్రాయకూడదు?

అక్బర్ గొప్ప చక్రవర్తి. కళలను పోషించాడు. అందమైన కట్టడాలను అనేకం నిర్మించాడు. హిందూ మతానికి చెందిన రసపుత్ర వనితను తన పట్ట మహిషిగా చేసికొన్నాడు. హిందూ, మహమ్మదీయుల మత సామరస్యం నెలకొనే టట్టు కృషిచేశాడు. కాని తన కుమారుడు సలీం, ఒక సామాన్య వనిత అనార్కలీని పెండ్లి చేసికొంటానంటే సహించలేకపోయాడు. ఆమెను సజీవ సమాధి చేశాడు. తన కుమారునికి మొగల్ సామ్రాజ్యాన్ని పట్టం గట్టాడు.

మన గోల్కొండ పాదుషా ఇలా చేయలేదు. ఈ పాదుషా చిరస్మర ణీయుడు. ఆరుకోట్ల ఆంధ్రులూ ఆరాధించదగిన వాడు.

ఆ కాలంలో ముచికొంద నదికి తూర్పున ఒకచిన్న గ్రామం, పశ్చిమాన్న గోల్కొండ పట్నం, కోట ఉండేవి. ఆ గ్రామంలో ఒక నర్తకి యుండేది. ఆమె రాజవంశస్తురాలు కాదు. ఏ రాజమహల్లోను జన్మించలేదు. ఒక సామాన్య కుటుం బంలో జన్మించింది. నృత్యకళారాధకుల వంశానికి చెందినది. నృత్య విద్యనే నమ్ముకొని దానిలో నైపుణ్యం సంపాదించింది. ఒకనాడు పాదుషా కుమారుడు ఆ గ్రామంలో నుండి వెళ్తూ ఆమె మువ్వల సవ్వడిని విన్నాడు. ఆమె ఇంటిలోనికి వెళ్ళి ఆమె పాట విన్నాడు, ఆట చూశాడు. ఆమె అందానికి ముగ్ధుడయ్యాడు. ఆమెను ప్రేమించాడు. తన ప్రియురాలిగా చేసికొన్నాడు. ప్రతిరోజూ ఆమెను చూచి వస్తూండేవాడు.

వసంతం వెళ్ళింది, గ్రీష్మం ముగిసింది. వర్షరుతువు వచ్చింది. ఆ నదికి వరదలు వచ్చాయి. నది పొంగి ప్రవహిస్తున్నది. ఆ యువక పాదుషా తన ప్రేయసిని కలుసుకొనడానికి రోజూలాగేబయలుదేరాడు. వరద అడ్డు వచ్చింది. ప్రాణంకన్నా ప్రేమ బలీయమైంది. అందువల్ల తన గుర్రాన్ని దౌడుతీయించాడు. గుర్రం నదిని ఈది ఆవలివడ్డు చేరుకొంది. అతడు తన ప్రేయసి సాన్నిధ్యాన్ని చేరుకొన్నాడు. అతని ప్రేయసి పేరు భాగ్యవతి. ఒక హిందూ వనిత.

ఈ విషయం పాదుషాకు తెలిసింది. తన కొడుకు మీద కోపగించ లేదు. భాగ్యవతిని సజీవ సమాధి చేయలేదు. ఆమెను దేశం నుండి బహిష్కరించలేదు. ఆ మర్నాడు తన కుమారుణ్ని తన వద్దకు రప్పించాడు. తనతో తన ప్రేయసి గురించి ఎందుకు చెప్పలేదని అడిగాడు. నదిని దాటడానికి అంత సాహసం అనవసరంగా ఎందుకు చేశావన్నాడు. ఆ నదిమీద ఒక వంతెన కట్టిస్తే సరిపోతుంది గదా! అన్నాడు. తన తండ్రి మందలిస్తాడేమోనని భయపడుతూ వెళ్ళిన యువరాజు, తన తండ్రి తనకు సుముఖంగా ఉండడం గమనించి, అవధులు లేకుండా సంతోషించాడు. వెంటనే ముచికుండ నదిమీద వంతెన నిర్మించబడింది. ఆ నదే నేటి మూసి నది. ఆ వంతెనే నేటి పురానాపూల్. ఆ వంతెన రెండు హృదయాలను ఒకటిగా చేసింది.

ప్రేయసీప్రియులు రెండు భిన్నమతాలవారు ఆమె మహమ్మదీయ మతాన్ని స్వీకరిస్తేగాని వారి ప్రేమకు వివాహబంధం ఏర్పడదు, అని తండ్రి శాసించలేదు. పట్టమహిషి హోదాను ఆమెకు ఇవ్వగలిగితే ఆమెను వివాహమాడమని కుమారునికి సలహా ఇచ్చాడు ఆ పాదుషా. లేకపోతే, నృత్యకళను ఆరాధిస్తూ తనమట్టుకుతాను జీవించేటట్టు ఆమెను మరచిపొమ్మనమని నీతి బోధ చేశాడు. తండ్రి మాటలను పూర్తిగా అర్థం చేసికొన్న ఆ యువరాజు ఆ భాగ్యవతిని పట్టమహిషిగా చేయడానికే నిశ్చయించుకొని ఆమెను వివాహమాడేడు. ఆమె పేరు శాశ్వతంగా చరిత్రలో నిలిచిపోయేటట్టు ఆమె పేరిట భాగ్యనగరాన్ని నిర్మించాడు.

ఆ నర్తనవాణి, ఆ నాట్యరాణి భాగమ్మ, భాగామతి, భగీరథి, భాగ్యవతీ అయింది. పట్టమహిషిగా రాజమందిరాన్ని అలంకరించింది. రాచమర్యాదలను గౌరవించదలచి ఆమె ముస్లిం మతాన్ని స్వీకరించింది హైదర్‌బేగంగా పేరు మార్చుకొంది. భాగ్యనగరం హైదరాబాదు అయింది. ఇది ఆంధ్రుల రాజధానిగా నేడు అలరారుతూ దినదినం అభివృద్ధిచెందుతూంది. కాని ఈ యాదర్శదంపతుల చరిత్ర మరుగున పడిపోయింది. ఈ పాదుషాలనుండి దానాలను స్వీకరించిన ఏ నాట్య బృందం వీరి కథను నృత్య నాటికగా ప్రదర్శించలేదు. ఏ కవీ వీరి కథను యక్షగానంగా వ్రాయలేదు, ఏ గాయకుడు గానం చేయలేదు. కాని సలీం అనర్కలీల చలన చిత్రాన్ని తీసి ప్రదర్శించారు. ఇదే తెలుగువారి విచిత్ర మనస్తత్వం.

ఎవరు వీరి అమర ప్రేమగాథను వ్రాసినా, వ్రాయకపోయినా, పాడినా పాడకపోయినా, ఆడినా, ఆడకపోయినా తెలుగుజాతి సజీవంగా ఉన్నంతకాలం నర్తకి భాగ్యవతిని ఏ తెలుగువాడు మరిచిపోలేడు

ఏడుకోట్ల ఆంధ్రులకు రాజధానిగా
హైదరాబాదు విరాజిల్లుతున్నంతవరకు-

# ముద్దు పళని

తంజావూరు నేలిన మహారాష్ట్ర రాజులు భోసల వంశీయులు. వీరి మాతృ భాష మరాఠీ. అయినా వీరు తెలుగు భాషా మాధుర్యానికి సమ్మోహితులై తెలుగు భాషను అభ్యసించారు. వీరిని ఆకర్షించిన తెలుగు వారి సంస్కృతీ సంస్కారాలను ఆదరించారు. తెలుగునే వారి రాజభాషగా చేసికొన్నారు. తెలుగు సంగీతాన్ని అభ్యసించారు. తెలుగు నాట్యాన్ని ఆరాధించారు. తెలుగులో కవిత అల్లేరు. యక్షగానాలను రచించారు. ఎన్నో సంగీత రచనలను రూపొందించారు. చిన్నయ్య, పొన్నయ్య, వడివేలు, శివానందం, వారి పూర్వులు, వారి వంశీయులు తంజావూరు ఆస్థాన నాట్యాచార్యులుగా ఉండిన రోజులవి.

ఆ కాలంలో ఆంధ్రకవుల శృంగార కవిత్వం అంత ఘాటుగా వారికి తోచకపోయి యుండవచ్చును. ఆ శృంగార రచనలను ఆనాటి నర్తకులు అభినయించారు. రసికులైన కవులు, పండితులు, శాస్త్రవేత్తలు, పాలకులు ఆ రచనలను విని, వాటి అభినయాన్ని చూచి ఆనందించేవారు. అందులో మచ్చుకు కొన్ని

" వెన్నుడా! అల వన్నెలాడిని
కన్ను సైగల చిన్న బిలుచుచు, దాని
చన్ను లంటితివి
అన్న నీవగలేలరా? ఓ
రన్న నీవగలేలరా?"

" చీరరా దాని చనులు కొనగోట
చీరరా!"
" దాని మదన ప్రాంతమేమి అంత
బిగువు దప్పి యున్నది?"

ఇంత ఘాటు శృంగారాన్ని గూడా ఆనాటి నర్తకులు అభినయించవలసి వచ్చేది. అప్పటి పండితులకు ఇది దోషంగా కనిపించలేదు. తమ పడక గదుల్లో తీర్చుకో లేక, లైంగిక ఆకలితో అలమటించే కొందరు కవులు తమ కోర్కెలను కవిత రూపంలో పెట్టి కృష్ణలీల లన్న ముసుగు వాటికి తొడిగి, వాటికి లేని పోని పవిత్రతను ఆపాదించి, పాపాల భైరవుడైన ఆ నల్లనయ్యకు రాజగోపాలుడు, వేణుగోపాలుడు, మువ్వగోపాలుడు, మదనగోపాలుడు అన్న వివిధ పేర్లతో అంకితం చేశారు. శంఖంలో పోసిన మురికి నీరుకూడా తీర్థం అవుతుంది. అలాగే కృష్ణాంకితమైన బూతు పాటలు గూడా పవిత్ర రచనలై పోయాయి.

భక్తురాండ్రు సంకీర్తనలుగా ఈ పాటలను పాడి పరవశులయ్యేవారు. పురుష భక్తులు వీరు పాడగా విని తన్మయులయ్యేవారు. నర్తక జనం ఈపాటను పాడి, అది అభినయించేవారు. అదొక సంప్రదాయంగా రూపొందింది. శృంగార రసానికి దీన్ని ఒక అలంకారంగా కవులు, పండితులు, రాజులు, మహారాజులు భావించారు ఎవరికీ ఎబ్బెట్టుగా తోచలేదు. దేశభాషయిన సంస్కృతంలో ఈ కవిత లుంటే వాటికి ఇంకా ఎక్కువ పవిత్రత ఆపాదించబడేది, ఒకగ్గూడేది. ఇదంతా కర్నాటక, కచ్చేరి ఆటలలోను, తంజావూరు నాట్యంలోను వచ్చిన మార్పు.

కాని, శ్రీకాకుళం ఆలయనర్తనానికి ఎక్కువగా అలవాటు పడ్డ నర్తకీమణి ముద్దుపళనికి ఇంత ఎక్కువగా శృంగార రసమున్న పదాలను ఆరాధించి, అభినయించక తప్పలేదు.

ఆ రోజుల్లో ప్రతాపసింహేంద్రుడు తంజావూరునుండి శ్రీకాకులేంద్రుని దర్శించడానికి వచ్చాడు. ఆయన వంశీయులు రామభక్తులు. ప్రతాప రాముడు వారి ఇలవేల్పు. ఆ దేవునికి అంకితంగా వీరభద్రయ్య అనేక సలాంజతులను రచించాడు. సాంద్రమైన భావంతో, సరళమైన శైలిలో రచింపబడిన చక్కని ఛందో గీతాలు అవి. అనేక గమకాలలో ఒకప్రవాహంలా ఆ రచనలు సాగాయి. అయితే ఆంధ్రదేశ నర్తకులకు ఇవి కొత్తవి.

ఆంధ్ర విష్ణువు ఆలయంలో ముద్దుపళని నాట్యాన్ని ప్రతాపసింహుడు చూసి ముగ్ధుడయ్యాడు. ఆమెను తంజావూరుకు ఆహ్వానించాడు. అక్కడి నాట్య రీతులకు ప్రభావితురాలైన ముద్దుపళని సంతోషంతో ఆ యాహ్వానాన్ని అంగీక రించింది. తంజావూరు వెళ్ళింది. అక్కడికి వెళ్ళిన తర్వాత ఆ రచనలను విని బాధపడింది. ఆ రచనలు ఆమెకు జుగుప్స కలిగించాయి. తాను అక్కడకు వచ్చి నందుకు నొచ్చుకొంది. కాని ఆమె ఏం చేయగలదు! అక్కడంతా ఆమెకు కొత్త. అయినా అక్కడి పండితుల్ని ఈ శృంగార రచనలను గురించి ప్రశ్నించింది.

ఆ దివ్య శృంగారాన్ని వారు మధురభక్తి అన్నారు. రాధామాధవుల అనురాగానుభూతు లన్నారు. వాటిలో అశ్లీలత ఏమీ లేదన్నారు. అశ్లీలత శరీరానికే గాని ఆత్మకు అంటదన్నారు. వీటికి వారు అలవాటు పడ్డారు. అందులో వారికి కొత్త లేదు, చెడు లేదు.

మరి ఈ దివ్య శృంగారం, పవిత్ర శృంగారం స్త్రీ అయిన రాధవర్ణనల తోనే ఎందుకు నిలిచి పోయింది? పురుషుడైన కృష్ణుని ఎందుకు వర్ణించకూడదు? ఈ కవులకు జ్ఞానోదయం కలిగేటట్టు తానే ఎందుకూ ఏదైనా రచించకూడదు? అని ఆమె ఆలోచించసాగింది.

ఇంతవరకూ ఎంతసేపూ రాధ కుచాలను నొక్కడం, తొడలను సవరిం చడం, ఆమె అధర సుధారసాన్ని ఆస్వాదించడం, దంతక్షతాలు, నఖక్షతాలను కృష్ణుడు చేసినట్టు ఈ కవులు వర్ణిస్తున్నారు. "ఇదంతా సున్నితమైన శృంగారం! ఇదంతా మధుర భావం! ఎంతటి ఊహలకైనా అందని అనుభూతి ఇది!" అని "రసి కులు లొట్టలు వేస్తూ, చప్పరిస్తూ చప్పట్లు కొట్టేటట్టు రచించిన ఈ కవులకు ఒక సవాలుగా ఒక కావ్యాన్ని రచించా"లని తలపెట్టింది, వ్రాసింది ముద్దుపళని. అదే రాధికా స్వాంతనం.

దీంతో పురుషసింహాలు మేల్కొన్నాయి. కవిపుంగవులు నిప్పుల వర్షం కురిపించారు, చేతులు చరిచారు, దీనిని ఒక అశ్లీల కావ్యంగా అభివర్ణించారు. దీనిని ఎవరూ చదవకూడదు, వినకూడదు అన్నారు. దీనిని చదివితేనే పాపమన్నారు. కలికాలం అన్నారు, హిందూధర్మ వినాశనానికి నాంది అన్నారు.

ముద్దుపళని పీటన్నింటికీ ఒకటే సమాధానం చెప్పింది "నేను విష్ణు భక్తురాలను. నాకు కలలో మాధవుడు సాక్షాత్కరించి, మధుర భక్తి పరమైన ఒక చక్కని కావ్యాన్ని తనపైని వ్రాయమని ఆదేశించాడు. ఆయన ఆజ్ఞ ప్రకారం నేనీ కావ్యాన్ని వ్రాశాను. ఇష్టం లేనివారు చదవకండి" అని ఆమె విమర్శకులకు సమాధానం చెప్పింది.

మొదటినుండీ ప్రతికవీ తనకు తనఇష్టదైవం కలలో కన్పించి, తనను ఒక కావ్యం వ్రాయమని ఆదేశించినట్లు తెలియజేస్తూ ఒక కావ్యాన్నో, ప్రబంధాన్నో వ్రాయడం, ఆ దేవునికే దాన్ని అంకితమివ్వడం జరుగుతూనే ఉంది అయితే ఆ దేవుడు నిజంగా ఆదేశించాడా అన్నది ఆ పరమాత్ముడికే తెలియాలి. ఎందువల్లనంటే ఆ దేవుడు మాట్లాడడు కనుక. ముద్దుపళని ఈ యాయుధాన్నే ప్రయోగించింది, దీంతో విమర్శకులు నోర్లు మూసుకొన్నారు. కాని మనసులో ఒక ఆడది ఇంత శృంగార కావ్యం వ్రాయడమా! అని అసూయపడ్డారు. ఆమెను ప్రత్యక్షంగా విమర్శించిన వారే రహస్యంగా ఆ కావ్యాన్ని చదువుకొని ఆనందించేవారు.

ఆమె బ్రతికి యుండినంతకాలం ఆమె ఎదుట పడి ఎవ్వరూ ఆ గ్రంధాన్ని మరి విమర్శించలేక పోయారు. ఆమె కలం చాలా వాడైనది, అమె వాక్కు చాల చురుకైనది.ఆమె గొప్ప కవయిత్రి, పండితురాలు. ఆమె కొన్నాళ్ళకు కృష్ణసాన్నిధ్యాన్ని చేరుకొంది. మహారాష్ట్ర ప్రభువుల పాలన అంతరించింది. బ్రిటిష్‌వారు రాజ్యాధిపతు లయ్యారు. అప్పుడు కవులు, పండితులు సమావేశ మయ్యేరు. ఆ రాధికా స్వాంతనం ఒక అశ్లీల కావ్యమని చెప్పి, జరాసంధుని తప్పులను లెక్క పెట్టినట్టు, ఆ కావ్యంలోని అశ్లీలాల నన్నింటిని ఏరి, కూర్చి బ్రిటిష్ ప్రభుత్వాధికారులకు చూపించి, ఆ కావ్యాన్ని నిషేధించమన్నారు. ఆనాడు తెలుగు తెలిసిన దొరలు లేరు. అంతకన్నా అశ్లీలమైన గ్రంధాలు తెలుగులోను, ఇతర భాషల్లోను ఉన్నాయన్న సంగతి వారికి తెలియదు. అందువల్ల ఈ పెద్దల మాటను వార్లు మన్నించి రాధికా స్వాంతనాన్ని నిషేధించారు దాంతో అది కొన్నాళ్ళు మరుగున పడిపోయింది. ఆరగించడానికి వీలులేనిపండ్లు మరింత తీయగా ఉంటాయన్నట్టు నిషేధింపబడిన కావ్యాన్ని రహస్యంగా చదవాలన్న కోరిక కవుల్లోను, పండితుల్లో శృంగార పురుషుల్లోను ఎక్కువయింది.

సాయంత్ర మవుతూంది. కష్టపడి ప్రయాణించిన సూర్యుడు ఎర్రగా కందిపోయి ఇంటికి పోతున్నాడు. అస్తమిస్తున్న ఆ యరుణుని కిరణాలతో ప్రకృతంతా వింత కాంతుల్ని ఈనుతూ, వింత శోభలతో వెలిగి పోతూంది. హృదయాని కెంతో ఆనందాన్ని చేకూరుస్తూంది ఆ శోభ. ఆ సంధ్య కాంతులు కన్నులకు మిరుమిట్లు గొల్పుతున్నాయి. ఒక యింటికి పోబోయే కన్నెపిల్లను ఎవరైనా పెళ్ళి చూపులకు చూడడానికివస్తే సంధ్యవెలుగులో చూపించమన్నారు పెద్దలు.

అలాంటి సంధ్యాసమయంలో ఒక ప్రౌఢాంగన తన కుమార్తెను అలంకరిస్తూ ఉంది. చక్కగా కురులు దువ్వి ఆయిదు పాయల జడ వేసింది. మల్లెపూవుల మాలలతో జడలను అందంగా తీర్చిదిద్దుతూ ఉంది.

ఆ యమ్మాయి క్రొత్తగా పెళ్ళయిన ముగ్ధ, ఆ యలంకరణ ఎందుకో ఆమెకూ తెలుసు. అందరికీ తెలుసు, ఆ యమ్మాయి తల్లితో ఏదో చెప్పాలనుకొంది, చెప్పలేక ఊరుకోంది. మళ్ళా చెప్పా లనుకొంది "అమ్మా" అంది, బిడియ పడింది. చివరకు ధైర్యాన్ని చిక్కబట్టుకొని, ముద్దుగా, మురిపంగా, గోముగా, గారాబంగా

"మాతా! కేళీ గృహం న జాతు శయా"

అమ్మా మదనమందిరానికి పడుకొనడానికి నేను వెళ్ళను అని అంది.

ఆ తల్లికి తన తొలి రాత్రి అనుభవాలు జ్ఞప్తికి వచ్చాయి. తన కళ్ళముందు కదిలాడాయి. ఆ యాలింగనాలు, ఆ చుంబనాలు, దంతక్షతాలు, నఖక్షతాలు, తీయని సంభాషణలు, పులకింతలు, ఒకరి కౌగిళ్ళల్లో ఇంకొకరు కరిగిపోయిన అనుభవాలు, భర్త చేసిన చిలిపి చేష్టలు అన్నీ కళ్ళకు కట్టాయి.

వైవాహిక జీవితంలో తొలిరాత్రి. ఆనందమయమయిన రాత్రి. అంతవరకు దానికోసమే జవ్వనులు వేచియుండిన రాత్రి. ఊహించుకొని కలలుగన్న రాత్రి. వీటిని తలచుకొనడంవల్ల ఆమె వడలు జలదరించింది. సంతోషంతో పులకించిపోయింది. ఆనందాశ్రువులతో కళ్ళు చెమ్మగిల్లాయి. అంతలోనే ఆమె కళ్ళు మెరిసిపోయాయి. తన బిడ్డ కిది మలిరాత్రి.

"ఏమమ్మా చంద్రవదనా కేళికా గృహానికి ఎందుకు వెళ్ళవు?" అని అడిగింది.

"నీ వల్లుడు చూడ్డానికి చంద్రునిలాగ చక్కగా ఉంటాడు నిమ్మపండు వంటి మేనితో మిలమిల మెరిసిపోతూ ఉంటాడు. ఆయన జుత్తు ఉంగరాలు తిరిగి అందంగా ఉంటుంది ఆయన విశాల నేత్రాలు కలలు కంటున్నట్టు ఉంటాయి. ఆయనిది కొనదేరిన ముక్కు, చక్కని మీసకట్టు, దొండపండు వంటి పెదవులు, మన్మథుని వంటి అందగాడు ఆయన. ఆ విశాల వక్షస్థలం, ఆ కండలు దేరిన బాహువులు అన్నీ బాగానే ఉన్నాయి... కానీ... కానిపనులు కొన్ని క్రూరంగా చేస్తాడమ్మా" అంది ఆ జవ్వని.

ఈ కాని పనులు ఏవో సంస్కృత భాషలో చెబితేనే అందంగా ఉంటుంది. పండితులు చదివితేనే ఆనందంగా ఉంటుంది.

ఇలాంటి శ్లోకాన్ని చదివితే మొరటుగా తోచవచ్చును గాని ఇది అభినయ ప్రాధాన్యం గలది. అందువల్ల అభినయంలో ఆ మొరటుతనం గోచరించదు. అలంకార శాస్త్ర దృష్ట్యా ఇవి అమోదదాయకాలే.

తొలిరాత్రి తన ప్రియునితో ఒక ముగ్ధనాయిక గడిపినప్పుడు పొందిన అనుభవాలు, అనుభూతులు ఈ శ్లోకంలో ఉన్నాయి.

"భామరో మువ్వగోపాలు దేలిన రీతి
ఏ మందునమ్మా ఈ వింత నే నెటు గాననమ్మా!" అన్న పదంలో క్షేత్రయ్య గూడా ముగ్ధనాయిక అనుభూతులను పొందుపరచాడు.

నేను ఈ "మాతః" అన్న శ్లోకాన్నీ, "భామరో" అన్న పదాన్నీ కూడా అభినయించాను. ఒక్కొక్కసారి ఇష్టంలేకపోయినా సభలో పెద్దలు కోరినప్పుడు అభినయించక తప్పదుగదా!

ఈ కాలంలోనే ఇలా వున్నప్పుడు ఇక ముద్దుపళని కాలంలో ఎలా ఉండేదో చెప్పాలా?

ముద్దుపళని గుడిచుండి ఘడికి (కోటకు) వెళ్ళింది. అందువల్ల ఆమె ఆ కోటలోని వాతావరణానికి అలవాటుపడలేక పోయుంటుంది.

రాజ దర్బారులోని పండితులు, శాస్త్రవేత్తలు, కవులు, రసికులు కోరేవి ఇలాంటి శ్లోకాలు, పదాలే. పెద్దలు కోరిన శ్లోకాలను, పదాలను అభినయించడం సభా మర్యాద. ఇటువంటి శృంగార రచనలు నర్తకికి వచ్చి ఉండాలి. అవి పంటపట్టి ఉండాలి. వాటిని జీర్ణించుకొని ఉండాలి. ఎవరైనా పండితులు అలంకార శాస్త్రాన్ని ముందు పెట్టుకొని కూర్చున్నా అడిగిన వెంటనే అభినయించాలి వారి పరీక్షకు తట్టుకొనాలి. అప్పుడేగదా వారి మెప్పు వచ్చేది! వారు "భేష్" అనేని వారు ఆనందించేటట్లు అభినయించాలి. వారిని అభినయంతో మురిపించాలి. ఆ రసికజనుల హృదయాలతో ఆడుకొనాలి.

అంతవరకూ గాలిలో తేలియాడుతున్న ఆ నాయిక, వారి కనుల యెదుట అలా అలా తచ్చాడుతున్న నాయిక, సంపూర్ణ రూపాన్ని సంతరించుకొనాలి అప్పుడుగాని ఈ రసిక హృదయుల కండ్లముందు సుందరంగా సాక్షాత్కరించదు. వారికి సంపూర్ణానందం కలగదు. ఇలా ఉండేది ఆనాటి పండిత సభల తీరు.

అందుకే ఆనాటి నర్తకులు నాట్యశాస్త్రాన్నీ సంగీత శాస్త్రాన్నీ, అలంకార శాస్త్రాన్నీ, రసాభినయతీరుల్నీ, వాత్సాయనీయాన్నీ క్షుణ్ణంగా చదివి, ఆకలింపుచేసికొని, సభికులకు అర్థమయ్యేటట్టు అభినయించేవారు. ఆలాంటి వారినే గొప్ప కళాకారులుగా పెద్దలు ఆమోదించేవారు.

అయితే ఎంతసేపూ జవ్వనులే పురుషుల కౌగిళ్ళలో కరిగిపోవడమేనా! వారి బాహుబంధాల్లో నలిగిపోవడమేనా! మల్లిపూవు మాలలా వాడిపోవడమేనా!

తెల్లవారి లేచి, అద్దంలో దంతక్షతాలు నఖక్షతాలు చూసుకొని, తన ప్రియుని శృంగార చేష్టలను తలచుకొని, ఆ మధురస్మృతులకు ఉప్పొంగిపోయి, మళ్ళీ రాత్రి ఎప్పుడు వస్తుందా అని జవ్వనులు వేచి యుండడమేనా?

అలసిసొలసిన శరీరానికి సుగంధద్రవ్యాల నలుగు పెట్టుకొని, నునువెచ్చని పన్నీటిలో జలకమాడి జవ్వనులు అలసట తీర్చుకొనడమేనా? ఈ అనుభూతుల్ని నెమరు వేసుకొంటూ కొదమ సింహాలు ఆనందించడమేనా?

"ఆహా! నేనెంత వీరుణ్ని? శృంగార సమరంలో నా ప్రియురాల్ని జయించాను" అని గొప్పలు చెప్పుకొంటూ ఈ పురుష పుంగవులు తమ చెలికాండ్రతో చెప్పి మీసాలు మెలివేయడమేనా?

మహాకవీ, మాధవభక్తుడూ అయిన జయదేవుని మొదలుకొని క్షేత్రయ్య వరకూ అందరూ ఇంతే.

పండు తమలపాకులా ప్రియురాలి కౌగిటలో నలిగిపోయిన ప్రియునిపైని కనబడే ఆ రతి సంబరంలోని ఎర్రని తాంబూల పెదవుల గుర్తులను, ఆర్ద్రతతో చుంబించిన పంటి గుర్తులను, చెంపలపై గోముగా పెట్టిన ముద్దుల గుర్తులను, గోరింట గోళ్ళ వల్ల కలిగిన శరీరం మీది నెలవంకలను ఒక్కసారి అంటే ఒక్కసారి ఏ కవైనా వర్ణించాడా? లేదు. అంతటి రసికుడు, అంతటి ధైర్యమున్న వాడు ఎవడు? అంత సాహసం పురుషులు చేయగలరా?

రెచ్చిపోయిన ఆడపులి ఈ పని చేయగలదు. ఆ యాడపులే ముద్దుపళని మేధావి, అష్టభాషాప్రవీణ, కవయిత్రి రంగాజమ్మ గూడా చేయలేని సాహసాన్ని ఈ ముద్దుపళని చేసింది. ఆమెకు జోహార్!

అమ్మలు అమ్మాయిలను ఎంతో ప్రేమతో పెంచుతారు. యుక్త వయస్సు రాగానే వారికి పెళ్ళిచేస్తారు. అలంకరించి వారిని గర్భాదాన గదిలోకి పంపుతారు.

ఆ పడక గది తలుపు కన్నాలలోనుంచి ఆ నూతన దంపతుల శృంగార క్రీడలను ముసలివారు చూసి మురిసిపోతారు, ఆనందిస్తారు, కేరింతలుకొడతారు తమ పాతరోజులు తలచుకొని. ఇది తెలుగునాడులో ప్రతియింటా జరుగుతున్నదే. ఈ ముచ్చట్లనే ముద్దుపళని వర్ణించింది.

రాధ కృష్ణుణ్ని ఎంతో ప్రేమతో పెంచింది. వెన్న మీగడలు తినిపించింది. ఒక నల్లని రాతి విగ్రహంలా కృష్ణుడు నునుపుతేరి యవ్వన దశలోకి వచ్చాడు. మన్మథ సమరానికి తయారయ్యాడు.

రాధ అమాయకురాలు. సంసారంలోని ఆ స్వర్గ సుఖాలను ఆమె అనుభవించలేదు. సోదరి ఇళాదేవికి మాత్రం ఆ యదృష్టం కలిగింది. ఒక సుముహూర్తాన ఆ యిద్దర్నీ ఆమె గదిలోకి పంపింది. అంతటితో తన బాధ్యత తీరిపోయిందని ఊరుకుంటే బాగుండును. కాని అలా ఊరుకోలేకపోయింది.

"అయ్యో! నా కృష్ణుడు మెత్తనివాడు! అమాయకుడు! లోపల ఏమైపోతున్నాడో! ఆమె అతన్ని ఏం చేసేస్తోందో! నలిగిపోతున్నాడేమో! కందిపోతున్నాడేమో! అలిసిపోతున్నాడేమో!" అని విచారిస్తూ ఉంటుంది.

ముద్దుపళని వ్రాసిన గ్రంథంలోని విషయమంతా ఇంతే! దీంతో ఆనాటి పండితులకు, కవులకు, బాధ కలిగింది. ఆ పురుష సింహాల అహం దెబ్బతింది. లబలబలాడిపోయారు. గిలగిల కొట్టుకొన్నారు.

సంస్కృతంలోగాని మరే యితర భారతీయ భాషలోగాని ఇలాంటి జవాబును పురుషులకు చెప్పిన కవయిత్రి ఉందో లేదో నాకు తెలియదు. తెలుగువారిలో మాత్రం పురుషులకు దీటైన జవాబు చెప్పిన కవయిత్రి ఈ ముద్దుపళని. ఆమె ధైర్యానికి జోహార్లు.

ఏదైనా సాహసం చేయడానికి ఆంధ్రులే సమర్థులు.

ఏమి రతి? సమ రతియా, కోడిపెట్ట పుంజుల రతియా? నాగుపాముల రతియా? చిలకా గోరింకల రతియా? వీటిని పురుషులు తమ కావ్యాలలో వర్ణించారు అలంకార, కామ శాస్త్రాలను అందరూ చదవలేరుగా అందుకని వారు పురుష దృష్టితోనే వ్రాశారు. స్త్రీల దృష్టితో స్త్రీలు ఎందుకు ఈ మన్మథ క్రీడలను వర్ణించకూడదంటూ ముద్దుపళని ఒక సవాలుగా వ్రాసింది.

ఆదిదంపతుల శృంగారాన్ని అతిగా వర్ణిస్తూ కాళిదాసు తన కుమార సంభవంలో వ్రాశాడు. పొదరిండ్ల మాటులోని రాధామాధవుల శృంగార లీలలను జయదేవుడు సువాసనలు విరజిమ్మేటట్టు వర్ణించాడు. అయితే ఇవంతా

పురుషుల దృష్టిలో అశ్లీలం కాదు. ఎందుకంటే శంఖంలో పోసింది తీర్థం. మహా పురుషులు చెప్పేదంతా సూక్తి ముక్తావళి. ఎందుకంటే వారు తెలుగులో వ్రాయ లేదు. దేవభాషలోనే వ్రాశారు. దేవ భాషలో వ్రాసిన ప్రతీదీ పవిత్రమైనదే!

హాలుడు తన గాథా సప్తశతిలో తక్కువ శృంగారం వ్రాశాడా! అదంతా పామరుల భాష ప్రాకృతంలో ఉంది.

క్షేత్రయ్య మువ్వగోపాలుని ముద్దు శృంగారాన్ని ఘాటుఘాటుగా, కార కారంగా తేనెసోనల తేటతెనుగులో అందరికీ అర్థమయ్యేటట్టే వ్రాశాడు.

జవ్వనుల నోట చవులూరేటట్టు సారంగపాణి పదాలను రచించి కార్వేటి నగర వేణుగోపాల స్వామికి కృష్ణార్పణం చేశాడు.

సరసత నెరిగిన, అభినయించిన సభాపతయ్య శృంగార పదాలను రచించి రాజగోపాలునికి అంకితమిచ్చాడు. వాటిని అభినయించి చూపించాడు.

అయితే ఇవన్నీ బూతు పురాణాలు కావన్నారు పురుషులు. వీటికి ఆధ్యా త్మికతను అంట కట్టేరు. రాధాకృష్ణుల శృంగారమంటే పరమాత్మనుండి వేరు చేయబడిన ఆత్మయొక్క విరహం ఇదంతా అన్నారు.

"సిరిగలవానికే జెల్లును, ధరలో పదియారు వేలు—
పరమేశా గంగ విడువు పార్వతి జాలున్" అని కూడా అన్నారు.

మహావిష్ణువు శృంగార పురుషుడు. అతని హృదయం శృంగార రస నిలయం. అతడు దాల్చిన అవతారాలలో కృష్ణావతారం సంపూర్ణమైంది. కృష్ణుడు దక్షిణ నాయకుడు, అతడు ఎంతటి శృంగారాన్నయినా భరించగలడు. సమర్థిం చుకోగలడు. కాని పాపం శివుడు భరించలేడు. ఇద్దరు భార్యలతోనే అవస్థ పడలేక పోయాడు. అలాంటి శివునికి అంకితమిస్తూ కొందరు పదాలు వ్రాశారు

"శివదీక్షా పరురాలనురా నే
శిలమింతైనా విడువజాలనురా !

పురుషుల దృష్టిలో అశ్లీలం కాదు. ఎందుకంటే శంఖంలో పోసింది తీర్థం. మహా పురుషులు చెప్పేదంతా సూక్తి ముక్తావళి. ఎందుకంటే వారు తెలుగులో వ్రాయ లేదు. దేవభాషలోనే వ్రాశారు. దేవ భాషలో వ్రాసిన ప్రతీదీ పవిత్రమైనదే!

హాలుడు తన గాథా సప్తసతిలో తక్కువ శృంగారం వ్రాశాడా! అదంతా పామరుల భాష ప్రాకృతంలో ఉంది.

క్షేత్రయ్య మువ్వగోపాలుని ముద్దుల శృంగారాన్ని ఘాటుఘాటుగా, కార కారంగా తేనెసోనల తేటతెనుగులో అందరికీ అర్థమయ్యేటట్టే వ్రాశాడు.

జవ్వనుల నోట చవులూరేటట్టు సారంగపాణి పదాలను రచించి కార్వేటి నగర వేణుగోపాల స్వామికి కృష్ణార్పణం చేశాడు.

సరసత నెరిగిన, అభినయించిన సభాపతయ్య శృంగార పదాలను రచించి రాజగోపాలునికి అంకితమిచ్చాడు. వాటిని అభినయించి చూపించాడు.

అయితే ఇవన్నీ బూతు పురాణాలు కావన్నారు పురుషులు. వీటికి ఆధ్యాత్మికతను అంటకట్టేరు. రాధాకృష్ణుల శృంగారమంటే పరమాత్మనుండి వేరు చేయబడిన ఆత్మయొక్క విరహం ఇదంతా అన్నారు.

"సిరిగలవానికే చెల్లును, ధరలో పదియారు వేలు—
పరమేశా గంగ విడువు పార్వతి చాలున్" అని కూడా అన్నారు.

మహావిష్ణువు శృంగార పురుషుడు. అతని హృదయం శృంగార రస నిలయం. అతడు దాల్చిన అవతారాలలో కృష్ణావతారం సంపూర్ణమైంది. కృష్ణుడు దక్షిణ నాయకుడు, అతడు ఎంతటి శృంగారాన్నయినా భరించగలడు. సమర్థిం చుకోగలడు. కాని పాపం శివుడు భరించలేడు. ఇద్దరు భార్యలతోనే అవస్థ పడలేక పోయాడు. అలాంటి శివునికి అంకితమిస్తూ కొందరు పదాలు వ్రాశారు

"శివదీక్షా పరురాలనురా నే
శిల మింతైనా విడువజాలనురా !

"అదేనంటి రసపట్టు" అంటూ ఆ చరణాలు పాడి వినిపించాడాయన.

నేను ఆ చరణాలు విన్నానే గాని నామనస్సు వాటిని స్వీకరించలేదు. ఈ నాటికీ అవి నా నోటికి రావు. ఎందువల్లనంటే, "శివార్చనపరంగా ఇంత శృంగారమా?" అని ఘోషించింది నా మనస్సు ఆనాడు. ఆనాడు నాకు జ్ఞానోదయమైంది.

"పదాల్లోనూ, జావళీలలోను నాయికా నాయకుల శృంగారం కాక ఇంకేముంటుంది?" అని పెద్దలు అంటారు.

స్త్రీపరంగా శృంగారాన్ని చర్చించి రాధికా స్వాంతనాన్ని లోకానికి అందించిన ముద్దుపళని మహావిద్వాంసురాలు, ధీశాలి.

రాధికా స్వాంతనం మీద ఉండిన నిషేధం కొన్నాళ్ళకు తొలగిపోయింది.

# నాయుడు పేట రాజామణి

నృత్యశిక్షణకు ఆమెను అభ్యర్థించడానికి నేను ఆమె వద్దకు వెళ్ళిననాటికి ఆమె వయస్సు డెబ్బై అయిదు సంవత్సరాలు దాటి ఉండవచ్చును. వాలుజడ, బర్మాముడీ మానివేసి ఆమె కొప్పు పెట్టుకొంటున్న సమయమది. అయినా ఆమె ముఖంలో ఒక వింత బ్రహ్మ తేజస్సు తొణికిసలాడుతూనే ఉంది. కళాతపస్సు వల్ల ఆమెకు కలిగిన ఫలం అయుండవచ్చును అది. ఆమె రెండు నేత్రాలూ జ్యోతుల్లాగ వెలుగుతూ ఉండేవి. ఆమెలోని ఆకర్షణ అట్టిది. కళాకారుల్లో ఆమె నిజంగా ఒక మణి.

నియమ నిష్ఠలతో జీవితాన్ని గడిపిన పుణ్యమూర్తి ఆమె. సర్వవిద్యా సంపన్నురాలు. లక్ష్మీ సరస్వతు లిద్దర్నీ ప్రసన్నులను జేసికొన్న అదృష్టవంతురాలు. పవిత్రమైన నృత్యకళను తక్కువగా చూసిన రోజులవి. గౌరవనీయులైన విద్యా, విజ్ఞాన వంతులైన కళారాధకులు నృత్య విద్యనుండి విరమించు కొంటున్న కాలమది. అదొక సంధి యుగం.

దక్షిణాదిలో దేవదాసీ చట్టం అమలులోనికి వచ్చిన కాలమది. తరతరాలుగా నృత్యకళను ఆరాధించినవారు దానిని మానివేశారు.

స్వర్గీయ బండి శ్రీహరిరావు నాయుడు గారు మొదలైనవారు కళావంతుల సంస్కరణోద్యమాన్ని ఆంధ్ర దేశంలో తీసికొని వచ్చారు. పంజాబు మొదలైన రాష్ట్రాలలో స్త్రీ పురుషులు సంఘీ భావంతో పెండ్లి ఊరేగింపుల్లో రోడ్లపైని నృత్యం చేస్తూ వెళ్తారు ఒక ప్రత్యేక కులంవారు ఆడుతూ, పాడుతూ ఉన్నప్పుడు వారిని ఎన్నో విధాలగా అపహాస్యాలకు గురిచేసి, అగౌరవ పరచడం కొన్ని చోట్ల జరుగుతూ ఉండేది. ఇది చాలా అక్రమమైన విషయమే. పరస్త్రీని మాతృమూర్తిగా భావించవలసిన ఈ పవిత్ర భారత దేశంలో స్త్రీని రోడ్డు పైకి ఎక్కించి నాట్యం చేయించడం ఆ కులపెద్దలకు సహించరానిదిగా తోచి, ఈ యుద్యమాన్ని చేపట్టి ఉంటారు. భారతస్త్రీల పరువును కాపాడినందుకు వారు నిజంగా మహనీయులే.

కాని దేవదాసీలు కొన్ని వేల సంవత్సరాలుగా కాపాడుకొంటూ వచ్చిన కళకు అపకారం జరిగింది. గంగాజలంవంటి ఈ పవిత్ర కళకు వచ్చిన కళంకం మాట అటుంచి, తరతరాలుగా, శత శతాబ్దులుగా ఒక సంప్రదాయంగా, తమ జీవితంలో ఒక భాగంగా, తమ జీవన విధానంగా, కళలేనిదే తాము లేమన్నట్టుగా ఆ కళామ తల్లిని ఆరాధించిన వారి కళాకేతులు, సాంప్రదాయక రహస్యాలు వారి వద్దే ఉండిపోయాయి, వారితోనే అంతరించిపోయాయి.

నా చిన్న తనంలో బ్రహ్మసమాజాన్ని ఆంధ్రలో నిర్వహించినవారిలో పిఠాపురం మహారాజావారూ, సర్ ఆర్. వేంకట రత్నంనాయుడుగారు ప్రధానులు. అంతకు ముందే ఈ మహారాజావారు హరిజనోద్ధరణను చేపట్టి అనేక మంది హరిజనులకు ఆర్థిక సహాయాన్ని అందచేశారు, వారి పురోభివృద్ధికి తోడ్పడ్డారు. మహాత్మాగాంధీగారి కంటే ముందుగానే ఈ మహారాజావారు ఈ హరిజనోద్ధరణ ఉద్యమాన్ని చేపట్టారు.

ఆ రోజుల్లో పెద్దవారిండ్లలో పెళ్ళిళ్ళు జరిగితే బాండ్ మేళాలతో ఊరేగింపులు, ఇండ్లవద్ద మేజువాణీలు పెట్టించడం ఒక ఆనవాయితీగా ఉండేది. సదస్యం నాడు గొల్లకలాపం తప్పని సరిగా ఉండేది. అందులో పిండోత్పత్తి అతి ముఖ్యం. పెండ్లిలో ఎన్ని మేళాలు ఉంటే అంత గొప్ప పెళ్ళివారికి. అయితే ఈ నట్టువ మేళాలవారు ఎంత డబ్బు యిచ్చినా అందరి ఇండ్లలోను ఆడేవారు కారు. అది వారి కట్టుబాటు.

శ్రీ పెద్దాడ రామస్వామిగారు కాకినాడ కాలేజీకి ప్రిన్సిపాల్‌గా ఉన్నప్పుడు వారింట్లో ఒక పెళ్ళి జరిగింది. ఆ పెళ్ళికి నేను వెళ్ళాను. ఆ పెళ్ళి ఊరేగింపులో మేజువాణీ గాని, బాండ్ మేళం గాని లేదు. మద్రాసునుండి పిలిపించిన సన్నాయి మేళాన్ని పెట్టించారు. ఆయనకూడా ఒక సంఘ సంస్కర్త. ఈ సంస్కర్తలు నాట్యం చూడ్డాన్ని ఒక మహా పాపంగా పరిగణించేవారు, నాట్యం అన్న పదాన్ని ఉచ్చరించడమే పెద్ద తప్పుగా నెంచేవారు. వీరిలో ఎవరూ నాట్యాన్ని అసలు చూడనే లేదు. నాట్యం గురించిన ఆలోచనే వారికుండేది కాదు. నృత్తానికి నృత్యానికి గలతేడా వారికి తెలియదు. మానవుని హృదయ భాష అభినయం అన్న విషయాన్ని

వారు గుర్తించనేలేదు. మానవ సంస్కృతీ సంస్కారాల సారం నృత్యకళ అన్న తలంపే వారికి ఉండేది కాదు.

వేశ్యలు, వెలయాండ్రు వారి విటులకు సంబంధించిన నాటకాలను ఆనాటి కవులు, రచయితలు విశేషంగా వ్రాసేవారు. వాటిని ఆనాటి నటులు ఆకర్షణీయంగా ప్రదర్శిస్తూ ఉండేవారు. వీటివల్ల ఎవరు లోకువ అయ్యారు? ఈ స్త్రీ కళామూర్తులు లోకువయ్యారు. హృదయంలోనే మూగగా బాధ పడేవారు నాటక ప్రయోక్తల ఇష్టానుసారం ఈ స్త్రీ కళాకారులు రంగస్థలంపైని నటించారు, పాడేరు, ఆడేరు, అభినయించారు. నిజంగా లోకమంతా అలాగే ఉందని ప్రేక్షకులు గుడ్డిగా నమ్మారు. ఏక పక్షంగా ఆలోచించి ఈ పెద్దలు తీర్పు ఇచ్చారు. నాట్యం చేసేవారంతా కులట లనే వీరు నిర్ణయించారు. కులట జీవితాలకు నాట్యప్రదర్శనాలకు సంబంధ మేమిటో వీరు ఆలోచించలేదు.

ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన కొత్తలో కళా సంస్థలు హైదరాబాదులో ఎక్కువగా లేవు. నృత్యం నేర్పే సంస్థలు లేవు. ఒక గానసభ మాత్రం ఉండేది. మదరాసు నుండి కళాకారుల్ని పిలిపించి గానసభలను ఈ సంస్థ నిర్వహిస్తూ ఉండేది. స్వర్గీయ బూర్గుల రామకృష్ణారావుగారు గొప్ప పండితులు, రాజకీయ వేత్త, కళా ప్రియులు, బహు భాషా కోవిదులు. హైదరాబాదులో సంగీత, నృత్య కళలను ప్రోత్సహించి వృద్ధి పరచాలన్న తలంపుతో నన్ను ఒకసారి ఆహ్వానించారు. వారి కోరికపైని విశాఖపట్నం నుండి వచ్చాను.

ఉస్మానియా విశ్వవిద్యాలయంలోను, నైజాం కాలేజీలోను, శ్రీకృష్ణరాయ భాషా నిలయంలోను, వేమన గ్రంథాలయంలోనూ, ఇంకా అనేక సంస్థలు, విద్యాలయాల్లోను అభినయ పూర్వకమైన ఉపన్యాసాలను నాట్యకళ పై ఇచ్చాను. బూర్గుల వారి సతీమణి శ్రీమతి అనంతలక్ష్మి, శ్రీమతి రంగమ్మా ఓబులరెడ్డి, (కొత్వాల్ వెంకటరామారెడ్డి గారి కుమార్తె) మొదలగు కొంత మంది స్త్రీలు చొరవ తీసికొని స్త్రీల సంస్థల్లో నా యభినయ పూర్వక ఉపన్యాసాలను ఏర్పాటు చేశారు. అప్పుడప్పుడే తెలుగు తనాన్ని సంతరించుకొంటున్న హైదరాబాదు తెలుగు సమాజంపైని నా ఉపన్యాసాల ప్రభావం ఎంతగానో పడింది.

మన తెలుగు వారి సంస్కృతి విశిష్టమైంది. మన సంగీత, నృత్యకళలు అతి ప్రాచీనమైనవి. దక్షిణ భారతావనిలో మన కళలే గొప్పవి, ఆదర్శవంత మైనవి అంటూ రాత్రిం పగళ్లు నేను ఉపన్యాసాలు ఇస్తూ వచ్చాను. ఏ సంస్థ వారు పిలిచినా కాదనకుండా వెళ్ళి నేనే పాడి, ఆడి, అభినయించి, ఉపన్యసించి నాట్య కళా ప్రబోధం చేస్తూ వచ్చాను. బూర్గుల వారు నా కృషిని, నా విద్యను మెచ్చి, స్థాపించబోయే ప్రభుత్వం వారి సంగీత నృత్య కళాశాలకు నన్ను ప్రిన్సిపాల్‌గా నియమిస్తామన్నారు. నా ప్రచారానికి ఈ ఉద్యోగం అడ్డు వస్తుందని నేను సమ్మతించలేదు.

నేను నాగపూరు నుండి వచ్చి అట్టే కాలం కాలేదు గనుక తెలుగు, ఇంగ్లీషు భాషల్లోనే కాక హిందీ, మరాఠీ భాషల్లో గూడా ఇక్కడ ధారాళంగా ఉపన్యాసాలు ఇచ్చాను. అందువల్ల ఇక్కడి తెలుగు వారితో బాటు ఆంధ్రేతరులు గూడా తెలుగు మాధుర్యాన్ని, భావ సౌందర్యాన్ని అర్థంచేసికొని ఆనందించారు.

తెలుగులో ముచ్చటగా ధారాళంగ మాట్లాడుతూ, భావయుక్తంగా ఉపన్యసిస్తూ, తీయగా పాడుతూ, పాటలోని భావం ప్రేక్షకు హృదయాలలో హత్తుకు పోయేటట్టు అభినయిస్తూ, ఆంధ్రుల ఆధ్యాత్మిక లోతులను చూపిస్తూ నెలల తరబడి నాట్యకళను హైదరాబాదు జంటనగరాల్లో ప్రచారం చేశాను. బూర్గుల వారి ఆహ్వానంమీద నేను వచ్చి చేసిన ప్రచార ఫలితంగా నృత్యకళా పరిమళం జంటనగరాల్లో గుప్పున వ్యాపించింది. నాట్యశోభ పెద్దల దృష్టిని ఆకర్షించింది. సంస్కారవంతులైన జంటనగరాల పౌరులకు తమ పిల్లలకు నాట్య కళను నేర్పించాలన్న కుతూహలం కలిగింది. వెంటనే వారి పిల్లలను నృత్యం నేర్చుకొనడానికి నా వద్దకు పంపించడం మొదలు పెట్టారు. నా ప్రచార ఫలితం వల్లనే నేడు ఎంతో మంది పిల్లలు నాట్యం నేర్చుకొంటున్నారు గదా అన్న సంతోషాతిశయం నాకు కలుగుతూ ఉంటుంది.

నేను ప్రచారం చేస్తున్న కాలంలోనే ఒకసారి ఒక మిత్రుని ఇంట నేను కేళిక చేస్తున్న సమయంలో పెద్దాడ రామస్వామిగారిని కలుసుకొన్నాను. అప్పటికే ఆయన వృద్ధుడు. వారు వచ్చారు గదా అని ఒక శ్లోకాన్ని, ఒక పదాన్ని అభినయించాను. అభినయాన్ని చూడడం వారికి అదే మొదటి సారిట.

"ఏమిటీ విద్య! ఇందులో ఇంత గొప్పతనముందా! ఇంత మహత్తు ఉందా! నాకు ఈ నాటి వరకు తెలియదు. మేము బ్రహ్మసమాజ మతస్థులం కనుక మేం ఆంటీనాచ్, మేము నృత్య విరోధులం అందువల్ల ఇంత వరకూ నృత్త, నృత్య, అభినయాలను నేను చూడలేదు. ఈ విద్య గురించి ఇంతవరకు తెలుసుకొనలేకపోవడం పెద్ద పొరపాటు. నేను కళలను ఆరాధించలేదు. జీవితాన్ని వృథా చేసికొన్నానేమో!"

"చిరంజీవీ! నీ ప్రదర్శనే ఇంత గొప్పగా ఉందే, మరి ఆనాటి భరత విద్యాగురువుల విద్య ఇంకా ఎంతో గొప్పదై యుండాలి. ఈ నాట్యం గురించి ఈ నాట్యగురువుల గురించి దేశ చరిత్రలో ఎక్కడైనా ఉందా!" అంటూ ఆ విద్యానిధి చెమర్చిన కళ్ళతో నన్నడిగారు.

నేను నాగపూరు నుండి ఆంధ్ర దేశానికి వచ్చి అయిదు సంవత్సరాలైంది. అప్పటికి రాజా గణపతిరావు పాండ్యేగారు ఇంకా సజీవులే. సంస్థానాలు భారత దేశంలో విలీనమైన కొత్త రోజులవి. ఆయన నన్ను తిరిగి మళ్ళా ఆయన వద్దకు రమ్మనమని ఎన్నో లేఖలు వ్రాశారు మనుష్యుల్ని పంపారు. అయితే నాకు తెలుగు దేశంలో నృత్య కళను పునఃస్థాపించాలని, మరుగుపడియున్న తెలుగుదేశ నృత్యకళను వెలికి తీయాలని, నృత్యకళా చరిత్రను అందరికీ చాటి చెప్పాలని దృఢ సంకల్పం కలిగినందున నేను మళ్ళా నాగపూరు వెళ్ళలేదు.

బొబ్బిలి, విజయనగరం, పిఠాపురం, కాళహస్తి, వెంకటగిరి మొదలైన సంస్థానాలలోని నాట్యశాస్త్ర తాళపత్ర గ్రంథాలను పరిశోధించడానికి తగిన అవకాశాలను కల్పించుకొన్నాను. నన్ను ఏ నగరం వారు ప్రదర్శనాత్మక ఉపన్యాసాలకు ఆహ్వానించినా, వారి పరిసరాల్లో గల వృద్ధ నాట్యకళాకారులతో మాట్లాడే అవకాశం కలిగించాలన్న షరతును పెట్టే వాడిని. ఈ విధంగా చరిత్ర కందని విషయాలను గూడా నేను ప్రత్యక్షంగా సేకరిస్తూ వచ్చాను. నేను నాట్యకళకు సంబంధించిన గ్రంథాలను ఎన్ని చదివానో, ఎంత మంది వృద్ధ నృత్యకళాకారులను కలుసుకొన్నానో నేను చెప్పలేను.

నాకు నృత్యం నేర్పడానికి రాజవ్వగారు మొదట నిరాకరించి నన్ను నిరుత్సాహ పరిచారు "ఇంకే విషయమైనా నన్నడుగు చెప్తాను. గాని నృత్యకళను

చెప్పను" అన్నారు. "ఏదో క్షురవాడివి నన్ను వెతుక్కొంటూ వచ్చావు. నా ఇంట్లో నాలుగు రోజు లుండి, కాళహస్తీశ్వరుణ్ణి దర్శించుకొని వెళ్లు" అని ఆప్యాయంగా సలహా ఇచ్చారు. "నాట్యం నేర్చుకొని ఏం చేస్తావు? వంశ పారంపర్యంగా నాట్యం చేస్తూ వచ్చిన మేమే ఆ విద్యనుండి విరమిస్తూంటే దేశానికి నీవు ఏం చేయగలవు?" అంటూ నా ఉత్సాహాన్ని నీరు కారుస్తూ ఎన్నో అభ్యంతరాలు పెడుతూ వచ్చారు.

"ఏది ఏమైనా సరే నేను మీ వద్ద నాట్య విద్యను నేర్చుకోవాలనే వచ్చాను. మీరు నాకు ఈ విద్య నేర్పక తప్పదు" అన్నాను.

ఆరు నెలలు నాకు ఆమె కఠిన పరీక్ష పెట్టారు. నా దృఢ సంకల్పానికి ఆమె ప్రసన్నురాలైనారు. విద్యను నేర్పడం ప్రారంభించారు.

ఆమె నాట్యకళానిధి, కళాసాగరం! సాగర తీరంలో కూర్చుని గుల్లలు ఏరుకొంటున్నట్టుగా ఉంది నా జీవితం అని నాకు అనిపించేది. కాళహస్తీశ్వరాలయంలో ఆ స్వామి సన్నిధినే ఆ విద్యను నేర్చుకొనడం ప్రారంభించాను.

ఒక చిన్న రాయితో ఒక స్థంభాన్ని మెల్లిగా ఆమె కొట్టేవారు. అందులో నుండి వచ్చే మధుర స్వరాన్ని విని, ఆ శ్రుతితో నా కంఠాన్ని చేర్చి నన్ను పాడమనే వారు ఆమె నేడు ఒకటి, రెండు, రెండున్నర అంటూ హార్మోనియం మీద శ్రుతి చేసికొని పాడడం కాకుండా, నాదోత్పత్తి ఆధారంగా పాడ మనే వారు. మొదట్లో నాకు అర్థం కాలేదు. అలా పాడడం నాకు రావడం లేదంటే ఆమె విద్య నేర్పరేమో నని నాకు భయం. అందువల్ల వారు చెప్పినట్టుగానే రోజూ కష్టపడి సాధన చేసేవాడిని. కొన్నాళ్ళకు ఆ స్థంభనాదంతో చేర్చి పాడడం అబ్బింది. సరైన శ్రుతి జ్ఞానం నాకు అలవడింది. ఆమె సంగీతం నేర్పే తీరు ఇలా ఉండేది.

ఇంక అభినయం నేర్పే తీరు: ఏదైనా ఒక శ్లోకాన్ని గాని పదాన్ని గాని తీసికొంటే అందులోని ఒక పాదాన్ని ముగించడానికి కనీసం ఒక వారం పట్టేది. అయితే ఈ వారంరోజుగా అలంకార శాస్త్రంలోని ఒక అధ్యాయం ముగిసేది. ఆ

యొక్క పాదంలోని భావానికి సరిపడే ఇతర కవుల రచనలను ఆమె ఉదహరించే వారు. అమరం, ఆంధ్రనామ సంగ్రహం, శబ్దమంజరి మొదలైన వాటిని నాచేత బాగా అభ్యాసం చేయించేవారు. శ్లోకంలోని ఒక్కొక్క పదాన్ని ఎలా ఉచ్చరించాలో దాని సందర్భాన్ని బట్టి చెప్పేవారు. వివిధ వ్యుత్పత్తులు, అందుకు తగిన అర్థాభినయం, భావాభినయం, విశిష్టాభినయం ఇలా ఎన్నో నేర్పారు. ఇది నా మనోధర్మ వికాసానికి దోహదమయింది. మేం మధ్యాహ్నం వేళ ఒంటరిగా ఆ యాలయంలో ఉండి పాడుతూ ఉంటే సుస్వరం ప్రతిధ్వనించేది.

ఒకసారి "శివదీక్షా పరురాలనురా నే" అన్న జావళికి అభినయం చెబుతు న్నారు. ఆత్మలింగ పూజలో నాట్యశాస్త్ర పద్ధతిని అనుసరించి ప్రారంభంలో చేసే అభినయాన్ని నేర్పుతూ ఒక నూతన పద్ధతిని హస్తాభినయం చెప్పారు. అదేమిటో మొదట నాకు బోధపడలేదు. నాకు అర్థం కాలే దని ఆమె గ్రహించి, "వీటిని ముద్రలని పూర్వం అనేవారు. ఇవి మామూలుగా నేర్పే ముద్రలు కావు. ఇవి నాట్యాచార్యులందరికీ తెలియనివి అందరూ చెప్పలేరు. ఇవి ధ్యాన ముద్రలు, యోగ ముద్రలు, ఆధ్యాత్మిక మైనవి" అని వివరించారు.

అప్పుడు నాకు జ్ఞానోదయమైంది వీటిని ఎక్కడో చూసినట్టు అనిపించింది. జ్ఞాపకం తెచ్చుకొనడానికి ప్రయత్నించగా, ప్రయత్నించగా జ్ఞాపకం వచ్చింది. నాచిన్నప్పుడు రామకృష్ణ మఠంలో పూజారి మహారాజు పూజా సమయంలో ఇటువంటి ముద్రల్నే పట్టేవారు. అప్పుడు నాకు అర్థం కాలేదు కాని నేడు ఆ ముద్రల అర్థం తెలిసింది.

నా నృత్య విద్యాభ్యాసం ముగిసింది. నాకు పరీక్ష పెట్టారు. పరీక్షకులు పురాణం పేరి శాస్త్రిగారు. వారు నాట్యశాస్త్రవేత్తలు అభినయశాస్త్రంలో దిట్టలు. మా గురువుగారు నన్ను ఆయన వద్దకు తీసికొని వెళ్ళారు. మధ్యాహ్నం ఒంటి గంటనుండి సాయంత్రం వరకు ఆ పరీక్ష జరిగింది ఈ నాలుగు గంటల పరీక్షలో నాకు ప్రశ్నా పత్రం ఇవ్వలేదు. ప్రశ్నలు అడగలేదు.

"దానికే తగు జాణరా, నీవు దయయుంచరా ఈ వేళ!" దీనిని అభిన యించి చూపమన్నారు. ఆ నాలుగు గంటలూ ఈ యొక్క పల్లవినే అభినయిం చాను, "బేష్!" అన్నారు పరీక్షకులు పేరిశాస్త్రిగారు. "భరత విద్యలోని

కాళహస్తి బాణీ కలకాలం నిల్చి ఉంటుంది. నీ తర్వాత గూడా శాశ్వతంగా ఈ బాణీ ఉంటుంది రాజామణీ!" అని మా గురువుగారిని ఆయన మెచ్చుకొని, నన్ను ఆశీర్వదించారు.

ఇంక క్రమ శిక్షణ గురించి కొద్దిగా వివరిస్తాను. ఆ రోజుల్లో పెట్టి బళ్లు, ఒంటెద్దు గూడుబళ్లూ ఎక్కువగా ఉండేవి ఒకనాటి మధ్యాహ్నం నన్ను మా గురువు గారు ఒంటెద్దు బండిలో ఒక శ్రీమంతుని ఇంటికి తీసికొని వెళ్ళారు. అయన ఒక గొప్ప కళాపోషకు డని అ తర్వాత నాకు తెలిసింది.

ఆయనతో మాటా మంతీ మా గురువుగారు ముగించి, నన్ను ఆయనకు పరిచయంచేశారు. ఆయన నన్ను ఏదైనా ఒకటి నాట్యం చేసి చూపించమన్నారు. నేను కదలకుండా కూర్చున్నాను. మళ్ళా కొంత సేపు మా గురువుగారితో మాట్లాడి, నన్ను నాట్యం చేయమని అడిగారు. నే నేం సమాధానం చెప్పకుండా అలాగే కూర్చున్నాను, ఆయన నా మౌనానికి అర్థం గ్రహించినట్టు ఒక చిరు నవ్వునవ్వి "ఓహో! నీ గురువు గారు నీకు అనుజ్ఞ ఇవ్వాలి కాబోలు. రాజామణీ ఆ కుర్రవాణ్ణి నాట్యం చేసి చూపించమను" అన్నారు.

"బాబూ! పెద్దలు అడిగారు. నాట్యం చేసి చూపించు" అని అమె నన్ను ఆజ్ఞాపించారు. నేను వెంటనే లేచి పాడుతూ, ఆడుతూ, అభినయించాను.

"గురువుకు తగిన శిష్యుడవు!" అంటూ లోపలికి వెళ్ళివచ్చి, నా చెయ్యి పట్టుకొని నా గుప్పెట్లో ఏదో వస్తువు వుంచి, మూసి, "ఎవరికీ దీన్ని చూపించకు" అని చెప్పారు.

తర్వాత మళ్ళా వారు ఏదో ప్రసంగంలోకి దిగారు. ఇద్దరూ పండితులే. అలా వారి చర్చ కొన్ని గంటలు సాగింది, నా చేతిలో వస్తువు అలాగే ఉంది. నా మెత్తని అరచేతికి ఏదో గట్టిగా తగులుతూ ఉంది.

అక్కడినుండి ఆ ఒంటెద్దు బండిలో మరొకరి ఇంటికి వెళ్ళాం. అక్కడ మరొక గంట గడిచింది. నా గుప్పెట అలాగే మూసుకొని ఉంది ఏదో గట్టి వస్తువును అలా కొన్ని గంటలు పట్టుకొని ఉండడంవల్ల అరచేతిలో జిల పుట్టింది

సాయంత్రం అయిదు గంటలకు తిరిగి ఇంటికి వచ్చాం. దీపాలు పెట్టారు. మా పూజామందిరం నేను కూర్చున్నాను. నా ముడిచిన చెయ్యి అలా మూసుకొనే ఉంది. ఆమె కాళ్లూ, చేతులూ కడుక్కొని, బట్టలు మార్చుకొని వచ్చి, దేవుని మందిరంలో దీపం వెలిగించారు తర్వాత నావైపు చూశారు. నా గుప్పిట అలాగే మూసికొని ఉంది. ఆమె వచ్చి నా గుప్పెట విప్పారు. తళతళ మెరిసిపోతూన్న బంగారు రాణీ కాసు నా అరచేతిలో కనబడింది. ఆశ్చర్యంగా దాన్నిచూస్తూ కూర్చున్నాను. ఆమె దాన్ని తీసికొని" బాబూ! ఇది నాకు గురుదక్షిణ" అంటూ దానిని దేవుని పీఠంవద్ద ఉంచారు. నాలో ఏభావం కలగలేదు. అలాగే దాన్ని చూస్తూ కూర్చున్నాను. "నీ, నా" అంటే ఏమిటో నాకు తెలియని రోజులవి. నా ముఖంలో ఎటువంటి మార్పు ఆమెకు కనబడలేదు. అందువల్ల మరికొన్ని క్షణాల తర్వాత ఆమె ఆ కాసును నా చేతిలో మళ్ళాపెట్టి, "కష్టపడి దీనిని సంపాదించు కొన్నావు ఈ డబ్బు నీది, నీదగ్గరే ఉంచుకో" అన్నారు. ఆనాడు నాకు క్రమ శిక్షణ ఎలా ఉండాలో తెలియదు గాని మరికొన్నాళ్ళకు తెలిసింది.

రాజవ్వగారు నాకు నాట్యవిద్యనేకాదు, వినయవిధేయతలనుగూడా నేర్పారు. పెద్దల యెడ చూపించవలసిన గౌరవ, మర్యాదలను, అణుకువను నేర్పారు. గౌరవాన్ని ఇచ్చి, పుచ్చుకొనడం ఎలాగో గూడా చెప్పారు. విద్యను నేర్చుకొంటు న్నప్పుడు పాటించవలసిన నియమాలను, కట్టుబాట్లను, దీక్షను నేర్పారు. ఆదర్శ కళాకారుని జీవితం ఎలా ఉండాలో ఆమే నాకు నేర్పారు.

ఇతరుల యెడ ఎప్పుడూ ఎంతో మార్దవంగా ఉండాలి కాని అవసరమైతే అంతకరకుగాను ఉండాలి, ఎప్పుడూ ఎంతో ఉదారంగా ఉండాలి, కాని సమయం వస్తే అంత మొండిగానూ ఉండాలి. వేదికపైని మనం ఉన్నప్పుడు ఎదుటి వారు ఎంత గొప్ప పండితులైనా వారు మనం చెప్పింది ఆలకించాలి గాని మనం వారు చెప్పింది విన నవసరంలేదు. ఇలాంటి విషయాలు వారు నా కెన్నో బోధించారు.

నాకు చిన్నప్పుడు మసాలా గారెలన్నా, పెసరట్లన్నా చాలా ఇష్టంగా ఉండేవి. అల్లం, పచ్చిమిరపకాయలు, ఉల్లిపాయలు, జీలకర్ర, కొత్తిమీర, కరివే పాకు వేసి చేసిన మసాలా గారెల్ని వేడివేడిగా అల్లం పచ్చట్లో నంచుకొని తినడం అంటే నా కెంతో ఇష్టంగా ఉండేది. మా గురువు గారికి ఈ విషయం ఎలా తెలి

సిందో గాని నా కోసం తరచుగా వీటిని చేయించేవారు. నేను సరిగ్గా పాఠం నేర్చు కొనే సమయంలోనే మా వంటావిడ వీటిని చుయ్ చుయ్ మంటూ వేయించేది. ఆ వాసన నా ముక్కుకి తగులుతూ ఉండేది మనసు పాఠం మీద ఉండినా భక్తి ఆ గారెల మీద ఉండేది మనస్సు వెంటనే మారిపోయి ఆ గారెల కోసం కొట్టుకు లాడేది. పాఠం మీద మనస్సు స్థిరంగా నిలిచేది కాదు. మెల్లిగా వంటింటివైపుకు మనసు మరలేది. ఇక్కడ పాఠం పూర్తయ్యే సరికి అక్కడ గారెలు సిద్ధంగా ఉండేవి.

మా గురువుగారు ఎందరికో నాట్యం నేర్పి, నాట్య విద్వాంసు లెందరినో తయారుచేసి ఉంటారు. చిన్నప్పటినుండి ఆమెదగ్గరనే పనిచేస్తూండిన ఆ వంటావిడే నేను వెళ్ళి ఉన్నప్పుడుకూడా ఉంది. ఆమె ఆటపాటల విషయంలో ఒక మొద్దు గణిక. ఆ ఇంటి గోడలకూడా సంగీతం వాసన పట్టేసిందిగాని, చైతన్యమున్న ప్రతి ప్రాణీ ఆ తాళధ్వనులకు చలించేవికాని ఆ వంటావిడలో ఎటువంటి చలనం ఉండేదికాదు ఆమె ఎన్నో పాటలు విందికాని ఆమెకు ఆ పాటల రాగాలుగాని, తాళాలుగాని తెలియవు. కొత్తవి, పాతవి అనేక రకాల దక్షిణాది, ఉత్తరాది శాఖాహార, మాంసాహార వంటలు మాత్రం చాలా బాగా చేసేది. ఆ యింట్లో రోజుకో రకం వంట.

మా గురువుగారు రోజుకో పదంచొప్పున సంవత్సరానికి 365 పదాలుపాడి అభినయిస్తూ ఉండేవారు. ఆమెతో పోటీగా మా వంటావిడ సంవత్సరానికి 365 రకాల వంటలు చేసేది. మోహనరాగం లాగ తరచుగా ఈ మసాల గారెలు మాత్రం వండేది. ఆమె నలుని సోదరో, భీముని సోదరో నాకు తెలియదు గాని ఆమె వంటలు నలభీమ పాకాలు.

నే నెప్పుడైనా వంటరిగా కూర్చుంటే ఆమె మెల్లగా నా గదిలోకి వచ్చి, కాస్సేపు మౌనంగా కూర్చుని "రామకృష్ణయ్యా! అత్తవా రూరికి అంపేరు మా వారు అనే రాగం పాడవా? చాలా రోజులయింది ఆ రాగం విని. నీకు మంచి మసాలా గారెలు చేసిపెడతాను" అని అడిగేది.

ఆమెకు మోహనరాగం చాలా ఇష్టమని గ్రహించి, నేను పాడి ఆమెకు విని పించేవాణ్ణి.

# చింతామణి

సుమారు అరవై సంవత్సరాల క్రితం నాటక ప్రయోక్త, మహాకవి స్వర్గీయ కాళ్ళకూరి నారాయణరావుగారు చింతామణి నాటకాన్ని వ్రాశారు. ఈ నాటక ఇతి వృత్తం మన చరిత్రలో ప్రసిద్ధి చెందిన పాత కథే. అయినా ఆయన ఆ కథను ఆధారం చేసికొని తమ కాలం నాటి సంఘ పరిస్థితులకు అనుగుణంగా తీర్చి దిద్ది ఒక గొప్ప సాంఘిక నాటకంగా రూపొందించారు. ఆయన కాలంలోనే కాక ఈ నాడు కూడా ఈ నాటకాన్ని ప్రదర్శిస్తున్నారు. అది ఎంతో ప్రజాదరణను పొందిన నాటకం.

చింతామణి పెద్ద కళ్లేపల్లి వాస్తవ్యురాలు. ఇది ఆంధ్ర ప్రాంతంలో ఒక పవిత్ర యాత్రాస్థలం. ఇక్కడ కేదారేశ్వరుని రూపంలో శివుడు వెలిశాడు. ఒకానొకప్పుడు ఇది బౌద్ధుల యాత్రాస్థలంగా శోభిల్లింది. శ్రీకాకుళం, ఘంటసాల, మొవ్వ, కూచిపూడి మొదలైన కళా కేంద్రాలకుచేరువలో దివిసీమలో నున్న గ్రామమిది. చింతామణి తల్లి శ్రీహరి ఒక నర్తకి, ఆమె తండ్రి ఆ యూరిలో వెలిసిన కేదారేశ్వరుడు.

ఈ చింతామణి నాటకాన్ని నారాయణరావుగారు వ్రాసిన కాలంలో దేవ నర్తకి, దేవదాసి, వెలయాలు వేశ్య, సాని అన్న పదాలు పర్యాయపదాలుగా ఉండేవి. అందువల్ల చింతామణి ఒక దేవనర్తకి అయినప్పటికీ ఒక వారకాంతగా వర్ణించబడింది. దామోదర గుప్తుడు వ్రాసిన "కుట్టనీమతం" అన్న గ్రంథాన్ని కూడ తమ నాటకానికి ఆధారంగా చేసికొన్నట్టు కనబడుతుంది. ఈ చింతామణి నాటకంలో ఒక పాత్రపేరు దామోదరుడు. కుట్టిని అనే వృద్ధవేశ్య తనకుమార్తెకు వ్యాపార రహస్యాలను నేర్పుతుంది. అలాగే ఈ నాటకంలో శ్రీహరి, చింతామణికి నేర్పుతుంది.

వేశ్యలు ఎలా జీవించాలి? వారి జీవితాలను సుందర నందనవనాలుగా ఎలా మలుచుకోవాలి? సువాసన గల కుసుమాలు భ్రమరాలను ఆకర్షించినట్టు వేశ్యలు

విటులను ఎలా ఆకర్షించాలి? విటులను కవ్విస్తూ, మెప్పిస్తూ, వారికి చిక్కకుండా ఎలా తప్పించుకొని తిరగాలి? వారి నుండి ధనాన్ని ఎలా రాబట్టుకొనాలి? తన హృదయాన్ని అర్పించకుండా, అవసరానికి శరీరాన్ని మాత్రం అప్పగించి ఈ విటుల హృదయాలలో ఎలా చోటుచేసికొనాలి? ఇలాంటి వ్యాపార రహస్యాలన్నీ ఈ నాటకంలో ఉన్నాయి. అంటే ప్రతి వేశ్యకు రెండు హృదయా లుండాలి. ఒకటి సహజమైన హృదయం. రెండవది కృత్రిమమైన వ్యాపార హృదయం.

అయితే వేశ్యలు ఎందుకిలా ప్రవర్తించాలి? అంటే వేశ్యలకు సంఘంలో ఉన్నత స్థానం లేదు. అందరూ వారిని హీనంగా చూస్తారు. ధనం ఉంటే ఇవన్నీ లెక్కలోనికి రావు.

ముప్పై అయిదు సంవత్సరాల క్రితం నేను ఆంధ్రదేశానికి వచ్చిన తొలి రోజుల్లో నారాయణరావుగారి కుమారుడు శ్రీ సదాశివరావుగార్ని కలిసే అదృష్టం నాకు కలిగింది. వారప్పుడు నెల్లూరులో ఏదో ఉద్యోగం చేస్తూ ఉండేవారు. ఆయన మంచి స్నేహపాత్రుడు. చక్కని కళాకారుడు వీణవాయించేవారు. ఆ తర్వాత ఆయన చిత్రసీమకు వెళ్ళి కొన్ని చిత్రాలకు దర్శకత్వం వహించారు.

చింతామణి నృత్య, సంగీత కళల కంటే ఆమె ప్రేమ కలాపాలను, వారాంగనల వ్యాపార రహస్యాలను ఎక్కువగా తమ నాటకంలో నారాయణరావు గారు చిత్రించారు. వేశ్యల శయ్యామందిరంలో ఒక విటుడు ఉంటే మంచ కింద ఒకడు, వంటింట్లో ఒకడు, పెరట్లో వేరొకడు, మాసిన బట్టల బుట్టలో మరొకడు ఒకరికి తెలియకుండా మరొకడు ఉంటాడు. విలాస పురుషులను, వారి సంస్కారాలను, వారి మర్యాదలను, చమత్కారాలను, ఎత్తిపొడుపులను, పొడుపుకథలను వృద్ధవేశ్యల అనుభవాలను, ఇంకా ఇలాంటివి ఎన్నో ఎక్కువగా ఆయన వర్ణించారు. అప్పటికే శాస్త్రీయ నృత్యకళ తన గౌరవాన్ని కోల్పోయింది. వేశ్యలు నృత్యకళను వదిలిపెట్టి, తమ శరీరాలతో వ్యాపారం మొదలుపెట్టారు. బ్రాహ్మణ క్షత్రియ, వైశ్య కులాల వారందరూ వేశ్యల శృంగార వనాల్లో విహరిస్తూ, వారి అధరసుధా రసాన్ని గ్రోలిన ప్రేమ పక్షులైనారు. వైశ్యుడు తనకున్న దంతా చింతామణికి ధారపోసి చివరకు అల్లం పెసరట్టు అమ్ముకోవలసి వచ్చింది. విష్ణు దేవుని చేతిలోని చక్రంలా ఈ నాటకంలోని సుబ్బిశెట్టి తన పెసరట్లను వాడు

కొన్నాడు. అల్లం పెసరట్టు, ఉల్లి పెసరట్టు, జీలకర్ర పెసరట్టు నేతి పెసరట్టు, నూనె పెసరట్టు, పప్పు పెసరట్టు, పొట్టు పెసరట్టు, ఎర్రగా కాలిన పెసరట్టు, కరకరలాడే పెసరట్టు ఇలా ఎన్నో రకాల పెసరట్లను ఆ సుబ్బిశెట్టి దేవుడికు అమ్ముకోవటనికి వచ్చింది.

చింతామణి వ్యాపారం మూడు పువ్వులు ఆరుకాయలుగా సాగింది. ఆమెకు తీరిక లేదు, ఖాళీలేదు. అయినా ఆమె దైవసాన్నిధ్యంలో పుట్టింది. దేవుడంటే ఒక మూల ఆమెకు భయ ముండేది. అందుకే ఎప్పుడైనా తీరిక దొరికితే తన గురించి విమర్శించుకొనేది. మూడు కాళ్ళ ముసలి వానిని చూచినప్పుడు, చనిపోయిన వాని శవాన్ని చూసినప్పుడు బుద్ధునికి బాల్యంలో కలిగిన సందేహాల్లాంటివే చింతామణికి కలిగేవి. తానెవరు ? ఎక్కడ నుండి వచ్చింది? ఎందుకు పుట్టింది? పుట్టినందుకు సార్థకమేమిటి? ఇటువంటి ప్రశ్నలు ఆమెను వేధించేవి. కామిగాక మోక్షకామి గాడు అని త్యాగయ్య అన్నట్టే ఆమెకు జీవితంపైని విరక్తి కలిగించి. జీవితమంతా బాగా అనుభవించిన తర్వాత సర్వసంఘ పరిత్యాగం చేసింది తన ఆస్తినంతా దానం, ధర్మం చేసింది. చివరకు విరాగిని అయింది.

ఒకప్పుడు ఆమె శారీరక సౌందర్యానికి ముగ్ధుడయిన బిల్వమంగళుడు ఇప్పుడు ఆమె ఆత్మ సౌందర్యానికి దాసుడయ్యాడు. ఆమెకు శిష్యుడైనాడు. లీల శుకుడయ్యాడు. అష్టాక్షరీ జపాన్ని పారాయణ చేశాడు. తన తపస్సు సిద్ధించింది. కృష్ణ పరమాత్మ సాక్షాత్కరించాడు శ్రీకృష్ణ కర్ణామృతాన్ని రచించాడు. మధురమైన భావాలతో ముచ్చటైన శ్లోకాలు గల కావ్య మది. భక్తి భావంతో తొణికిసలాడే ఈ కృష్ణ కర్ణామృతం భారతజాతి వర్ధిల్లుతున్నంత కాలం సజీవంగా ఉంటుంది. ఇదొక అమర కవిత, దీనిని మించిన కవిత మరొకటి లేదు.

"కస్తూరీ తిలకం లలాటఫలకే" అనో "వేణీమూలే విలసతి ఘనశ్యామ పించావచూడే" అనో, "మందం, మందం మధుర నినదై ర్వేణుం మా పూరయంతిమ్" అనో పాడి అభినయించని నర్తకులు లేరు, చూచి ఆనందించని రసిక జనులు లేరు.

మా చిన్నతనంలో కాకినాడలో పెసరట్ల చెంచయ్య చాలా ప్రఖ్యాతుడు. ఆ జిల్లాలో ఎక్కడెక్కడ నుండో వచ్చేవారు ఆయన పెసరట్లు రుచిచూడడానికి.

పెసరట్లు, పుల్లట్లు, సగం పెసర + సగం పుల్లట్టు — కిలగలపు రొట్టెలా పెసరట్టు + వుప్మా = ఎం. ఎల్. ఏ. పెసరట్టు. ఇలా ఎన్నో రకాలు, రకరకాలు అట్లువేసి మూడంతస్థులమేడ గట్టాడు. అది నేటికీ వుంది వారి వ్యాపారం గూడా సాగుతూంవనుకుంటాను.

బహుశా మహాకవి కాళ్లకూరి వారికి యీ చెంచయ్య పూర్వీకులకు పరిచయ ముండి వుంటుంది.

చింతామణి నాటకం అంతా ఒక ఎత్తు. సుబ్బిసెట్టి హాస్యము ఒక యెత్తు.

కాని నేడు ఆ సుబ్బిశెట్టి పాత్రతో ఘోరంగా మాట్లాడించే భాష-బూతుల పురాణం కంఠధ్వని మాధుర్యం వినశక్యంగాదు చెవులు మూసుకోవలసిందే. వేషధారణ అతిదారుణం. మాట్లాడే తీరు రామ రామ చెప్పలేము. కేవలం ధనం కొరకు సంస్కారవంతురాలైన, అప్పటికే ధనవంతురాలైన, చింతామణి ఎంత కుల వృత్తి అయినా యెలా భరించిందో మరి? ఆఖరికి ఆమెకు దర్శన మిచ్చిన కృష్ణ పరమాత్మకే తెలియాలి ఆమెకే తెలియాలి.

తెలుగు భాష రకరకాల ధ్వనులతో రకరకాల అర్థాలతో, రకరకాల భావాలతో భావావేశాలతో, రస గుళికలులా హాస్యం గాస్‌లా అందు పొంగి పొరలుతుంది.

తుఫాను, ఉప్పెన, పెనుగాలులు వీచడం, నదులు పొంగడం కథానాయకుని హృదయంలో ప్రేమాగ్నులు రగులుకోవడం, అతడు వానలో తడవడం, పొంగి పొరలుతున్న నదులు ఈదడం, ప్రియురాలు యింటి ప్రహారీ గోడ, త్రాచుపామును కొబ్బరిత్రాడు అనుకొని ప్రాకి యెక్కడం, అంతకుముందే ఆమెకు దైవ సాక్షాత్కారం కావడం.

జీవితం మీద విరక్తి పుట్టి ఆమె విరాగిని కావడం—అతన్ని చూచి ఆమె వేదాంత పరంగా మానవ జీవితం గూర్చి మాట్లాడడం - ఆమెతో సహా అతడూ సన్యాసి అవడం.

ఇదంతా నాటక రమ్యత కొరకు మహాకవి కాళ్లకూరివారే ప్రవేశ పెట్టేరో లేక పూర్వముండిందో తెలియదుగాని - ప్రతి భక్తునికి యోగికి ఇదే కథ వ్రాశారు - మనవారు. యోగి సిద్ధేంద్రుని చేత అతని ప్రియురాలిని కలియుటకు వరదల్లో వున్న కృష్ణవేణమ్మను దాటించారు.

తులసీదాసు, సూరదాసు ఒక్కరేమిటి కాస్తోకూస్తో శృంగారాన్ని తమ జీవితంలో చవిజూచిన యోగులందరిచేత ప్రియురాలి సందర్శనం గూర్చి, గోడలు దూకించారు. నదులు దాటించారు, భళిరా, భళి, భళిరా!! మన కవుల కపోల విలాసాలు!

# చంద్రవదన

సుమారు నూరు సంవత్సరాల క్రితం చంద్రవదన, ఇందువదన అని ఇద్దరు అందాలరాసు లుండేవారు. వారిద్దరూ సోదరీమణులు. భరతాభినయాలకో నిష్ణాతులు. విశాఖ జిల్లాలోని కోటవురట్ల వారి స్వగ్రామం. ఆ గ్రామానికి వన్నె తెచ్చినవారు, పేరు తెచ్చిన వారూ వీరే.

తుని పట్నం నుంచి ఒక నర్తకి వచ్చి వీరివద్ద నృత్యాభినయాలు నేర్చుకొంది. తుని ఒక క్షత్రియ సంస్థానం. వత్సవాయి జగపతులు పాలించిన సంస్థానానికి తుని ముఖ్యపట్నం. ఈ తుని రాజులు పెద్దాపురసంస్థానానికి చెందినవారు. పద్దెనిమిది బురుజులు గల కోట పెద్దాపురంలో ఉండేది. ఆ సంస్థానం తర్వాత పతనమయింది. ఆ రాజ వంశీయులే తుని సంస్థానాన్ని పరిపాలించారు.

చంద్రవదన, ఇందువదనల వద్ద నేర్చుకొన్న ఆ నర్తకి భరత విద్యను సంపూర్ణంగా అభ్యసించి, పరీక్షలో పండితుల మెప్పును పొంది తిరిగి స్వగ్రామం చేరుకొంది. తన స్వగ్రామానికి వచ్చేముందు, తాంబూలం, ఫలపుష్పాదులు, సుగంధ ద్రవ్యాలతోపాటు విక్టోరియారాణి ముద్రగల వేయినూటపదహారు రూపాయలను, బనారసు పట్టుచీరెతో బాటు బంగారు బటువును ఒక వెండి పళ్లెంలో ఉంచి చంద్రవదన గారి పాదాల ముందుంచింది. గురువుగారు ఆనందంతో ఆ దక్షిణను ఒకసారి స్పృశించి, తాంబూలం, ఫలపుష్పాదులు, సుగంధ ద్రవ్యాలను స్వీకరించి, "అమ్మాయీ! నా కివి చాలు. నా పేరు ప్రఖ్యాతులు దేశం నలుమూలలా వ్యాపించేటట్టు ప్రదర్శన లియ్యి. అదే నాకు గొప్ప గురుదక్షిణ" అని ఆదరంగా శిష్యురాలి నుదుట తిలకం దిద్ది, దీవించి పంపింది. ఆమె ఆ తర్వాత అనేక నృత్య కేళికలను దేశమంతటా ప్రదర్శించింది. కొన్నాళ్ళకు ఆమె కొక ఆడపిల్ల పుట్టింది. ఆ బిడ్డకు బాలసారె, నామకరణం చేసే రోజున ఆమె తన గురువు గారిని ఆహ్వానించింది. "నీ కూతురుకు ఏం పేరు పెడుతున్నా" వని చంద్రవదన శిష్యురాలిని అడిగింది. "నా తర్వాత గూడా మీ పేరు శాశ్వతంగా కళాలోకంలో నిలిచి ఉండాలని చంద్రవదన అని మీ పేరే పెడుతున్నా" నని శిష్యురాలు చెప్పింది.

చంద్రవదన మనసులో ఎంతో సంతోషించి, ఇందువదనతో గూడ బాల సారె, నామకరణోత్సవానికి వెళ్ళింది. శిష్యురాలి అద్దాలలోనున్న ఆ పసిపాపను "చంద్రవదనా" అని పిలిచి, ఆ పసికందు చేతిలో ఒక రాణీకాసును ఉంచింది. ఆనాడు తునిలో ఒక చంద్రవదన వెలిసింది.

తుని చంద్రవదన పెరిగి పెద్దదయింది. కోటవురట్ల చంద్రవదన, ఇందు వదనలు వృద్ధులయినందున చిన్న చంద్రవదన భరత విద్యను నేర్చుకొనడానికి పిఠాపురం వెళ్ళింది. కాని అప్పటికింకా చిన్నతనం బుద్ధులు పోలేదు. అల్లరిపిల్లగానే ఉంది.

పిఠాపురం కుంతి మాధవుని ఆలయం వద్ద ప్రత్యేకంగా ఒక తులసివనం, ఒక పూలతోటా ఉండేవి. ఆ తులసి వనం, ఆ పూలతోటల్లోని తులసి దళాలు, పూలతోటే కుంతి మాధవునికి నిత్యం అలంకరణ జరిగేది. అందువల్ల ఆ తోట ల్లోకి ఎవరినీ వెళ్ళనిచ్చేవారు కారు. ఈ చిన్నచంద్రవదన ఎలాగో దొంగతనంగా ఆ పూలతోటలో ప్రవేశించి, ఇష్టమొచ్చినన్ని పూలను తెంపుకొని, మాలలు కట్టి, తనకు కావలసినవి తలలో పెట్టుకొని, తక్కినవి తోటిపిల్లలకు పంచిపెట్టేది

తోటలోనిపూలు మాయమౌతున్నట్టు పూజారులకు తెలిసింది. తోటమాలిని మందలించి, జాగ్రత్తగా పూల తోటను కాపలా కాయమన్నారు. ఆ తోటమాలి నిఘా వేసి చంద్రవదనను పట్టుకొనబోయాడు. ఆ కాపలావాడు హరిజనుడు. అతను తాకితే ఆమె మైలపడిపోతుంది. అందువల్ల చంద్రవదన తన ఒడిలోని పూలను కిందపోసి 'దయచేసి నన్ను తాకకు. ఈ రోజునుండి ఈ తోటలోకి రానని ఒట్టు వేసి చెబుతున్నాను. ఇంక మరెప్పుడు అల్లరి చేయ' నని ఒట్టు వేసుకొని మరీ చెప్పింది. ఆ తోటమాలి మారుమాట్లాడకుండా వెళ్ళిపోయాడు.

ఆనాటితో ఆమెలో పరివర్తన వచ్చింది. ఆమె అల్లరి అంతరించింది. పరమసాధువుగా మారిపోయింది. తను ఎందుకు పిఠాపురంవచ్చిందో గుర్తు తెచ్చు కొంది. రాత్రీ, పగలు పట్టుదలతో భరత విద్యను అభ్యసించింది భరత కళా ప్రపూర్ణగా తల్లి వద్దకు తిరిగి వెళ్ళింది. తాను నేర్చుకొన్న విద్యను గురించి, తన కళను ప్రచారం చేయడం గురించి, పండిత సత్కారాలు పొందడం గురించి ఎంత సేపూ ఆలోచిస్తూ, పగటి కలలు కంటూ కూర్చునేది.

ఆమె కష్టపడు ఇంకా పద్నాలుగేళ్ళే. ఇంకా నూతన యవ్వనంలో అడుగు పెడుతూ ఉంది కాని ఆమె అంగ సౌష్టవం వయస్సును మించి యుంది ఆ చందమామనే మరిపించేటట్టు, మురిపించేటట్టు ఉంది ఆమె అందం. ఆ యూరి పెద్దలనందర్నీ ఆహ్వానించి రంగని ఆలయంలో ఆమె నృత్యకేళికను ఆమె తల్లి ఏర్పాటు చేసింది అనాడు చంద్రవదన బ్రహ్మాండంగా ఆడి, పాడి, అభినయించింది. అందరూ ఆశ్చర్యచకితులయ్యారు. "ఎక్కడ నుండి వచ్చింది ఈ చంద్రవదన? దివి నుండి భువికి వచ్చిందా!" అని అందరూ మురిసిపోయారు. అలా వారు అనుకొనడంలో అబ్బురం ఏం లేదు. ఆ పాటా, ఆ యలంకరణా, ఆ యభినయం, ఆ యంగసౌష్టవం వర్ణించడానికి అలవికానివి. ఆమె నిజంగా అప్సరసే!

ఆ కేళిక ముగిసింది. ఆమె కాళ్ళగజ్జెలను విప్పుతూ ఉండగా ఒక క్షత్రియ యువకుడు నట్టువాంగం చేసిన యువకుని దగ్గరకు వచ్చి "ఎవరయ్యా ఈమె? ఇంద్ర సభలోని రంభా? ఊర్వశీ, తిలోత్తమలను మించి ఆడింది!" అని అడిగాడు.

అతని మెప్పుకు మురిసిపోయి, "ఎవరేమిటండీ? ఈమె సాక్షాత్తూ నా చెల్లిలేనండి" అన్నాడు అతడు.

"ఏమిటీ నీ చెల్లెలా! నే నింకా ఈమె ఏ తంజావూరు నుండో వచ్చిందనుకొంటున్నాను ఇంతా చేస్తే మన పూరి పిల్లే నన్నమాట!" అని మూతి విరుచుకొంటూ వెళ్ళాడు.

ఈ సంభాషణ విన్న చంద్రవదన పసి హృదయం గాయపడింది. అసలే పౌరుషవంతురాలు. ఆనాడు ఆమె అహం దెబ్బతినడంతో ఆమె జీవితమే ఒక మలుపు తిరిగింది. "పెరటిచెట్టు మందుకు పనికిరా"దన్న సామెత ఆనాటికి ఆమెకు తెలియకపోయినా అనాటి నుండి ఆమె మళ్లీ ఆ యూరిలో కచ్చేరీలు చేయలేదు. ఇతర చోట్ల కర్నాటక కచ్చేరీలు చేసి పేరు ప్రఖ్యాతులతో బాటు ధనం కూడా సంపాదించింది. వృద్ధాప్యం వచ్చిన తర్వాత కేళికల నుండి విరమించి, భగవన్నామ స్మరణ చేసికొంటూ ప్రస్తుతం కాలం గడుపుతోంది

ఈమె కర్నాటక సంగీతాన్ని అభ్యసించింది. ఈమెది మంచి గాత్రం. హార్మోనియం బాగా వాయించగలదు.

ఆమె యవ్వనంలో నున్న కాలం నాట్యానికి కృష్ణపక్షం రోజులు. అందువల్ల ఒక సన్నాయి వాయిద్యకునికి సంగీతంలో శిక్షణ ఇచ్చింది.

తన చేతులకు అయిదు తులాల బంగారు గాజుల్ని, మెడలో ఒక బంగారు గొలుసును, చెవులకు పుష్పరాగ దుద్దుల్ని మాత్రం ఉంచుకొని తన మిగతా ఆస్తినంతటినీ తన పిల్లలకు సమానంగా పంచి యిచ్చేసింది. తను ఎవరి వద్ద ఉంటే వారికి తన భూమి మీద నుండి వచ్చే పంటను ఇస్తూ ఉంటుంది. తన తదనంతరం, తన దినవారాలకు తన ఒంటి మీద బంగారాన్ని ఖర్చు పెట్టమని తన పిల్లల్ని ఆదేశించింది.

ఈమెను గురించి పిఠాపురంలో నా కెన్నో విషయాలు తెలిశాయి. ఈమె కేళికలను చూచిన కొంతమంది పెద్దలు ఈమె సంగీతాన్ని, నృత్యాభినయాలను మెచ్చుకొంటూ చెప్పారు. ఈమె మంచి వ్యవహారదక్షణతగల వ్యవహర్త. కొన్నాళ్లు ఈమె తుని పురపాలక సంఘ సభ్యురాలిగా ఉండేది. ఈమె ఉత్తమ సంస్కారం గల కళోపాసిని.

పిఠాపురంలో అల్లంరాజు సుందరంగారు మాటల సందర్భంలో ఈమె విద్యను గురించి గొప్పగా చెప్పారు చిన్నప్పుడు ఈమె పిఠాపురంలో శ్రీమతి దువ్వా సూర్యకాంతం అనే ఒక గొప్ప నట్టువరాలి వద్ద భరత విద్యను నేర్చుకొన్నట్టు చెప్పారు. ఈమె గురించి వినగానే సుందరంగార్ని వెంటనే ప్రయాణం కట్టించాను. మేము ముందు పాయకరావుపేటలోని గెద్దనాపల్లి వంతం వారి ఆడపడచు శ్రీమతి మహాలక్ష్మమ్మగారి ఆతిథ్యం స్వీకరించాం. ఈమె అపరలక్ష్మీదేవి. కళల పట్ల ఈమెకు చెప్పలేనంత ఆప్యాయం, ఆదరణ.

చంద్రవదన గారింటికి సుందరంగారు వెళ్ళి వచ్చారు. ఆ రోజున ఆమె ఇంట్లో ఏదో శుభకార్యం జరుగుతోంది ఈయన వెళ్ళేసరికి. ఒక గంటలో వస్తున్నట్టు ఆమె కబురు పెట్టింది.

నేను ఇంతలో స్నానపానాదులను ముగించుకొని అతిథిగృహంలో విశ్రాంతి తీసికొంటున్నాను. నాకు నిద్ర పట్టేసింది. "ఏ మగువ బోధించెరా! ఎందుకింత మోడి చేశావు? శ్యామ భూపాల తనయా! సరస శ్రీకృష్ణరాజేంద్రా!" అన్న వర్ణం స్వాప్నికావస్థలో నాకు వినబడింది. కళ్ళు తెరిచి చూశాను. గదిలో ఎవరూ లేరు. ప్రక్క గదిలో నుంచి ఆ పాట వినబడుతూంది. వారగా వేసియున్న తలుపును కొద్దిగా తెరిచి ప్రక్క గదిలోకి చూశాను. పూర్తిగా నెరసిన జుత్తు, చంపకు చారిడేసి కళ్ళు విశాలమైన నుదురు, పూర్ణచంద్రుని వంటి ముఖం. "ముడతలు పడినా నిన్నునే విడిచిపోను" అన్నట్టు ఆమెలో అందం కొట్టవచ్చినట్లు కనబడింది. అంచులేని తెల్లని చీరెను, రవికెను ఆమె ధరించింది. ఒక పాలరాతి విగ్రహంలా ఉందామె.

నేను కేళికలను చేస్తూండిన రోజుల్లో అమర్‌కంటక్ వెళ్ళేను, అది నర్మదా నదికి జన్మస్థలం. దక్షిణాపథంలోని నదులన్నీ పశ్చిమాన పుట్టి, తూర్పు దిక్కుగా ప్రవహించి బంగాళాఖాతంలో కలుస్తాయి. నర్మదా, తపతీ నదులు మాత్రం తూర్పున పుట్టి, పశ్చిమంగా ప్రవహించి, అరేబియా సముద్రంలో చేరతాయి. ఈ నర్మదానది పుట్టిన అమర్‌కంటక్ వద్ద ఒక గుహలో పాలరాతి శివాలయముంది. అందులో అమ్మణ్ణి, శివుల విగ్రహాలున్నాయి. ఉదయమే పూజారి శివుని ఆరాధించి అంబ విగ్రహం వద్ద ఒక నేతి దీపం పెడతాడు. ఆ గుహలోని కారు చీకట్లను తొలగించి, చల్లని కాంతుల్ని ఆ దీపం ప్రసరిస్తుంది. ఆ కాంతిలో కళ్ళకు మిరుమిట్లు గొల్పేటట్లు అంబ దర్శన మిస్తుంది. ఈ చంద్రవదనను చూడగానే ఆ యంబ జ్ఞప్తికి వచ్చింది. ఆమెను అలాగే తదేకంగా చూస్తూ నిల్చుండిపోయాను.

"బాబూ! ఇన్నాళ్ళకు దర్శన మిప్పించారా? నా జన్మ ధన్యమైంది!" అని కన్నీరు కార్చింది. "బండి రాలేదు బాబూ! ఇంకో బండీ ఏదీ సమయానికి దొరకలేదు. తుని ఇక్కడకు కాస్త దూరమే అయినా మిమ్మల్ని వెంటనే చూడాలని మనసు ఆరాటపడింది. అందుకే నడిచి వచ్చేశాను" అంది ఆమె. అయ్యో! ఆమెను కష్టపెట్టేనే అని మనసులోనే అనుకొన్నాను. తర్వాత మేమంతా కూర్చుని ఆంధ్రప్రదేశంలోని భరత విద్య గురించి చర్చించాం. ఆమె ఎంతో సంబరంతో, ఎంతో ఆసక్తితో తన చిన్ననాటి ఆట తీరులను, తన ప్రదర్శనలను వర్ణిస్తూ చెప్పింది.

ఆమెను ఎలా వర్ణించాలి? ఆమె ఒక సంగీత రత్నాకరం, ఒక నృత్త రత్నాకరం. ఇంకెలా చెప్పినా తక్కువే అవుతుంది.

"బాబూ ఈ చివరి దశలో మీ దర్శనం అయింది, జన్మతరించింది. ఇందుకోసమే ఇంతకాలం జీవించానేమో!" అంది నేనిదివరకు ఎందరో కళాకారుల్ని చూశాను. కాని ఇంత లోతుగా భరత విద్యను గురించి చర్చించిన వారిని నేను చూడలేదు. ఆమె విమర్శనా జ్ఞానం నాకే ఆశ్చర్యాన్ని గొలువుతూంది. నృత్త, నృత్య, అభినయాలను, మొత్తం భరత విద్యను కాచి వడబోసిన కళాకారిణి ఆమె. రెండు, మూడు గంటల చర్చానంతరం ఈ మాటే ఆమెతో అన్నాను. "నా విద్య ఏ పాటి బాబూ మా యమ్మగారిది అసలైన విద్య. ఇంకా ఆమె గురువుగారిది సరేసరి" అంది.

ఇంతలో ఆమెకు ఇంటినుండి కబురు వచ్చింది ఆ రోజున ఆమె పెద్ద కొడుకు కూతురుకు బాలసారె, నామకరణం ఇంటినిండా బంధువులున్నారు. వారంతా ఈమె కోసం భోంచేయకుండా వేచి యున్నారట, అదీ ఆ పిలుపు.

"అబ్బాయీ! మనింట్లో ప్రతి సంవత్సరం ఇలాంటి వేడుకలు జరుగుతూ ఉంటాయి. కాని ఇవాళ నాకు చాలా పెద్ద పండుగ ఇక్కడ. మా రామకృష్ణబాబు వచ్చారు. ఆయన వెళ్లే వరకు నే నిక్కడే ఉంటాను. మీరంతా భోంచేసేయండి. నేనిక్కడే ఈ మహాలక్ష్మమ్మ పెట్టే ప్రసాదం ఆరగించి వస్తాను." అని చెప్పి ఆ కబురు తెచ్చిన కుర్రవాణ్ని ఆమె పంపించేసింది. ఆ మహాలక్ష్మమ్మ మాకు ఏం పెట్టిందో జ్ఞాపకం లేదు గాని భరత రససారాన్ని నేను ఆరగించాను.

భోజనానంతరం ఆమె తొందర, తొందరగా అనేక పాటలు పాడి, అభినయించింది తర్వాత నన్ను పాడి, అభినయించమంది. సుందరంగారు మరి తప్పదన్నారు. ఆమె అభినయించిన వర్ణానికి సమాధానంగా, "నిన్ను జూడ గలిగే నిన్నాళ్ళకు, నిన్ను జూచి నాలుగైదు నెలలాయె మువ్వగోపాలా" అన్న పున్నాగవరాళి పదాన్ని అభినయించాను. ఇది చాలా అపురూపమైన పదం. దీనిని అందరూ అభినయించలేరు దీనిని అభినయించి ఒప్పించడం చాలా కష్టం. ఆమె నా అభినయం చూసి, కళ్ళంట నీరు పెట్టింది. "ఎంత చక్కగా అభినయించావు

నాయనా! నాకూ ఈ పదాన్ని నేర్చుకోవాలనిపిస్తూంది. కాని నా జీవితం చివరి దశకు చేరుకొంది. పూర్తిగా చీకటి పడే సమయానికి మువ్వగోపాల స్వామి దర్శన మిచ్చాడు:" అంటూ ఆనంద భాష్పాలు రాల్చింది ఆమె. కొంతసేపు ఆ రసానుభూతిని అనుభవిస్తూ అలాగే ఉండిపోయింది.

ఇంతలో రైలుకు వేళయిందన్న కబురు వచ్చింది. నేను, సుందరంగారు లేచాం. "బాబు! ఆఖరి నమస్కారం. వయస్సులో మీ కన్నా పెద్దదాన్ని. కనుక ఈ నమస్కారం నీకు కాదు నీలోని ఆ కళాసరస్వతికి నేను వృద్ధ కళాకారిణిని. నా కళను ఈ లోకం ఏం అర్థం చేసికో గలదు? నా హృదయవేదన ఎవరికి చెప్పుకో గలను? చెప్పినా ఎవరు వింటారు? నీలాంటివారు ఎందరున్నారు?" అంటూ ఆమె కళ్ళ నీళ్ళు పెట్టుకొంది. మళ్ళా ఒకసారి చేతులు జోడించి, "వెళ్ళిరా, నాయనా" అంటూ అశ్రువులు రాల్చింది. అదొక హృదయాన్ని కరిగించివేసే దృశ్యం. మా కారు మలుపు తిరిగి కనుమరగయ్యే వరకు ఆమె అయింటి వాకిట నిలబడి యుండడం నేను చూశాను. ఇంటికి తిరిగి వచ్చాక కొన్నాళ్ల వరకూ ఆమె అభినయనమే నా కళ్లకు గోచరిస్తూ ఉండేది. మరికొన్నాళ్లకు ఆ చంద్రవదన కృష్ణ సాన్నిధ్యాన్ని చేరుకొన్నట్టు లేఖ వచ్చింది. ఆమె అభినయం ఒకసారైనా నేను చూడాల్నే అమె అంతవరకూ జీవించిందేమో!

# కళావరు రింగు

"కచ్చేరీ చేయడానికి కళావరు రింగు వచ్చిందట. కాంటీకి వెళ్దాం వస్తావా తూర్పువారి ఆటను చూడవచ్చు" అని ఒక నాగపూర్ ఆంధ్ర మిత్రుడు నన్ను అడిగాడు.

"కళావరు రింగేమి టయ్యా? ఆదేం పేరు?" అని నేను అమాయకంగా అడిగాను.

"ఎవరో ఒక సరసుడు నర్తకురాలికి పెట్టిన ముచ్చటైన ముద్దు పేరు. అదే ఆమె సార్థక నామమయి పోయింది. అసలు పేరు ఎవరికీ తెలీదు." అంటూ ఆ మిత్రుడు కొన్ని హాస్యోక్తులు ఆమె గురించి విసిరాడు. అలాంటి హాస్యోక్తులను ఆనందించే వయస్సు మనస్సు గాని ఆనాడు నాకు లేవు. అటువంటి ప్రసంగాలను వినడానికి కూడా నా మనస్సు అంగీకరించేది కాదు. కాని నాట్యం చూడ్డం అంటే చాలా యిష్టం అందుకే అతనితో గూడా బయలు దేరాను.

నాగపూర్ నగరానికి పదిమైళ్ల దూరంలో కాంటీ ఉంది. అది ఒక కంటోన్ మెంట్ అక్కడ వందలాది మంది తెలుగు వారు స్థిరవాసం ఏర్పరచుకొన్నారు. అక్కడ సేఠ్ రామకృష్ణ రామనాథ్ అనే బీడీ వర్తకు డుండేవాడు. ఆయన కోటీశ్వరుడు. ఆయన ఇంటో పెళ్ళి జరుగుతోంది. స్నేహితులు కోర్కె పైన ఆయన కళావరు రింగ్ మేజువాణీని ఏర్పాటు చేశాడు. కళవర్ రింగ్‌ది విజయ నగరం, మిగిలిన ఆంధ్ర ప్రాంతాల్లోని నర్తకులకు కర్ణాటక ఆటతప్ప హిందీ టుమ్రీలు, ఉర్దూ గజళ్ళు అభినయించడం తెలియదు. కళావరురింగుకు ఇవి తెలుసు. అందువల్లనే ఆనాటి మేజువాణీకి ఆమెను ఆహ్వానించారు.

మేం వెళ్లేసరికి ఆమె ఒక టుమ్రీని అభినయించి, తాపాను ప్రదర్శిస్తున్నది తర్వాత ఆమె తలపైన ఒక సోడాబుడ్డీని పెట్టుకొని, ఒక నీళ్ల పళ్లెం అంచులపైన నిలబడి నాట్యమాడింది. ఆ గాస్ లైట్ల వెలుగులో ఆ మేళం జిగేల్

మని మెరిసిపోతూ ఉంది. ఆమె బాగా పాడింది. ఆడింది. ఆదొక అత్యద్భుతమైన బాణీ. ఆ పాటలోను, ఆటలోను, అభినయంలో ప్రత్యేకత ఉంది. ఆమెను అందరూ అభినందిస్తూ కానుకల కనకవర్షం కురిపించారు. ఒకరు చేతికున్న ఉంగరాన్ని తీసి ఇచ్చారు. ఇంకొకరు మెడలోని గొలుసును తీసి విసిరారు. మరొకరు నోట్లకట్టను అందించారు. మరొకరు తన కోటుకున్న బంగారు బొత్తాలను తీసి ఇచ్చేశారు. వేరొకరు చేతికున్న వాచీని తీసి ఇచ్చారు. ఇదంతా చూస్తూంటే నాకు వింతగా తోచింది ఆశ్చర్యం వేసింది. "చూడు, చూడు, ఇంకా చూడు!" అన్నాడు నా మిత్రుడు.

కళావర్ రింగ్ మాత్రం ఈ బహుమతులు ఇచ్చిన వారెవరి వైపూ చూడకుండా ముసి, ముసిగా నవ్వుతూ రెండు చేతుల్లోను రెండు జ్యోతులు పెట్టుకొని తలపైని సోడా బుడ్డీ పెట్టుకొని! నీళ్ల పళ్లెం అంచుల పైన నిలబడి, కాలం పైకాలం లోను, కాలం క్రింది కాలంలోను, మధ్యలయలోను, ద్రుత లయలోను ఆడుతూనే ఉంది. చూస్తున్నవారికి మతులు పోతున్నాయి. తర్వాత భరత శాస్త్రంలోని భంగిమల్ని ప్రదర్శించి, ఆటను ముగించింది. సభకు నమస్కరించి, వేదిక పైన నిలబడింది. ఆనాటి కార్యక్రమం ముగిసింది.

పెండ్లి జరిగిన అయిదు రోజులూ ఆమె తన కేళికలను ప్రదర్శించింది. ఆ మర్నాటి ఉదయం నేనూ, నా స్నేహితుడూ వెళ్ళి, ఆమెను కలిశాం. ఆమె వంటినిండా బంగారు నగలే. ఆ నగలతో ఒక అమ్మవారికి ఒక కవచం చేయించ వచ్చు.

మాతోబాటు అక్కడింకా చాలా మంది పెద్దలున్నారు. కౌమారంలో అందంగా ఉన్న నన్ను చూసి "ఈ యబ్బాయి ఎవరు?" అని ఆమె ఎవరినో అడిగింది. ఆయన నా గురించి ఏం చెప్పాడో నాకు వినబడలేదు. తర్వాత ఆ పెద్దల కోర్కెపైని కొన్ని పాటలు పాడింది దాంతో నాకు ధైర్యం వచ్చి, ఉత్సాహంగా "ఒక వర్ణం పాడరూ?" అని ఆమెను అడిగాను. "ఏమిటి బాబూ? ఏం పాడమన్నావ్?" అంటూ ఆశ్చర్యం ప్రకటించి "నీకు వర్ణం కావాలా? నా తండ్రే! ఈ యయిదు రోజులూ ఎవ రడిగినా ట్రప్పీలు, గజల్లే అడిగారు జావళీలు, పదాలు, వర్ణాలు ఎవరూ అడగలేదు. నీదేవూరు నాయనా!" అంది.

నా గురించి వివరంగా నా మిత్రుడు చెప్పాడు. నేనొక ఆంధ్ర నాట్యకళాకారుణ్ణని తెలిసి ఆమె సంతోషించి, "వనజాక్షిరో" అనే కళ్యాణి వర్ణంలోని పల్లవి, అను పల్లవి పాడి, కొద్దిగా అభినయించి "చాలా బాబూ!" అంటూ వర్ణాలు అడిగే నీ వంటి వారు ఇక్కడ కూడా ఉన్నందుకు నాకు చాలా సంతోషంగా ఉంది" అంటూ ఆమె మందహాసం చేసింది.

ఆమె వంటి రంగు చామనచాయే అయినా ఆకర్షణీయమైన నిండైన విగ్రహంతో ఆమె అందంగా ఉంది.

కళావర్‌రింగ్ బాగా సంపాదించింది బాగా దాన ధర్మాలు చేసింది. అడిగిందే తడవుగా పేద విద్యార్థులకు ఆర్థిక సహాయం చేసింది. తాగడానికి నీళ్ళు లేక అవస్థలు పడుతున్న పేద ప్రజల నివాస స్థలాలలో బావులు తవ్వించింది. ఘంటసాల వేంకటేశ్వరరావు వంటి బీద గాయకులకు తంబూరాలు కొని బహూకరించింది. అంతటి దాన బుద్ధి గల కళాకారిణి ఆమె. అంత వరకు మామూలు మేజువాణీ కళాకారిణిగా ఆమెను చూసిన వారు ఆమెను విజయనగరం కళాకారిణి అయిన లక్ష్మీనరసమ్మగా గౌరవించారు. "ఆమె కళావంతుల వంశంలో పుట్టలేదు. ఆమె వెలమవారి ఆడపడచు. ఆమెను కళావంతులు పెంచినా ఆమెది ఉత్తమ వంశం గనుకనే ఆమె కంతటి ఉదార స్వభావం ఉం"దన్నారు ఆ పెద్దలు.

రాధాకృష్ణ పండితుడు భారతదేశానికి అధ్యక్షుడైన తర్వాత "మావాడంటే మావాడని, మా నియోగి అంటే మా వైదీకి" అని ప్రజలు వాదులాడుకొన్నారు. అలాగే కళావరేరింగ్ విషయంలో జరిగింది. అన్నింటికీ ఆమె చిన్న నవ్వు నవ్వి ఊరుకొనేది.

జీవితమంతా చూసేసింది. కచ్చేరీలు చేసి, చేసి, మానేసింది. చివరకు ఆధ్యాత్మిక చింతనలో పడింది. ఈ యిహలోక పైని కాకుండా పరలోకంపైకి ఆమె ధ్యాస మళ్ళింది. విజయనగరంలో ఖాదిర్‌వలీబాబా అనే వారుండేవారు. వారి వద్దకు తరచుగా ఆమె వెళ్ళేది.

నేను నాగపూర్ నుండి వచ్చిన కొన్నేళ్ళ తర్వాత విజయనగరం వెళ్ళాను ఆ బాబావారి దర్శనం చేసికొన్నాను. ఆనాడు అక్కడ భజన ముగిసిన తర్వాత

ఈ లక్ష్మీనరసమ్మ కొన్ని భక్తి గీతాలు పాడింది. హారతి ఇవ్వడం జరిగాక ఆమె వద్దకు వెళ్ళి "మామ్మాగారు! బాగున్నారా?" అని కుశల ప్రశ్న వేశాను.

"ఎవరు నాయనా నీవు?" అని ఆమె అడిగింది.

"నన్ను గుర్తించలేదా?" అన్నాను.

ఆమె ఒక్క నిమిషం ఆలోచించి, "నాగపూర్‌లో నన్ను వర్ణం పాడమని అడిగిన అబ్బాయివి కదూ? ఎంత పెద్దవాడి వయ్యావు! నూనూగు మీసాలు వచ్చాయి. బాగా మారిపోయావు! అందువల్ల వెంటనే గుర్తించలేకపోయాను;" అంటూ "నీవు కళాకారుడ వయ్యావని విన్నాను. అదృష్టవంతుడివి, నాట్యకళా సరస్వతిని ఆరాధిస్తున్నావు. నిన్ను ఆ తల్లి చల్లగా చూస్తుంది" అని నన్ను ఆమె ఆశీర్వదించింది.

ఆమె కాంటిలో కనిపించిన కళావర్‌రింగ్ కాదు, ఏదో అందని ఆధ్యాత్మికానుభూతిని ఆశిస్తున్న భక్తురాలు.

ఆ తర్వాత చాలాకాలానికి హైదరాబాదులో సంగీత నాటక అకాడమీ ఆధ్వర్యంలో అఖిల భారత నృత్యోత్సవాలు జరిగాయి. వాటికి వ్యవహర్తగా ఉన్నాను.

ఆ యుత్సవాలకు బొంతలకోటి జగన్నాథం, అన్నాబత్తుల బులివేంకటరత్నం, పందిరి వెంకటరత్నం, బొబ్బిలి జీవరత్నం, కళావరురింగ్ మొదలైన పెద్ద పెద్ద తెలుగు నాట్య కళాకారుల్ని ఆహ్వానించాం. ఆ సభలకు వేదాంతం రాఘవయ్యగారు అధ్యక్షత వహించారు.

ఆ యుత్సవాలలో బొంతలకోటి జగన్నాథంగారు తూర్పు భాగవతాన్ని, అన్నాబత్తుల బులివేంకటరత్నంగారు పుష్పబాణ విలాసాన్ని, పందిరి వెంకటరత్నంగారు నవజనార్దనాన్ని, బొబ్బిలి జీవరత్నంగారు పదవర్ణాన్ని వారి వారి సంప్రదాయాల్లో ప్రదర్శించడానికి ఆహ్వానించాం.

ఆ యుత్సవాల్లో ఒకనాడు (కళావర్ రింగ్) లక్ష్మీనరసమ్మగారు తెల్లని చీర కట్టుకొని, మేలిముసుగు వేసుకొని, చేత చిరతలు ధరించి, కాళ్ళకు గజ్జెలు కట్టుకొని "బ్రూహి ముకుందేతి: హేరసనే పాహిముకుందేతి! కేశవ మాధవ గోవిందేతి, కృష్ణానంద సదానందేతి" అంటూ చిరుతలు వేస్తు నాట్యం మొదలు పెట్టింది. ఆ సమయంలో నేను ప్రక్కనే వారగా నిలబడి ఉన్నాను. "అలా చూస్తూ నిలబడ్డావేం? నాతో గొంతును కలిపిపాడు బాబూ! భగవన్నామ స్మరణ చేయి," అని అంది. నేనూ ఆమెతో కలిసి పాడాను.

ఆనాడు నేను కాంటీలో చూసిన ఆమె వేరు, ఈమె వేరు. ఆమె నర్తకురాలు. ఈమె అపర భక్త మీరాబాయి. ఇదే ఆమె వాంఛించిన చివరిదశ. ఆమెలో వేయిమంది మీరాబాయులను ప్రేక్షకులు దర్శించారు.

నేను చివరిసారిగా ఆమెను చూడ్డం అదే! మరి కొంత కాలానికి కృష్ణ సాన్నిధ్యాన్ని చేరుకొంది. ఆమెను నేను మూడు దశల్లో చూశాను. ధన్యుణ్ణయ్యాను.

ఆమె స్మృతి చిహ్నంగా విజయనగరంలోని కోనేటి గట్టుపైని ఆమె తవ్వించిన బావి ఉంది.

ఈ సందర్భంలో ఆ యుత్సవాల్లో జరిగిన అసంతోషకరమైన ముచ్చట నాజ్ఞప్తికి వస్తూంది. దానిని మీకు తెలియజేయాలి.

తూర్పు ప్రాంతంలో ప్రసిద్ధిగాంచిన భామాకలాప కళాకారుడు శ్రీ బొంతల కోటి జగన్నాధం. తూర్పు భాగవత బాణీలో పాటకు ప్రాముఖ్యం ఎక్కువ. దీనిని ద్రుపద బాణీ అంటారు. ఇతర బాణీలవారు ఆడి రక్తి కట్టిస్తే, తూర్పు బాణీవారు పాడి రక్తి కట్టిస్తారు. ఏ దరువునైనా ఒక గంట సేపు పాడి వీరు రక్తి కట్టించగిలరు. ఈ జగన్నాధంగారి కంఠం విమాన వేగంతో గిరికీలు తిరిగేది. ఆ పాటను వినవలసిందే గాని వివరించడానికి వీలు లేదు. ఆ బాణీ వారికే చెల్లింది. ఉత్తర హిందూస్థాన గాయని శ్రీమతి రోషనార బేగమ్ పాడగా ఈ బాణీని ఒకసారి విన్నాను. మళ్ళా ఈ తూర్పు భాగవతుల పాటలోనే విన్నాను. అయితే వీరంతా పల్లె ప్రాంతాలకు పరిమితమయినవారు.

శ్రీ జగన్నాథంగారికి ప్రక్క వాయిద్యంగా మృదంగం వాయించడానికి శ్రీ ధూపం సూర్యలింగంగారు వచ్చారు. అంత మార్దవంగా, మాధుర్యంగా మృదంగాన్ని వాయించడంలో వారికి వారే సాటి.

ఆ నాడు అధ్యక్షుల వారు శ్రీ జగన్నాథంగారి పేరును ప్రకటించారు. శ్రీ జగన్నాథంగారు వేదిక పైకి వచ్చి శంకరాభరణ రాగాన్ని ఆలపించారు, శ్రీ సూర్యలింగం మృదంగాన్ని శ్రుతి చేసుకొన్నారు, ఒక తీరిక నిచ్చారు. ప్రేక్షకులందరూ ఆ గాన మాధుర్యానికి తన్మయు లయ్యారు.

"చెలి రమ్మనవే ఇందు నా స్వామినీ" అని జగన్నాథంగారు ఒక ఆ వృత్తం పూర్తి చేశారో లేదో అధ్యక్షులవారు తేనెలొలుకుతున్న ఆ పాటను విని, మెప్పుకోలుగా తలపంకించి, నన్ను చూసి, "ఏరెవరు?" అని అడిగారు. ఆయన గురించి వివరించాను. ఇంతలో జగన్నాథంగారు రెండో ఆ వృత్తం పాడి, నెరవుచేసి సంగతి ప్రారంభించారు.

"ఇంక ఈ భాగవతాన్ని ఆపుదాం. కాలాతీతమయింది ఇంకా సభా కార్యక్రమాలు ఉపన్యాసాలు ఉన్నాయి" అంటూ అధ్యక్షులవారు ఆజ్ఞాపించారు. ఆటా, పాటా ఆగిపోయాయి. సభ చిన్నపోయింది. ఉత్కంఠంతో వింటూ, చూస్తున్న ప్రేక్షకులు, అఖిల భారత నృత్యకళాకారులు విస్మయులైనారు. జగన్నాథంగారు, సూర్యలింగంగారు చిన్నబుచ్చుకొన్నారు.

తర్వాత పెద్దల ఉపన్యాసాలు గంటలకొద్దీ కొనసాగాయి. ఆ భాగవతులు అయిదు నిమిషాలకు నోచుకోలేదు.

ఆలా ఆనాడు ఎందుకు జరిగిందో ఈనాటి వరకు ఒక దశాబ్ది గడిచినా ఆ రహస్యం నాకు అంతుబట్టలేదు.

# రామలక్ష్మి

పూర్వం భారతదేశమంతటా దేవీనవరాత్రులు, వసంతోత్సవాలు ఘనంగా జరుగుతూ ఉండేవి. నాలుగు శతాబ్దుల క్రితం వరకు స్వతంత్ర సంస్థానాలలో ఈ యుత్సవాలు గొప్పగానే జరిగేవి. మైసూరులో ఈనాటికీ బాగానే దేవీ నవరాత్రులు జరుగుతూ ఉంటాయి. గద్వాలు సంస్థానంలో బాగా జరిగేవి.

గద్వాలు సంస్థాధీశుల జెండా పైని గద, వాలు రాజ చిహ్నాలు అలంకరణగా ఉండేవి. రామభూపాలు దేవవారు ఈ సంస్థానానికి చివరి స్వతంత్ర సంస్థానాధీశుడు. ఈయన కాలంలో ఈ వేడుకలు అక్కడ ఘనంగా జరిగేవి. వీరి తర్వాత మహారాణి రాజ్యమేలింది. ఆమె తదనంతరం ఆమె దత్త కుమారుడు డోమకొండ కృష్ణభూపాలుడు రాజ్యమేలాడు. అయనతో ఈ సాంస్కృతిక కార్యక్రమాలు అంతరించాయి.

ఒకసారి ఈ యుత్సవాలలోని రెండవరోజు కార్యక్రమంలో పాల్గొనడానికి గోహర్‌జాన్ అనే అమరగాయని కలకత్తానుండి ప్రత్యేకంగా ఆహ్వానింపబడింది. ఆమె సంగీత కచ్చేరీ ముగిసినంతనే ఆ యాస్థాన నర్తకి రామలక్ష్మి నాట్యకచ్చేరి. వాద్యమేళాలవారు కుతుపం చేశారు. రామలక్ష్మి పుష్పాంజలి సమర్పించింది, సభావందనం చేసింది.

తర్వాత ఆనందభైరవి రాగంలో, త్రిపుట తాళంలో "ప్రొద్దు పోయెను చాలా, పోయివత్తుర ప్రీతి ! ముద్దాడి పోనీయర ! రాజశ్రీ రామభూపాల దేవా!" అన్న పదాన్ని పాడి అభినయించడం మొదలు పెట్టింది. కొంతసేపయిన తర్వాత ఆమె సేవించిన తమలపాకుల ఉమ్మి నోటినిండా చేరింది. ఆమె ఒక్క క్షణం నిలబడి నట్టురాలివైపు చూసింది. ఆ చూపులోని భావాన్ని గ్రహించి ఆ నట్టువరాలు, బంగారు రంగుగల ఇసుక పిడతను ఆమెకు అందించింది. రామలక్ష్మి

అందులో ఉమ్మి వేసి తర్వాత కేళికకు ఉపక్రమించింది. ఎన్నడూ లేని ఈ యనుచిత ప్రవర్తనను చూచి రాజావారు విస్తుపోయారు. ఆమె పల్లవి, అను పల్లవి అభినయించింది. అప్పటికే కాలం చాలా గడిచిపోయినందున ఆనాటికి సభ ముగిసింది.

ఆ మర్నాటి సాయింత్రానికి గోహర్‌జాన్ పాట గురించి గద్వాల పురవాసు లందరికీ తెలిసింది. మూడవరోజు సభకు ఆ పట్నంలోని కవి, పండిత, గాయ కులు, అనేకమంది పురజనులూ వచ్చారు. ఆస్థాన విద్వాంసు లందరూ వచ్చారు. ఆ యాస్థాన సంగీత విద్వాంసుడు పురాణం కనకయ్య శాస్త్రిగారు మహారాజావారి ప్రక్కనే ఆశీనులైనారు.

తెల్లని పట్టువస్త్రాలు ధరించి గోహర్‌జాన్ సభలోకి ప్రవేశించింది. ఆమె మెడలో ఒక ముత్యాల పేరు, ముక్కుకి జంట రవ్వల ముక్కుపుడక అలంక రించుకొంది. చేతులకు రవ్వల గాజులున్నాయి. ఇరుప్రక్కల ఆమె దాసీజనం ఉన్నారు. అందులో ఇద్దరు నెమలి కనుల వింజామరాలు పట్టుకొని ఉన్నారు. నవరత్నాలు పొదిగిన పాందాన్ మరొకరి చేతిలో ఉంది. ఇంకొకరు ఉమ్మి వేసే పీకుల్‌దాన్ పట్టుకొని వచ్చారు. వేరొకరి చేతిలో మెత్తని తువ్వాళ్ళున్నాయి. "పాందాన్ చూస్తే ఖాందాన్ తెలిసిపోతుం"దన్న సామెతలా ఉంది ఆమె సభా ప్రవేశం.

ఆమె రాజావారికి, సభికులకు సలామ్ చేసి సభలో కచ్చేరి చేయడానికి కూర్చుంది. "శ్యామసుందర వనమాలి, దరసబినాజియా గబరాయీ" అంటూ ఒక గంటసేపు పాడింది. ఆ శ్యామసుందరుడు దర్శనమిచ్చినట్టుగానే సభలోని వారందరూ అనుభూతి పొందారు. ఆమె ప్రక్కకు జరిగి దాసీజనం చుట్టి యిచ్చిన రాయ్‌టేక్ కపూరీపాన్ సేవిస్తూ కూర్చుంది.

నాట్య కచ్చేరీ ప్రారంభమయింది. గతరాత్రి వదిలిపెట్టిన చరణాల అభినయంతో రామలక్ష్మి తన కచ్చేరీ ప్రారంభించింది. "పొద్దు పోయెను చాల పోయువత్తుర ప్రీతి, ముద్దాడి పోనీయర!" అని మళ్ళా పల్లవి పాడుతున్నప్పుడు తాంబూలం నోటికి అడ్డు వచ్చింది. ఆమె నట్టువరాలివైపు చూసింది. వెంటనే

ఆమె పిడత నందించింది. కిచ్చుక్కున్న శబ్దంచేస్తూ రామలక్ష్మి అందులో ఉమ్మి, మళ్ళా కచ్చేరీ ప్రారంభించింది.

కేళికను ఆపమంటూ రాజావారు సైగ చేశారు. "రామలక్ష్మీ! ఎన్నడూ లేని ఈ కొత్త వింత ప్రవర్తన ఏమిటి? మన ఆస్థాన మర్యాదలు నీకు తెలియవా?" అని మెత్తగా మందలించారు రాజావారు.

"మహారాజా! మన ఆస్థాన మర్యాదలన్నీ నాకు పూర్తిగా తెలుసుగాని, ఈ సంవత్సరంనుండి మారే యేమో ననుకొన్నాను. తాంబూలాన్ని సేవిస్తూ ఏ కళాకారిణి ఈ సభలోకి ప్రవేశించకూడదు, సభలో ఉమ్మడం అమర్యాద. వెండి పాన్‌దాన్లోని తమల పాకులను సేవించడం ఇక్కడ నిషిద్ధం. వెండి పీవుల్‌దాన్‌లో ఉమ్మి వేయడం అనాచారం. కాని ఇవన్నీ సోదరి గోహార్‌బాయి రాకతో మారిపోయాయేమో ననుకొన్నాను మహారాజా! ఈ సోదరిని చూసి నేను తాంబూలం వేసుకొన్నాను. ఉమ్మడానికి వెండి పీవుల్‌దాన్ మన పట్నంలో వెంటనే దొరక్కపోవడంవల్ల మట్టి పిడతకు రంగువేసి తెచ్చుకొన్నాను! తప్పయితే క్షమించండి" అని రామలక్ష్మి అంది.

మహారాజావారు ఆశ్చర్యంగా ఆమె వైపు చూసి, గోహార్‌జాన్ వైపు తిరిగి చూశారు. ఆమె ఆ సమయంలోనే వెండి పీవుల్‌దాన్‌లో ఉమ్ముతున్నది. మహారాజావారు పేష్కర్ వైపు చూశారు. పేష్కర్ లేచి వెళ్ళి గోహార్‌జాన్ చెవిలో ఏదో చెప్పాడు. "క్షమించాలి మహారాజా! ఈ దేశ ఆచారాలు నాకు తెలియవు" అంది గోహార్‌జాన్.

తర్వాత రామలక్ష్మి కచ్చేరీ మామూలు పద్ధతిలో కొనసాగింది.

సుమారు ముప్పై సంవత్సరాల క్రితం నేను నృత్య చరిత్ర పరిశోధన కోసం గద్వాల వెళ్ళినప్పుడు వృద్ధురాలైన రామలక్ష్మి చెప్పిన ముచ్చట ఇది.

పూర్వం ప్రతి సంవత్సరం కలకత్తాలో నెలరోజులపాటు నిమాయిష్ జరిగేది. ఒకసారి ఆ నిమాయిష్ వేడుకలకు వైస్రాయిని ఆహ్వానించారు. ఆయన గౌరవార్థం ఈ గోహార్‌జాన్ సంగీత కచ్చేరిని ఏర్పాటు చేశారు. ఆనాటి బందో

బస్సు చాలా కట్టుదిట్టంగా జరిగింది. ఆయన నిర్ణీత సమయానికి విక్టోరియా గుర్రాల బగ్గీలో బయలుదేరారు. ఆయన్ను చూడ్డానికి బారులు తీరి జనం నిలబడ్డారు. ఆయన ఆ ప్రాంగణంలోనికి ప్రవేశిస్తున్న సమయంలోనే గోహార్ జాన్ గూడా ప్రాంగణంలోనికి వస్తూంది. జనం వెంటనే ఆమె వస్తున్న వైపుకు తొక్కిసలాడుకొంటూ వెళ్ళారు. వైస్రాయిగారు కారణం తెలియక అటు వైపు చూశారు. గోహార్ బాయి వచ్చినట్టు ఒక అంగరక్షకుడు ఆయనకు తెలియజేశాడు. ఆమెను కాస్సేపు అక్కడే నిలబెట్టమని వేరొక అంగరక్షకుడు ఆజ్ఞాపించాడు. గోహార్ బాయిని కదలకుండా నిలబెట్టేశారు. ఆమెకు కారణం తెలిసింది. ఆమె మారు మాట్లాడకుండా వెంటనే తిరిగి వెళ్ళిపోయింది. వచ్చిన జనమంతా ఆమె వెనుక వెళ్ళారు. సభ ప్రారంభమయింది. ఆ సభలో గోహార్ బాయి లేదు ఆమె కచ్చేరీ లేదు. అక్కడ జనం లేరు. సభ నిర్వాహకులు, అధికారులు మాత్రమే వైస్రాయి ప్రసంగం వినడానికి మిగిలారు.

ఆమె నిమాయిష్ ద్వారం దాటి బైటకు వచ్చి "నాకు అవమానం జరగలేదు. గానసరస్వతికి అవమానం జరిగింది. గోహార్‌బాయి పేర రేపు ఈపాటికి మరొక నిమాయిష్ జరుగుతుంది నెల రోజులపాటు ఉంటుంది. ఈ నెలరోజులు గోహార్‌బాయి గాన కచ్చేరీలు జరుగుతాయి. ప్రజలందరూ వచ్చి, ఉచితంగా వినవచ్చును" అని ప్రకటించి తన బగ్గీ ఎక్కి వెళ్ళిపోయింది.

జరిగిన సంగతంతా వైస్రాయిగారికి తెలిసింది. ఒక కళాకారిణికి జరిగిన అవమానానికి ఆయన నొచ్చుకొన్నారు. ఈ సంఘటనను గురించి నేను కలకత్తాలో విన్నాను.

మరొకసారి దసరా వేడుకలకు ఒక కర్నాటక నర్తకి గద్వాల వచ్చింది. ఆ నర్తకి వెండి గజ్జెలు కట్టుకొని సభలోకి ప్రవేశించింది. ఆమె నాట్యాన్ని మెచ్చుకొని ఆమె కెవరో ఆ గజ్జెలను బహూకరించారు. ఆమె ముచ్చటపడి, గొప్ప కోసం వాటిని కట్టుకొని ఆనాడు కచ్చేరీ చేయాలనుకొంది.

"పసుపుపచ్చగా మెరిసిపోతూ ఉండవలసిన గజ్జెలు తెల్లగా ఉన్నాయేమిటి?" అన్నట్టు సందేహంగా సభలో నున్న రామలక్ష్మి తన తల్లి వైపు చూసింది. "అవి వెండి గజ్జెలు" అని తల్లి చెప్పింది.

వెంటనే రామలక్ష్మి నిలబడి "మా మహారాజువారి కొలువులో, మా అందరి ముందూ వెండి గజ్జెలు కట్టుకొని ఆడే అర్హతను మీకు ఎవరిచ్చారు? వాటిని విప్పి కంచుగజ్జెలు కట్టుకొంటారా లేక నాతో పోటీకి వస్తారా?" అంటూ ఆమెను రామ లక్ష్మి సవాలు చేసింది. వెంటనే ఆ కర్నాటక నర్తకి సభకు క్షమాపణ చెప్పుకొని కంచు గజ్జెలు ధరించి కేళిక చేసింది. ఈ విధంగా శ్రీమతి రామలక్ష్మి తన జీవితంలోని ఎన్నో ముచ్చట్లు నాకు చెప్పింది.

"పొద్దు పోయెను చాల పోయివత్తుర !" అన్న పదాన్ని అభినయించమని ఆమెను చివరకు కోరాను.

"నా బోసి నోటితో పాడుతూ, ముడతలు పడిన ముఖంతో అభినయిస్తే నీ వేమి ఆనందించగలవు బాబూ! నా ఆటా పాటా ఇప్పుడేం ఉన్నాయి? కోటలో పొద్దుపోయినా నా జీవితం ఇంకా పొద్దుగుంకలేదు" అంటూ ఆమె కళ్లు తుడుచు కొంది. చివరకు నా కోర్కెను కాదనలేక పల్లవిని పది నిమిషాలు అభినయించింది. గోడ నున్న ఆమె చిన్ననాటి ఛాయా చిత్రాన్ని చూసి, ఆమె అందచందాలు ఎలా ఉండేవో గ్రహించి వచ్చాను.

మరి కొన్నాళ్ళకు మళ్ళా నేను గద్వాల వెళ్ళాను. ఆ కళాజ్యోతి ఆరిపోయిందని విని విచారించాను.

ఆనాడు సంధ్యవేళ కోటలోనికి వెళ్లాను. అంతా నిశ్శబ్దంగా ఉంది. నిర్మానుష్యంగా ఉంది. కోటలోని సరస్వతీ పుస్తక భాండాగారం ఖాళీగా ఉంది. మచ్చుకి ఒక్క గ్రంథంకూడా అందులో లేదు. కోటంతా కళావిహీనంగా ఉంది.

ఒకసారి కర్నూలు నవాబులను ఈ గద్వాల రాజులు యుద్ధంలో ఓడించి, వారి యుద్ధభేరీని, జెండా కర్రను విజయ చిహ్నాలుగా తీసికొని వచ్చారు. ఆ ఇనుప ఢంకాలో సున్నం వేసి ఆ జెండా కర్రతో ఆ సున్నాన్ని కూలి వారు కలుపుతూ ఉండడం ఆ మర్నాడు నా కళ్ళ పడింది.

ఆ విజయ చిహ్నాల విలువ ఆ కూలి వారికి తెలియదు తెలిసిన వారు వారిని వారించనందుకు నా హృదయం ద్రవించింది. తెలిసిన వారందరూ వెళిపోయారు.

# జోగు ముత్తి

"ముత్తీ ఏమిటి? 'ముత్తవ్వా' అని పిలవలేవా?" అని ఈ కాలంలో ముత్తవ్వ కళ్ళెర్రజేసి యుండేది. ఆ కాలంలో ఆమెను 'ముత్తవ్వ' అనడమే! ఆలా ఎవరైనా ఆమెను పిల్చియుంటే అనాటి పెద్దలు ఆ పిల్చినవారి నెత్తు రాలగొట్టేవారు.

ముత్తిది పెద్ద కులం. అంటే కులం కాని కులం. అంటే పంచమ కులం. అంటే నేటి హరిజన కులం. ఆమె అజ్ఞాని. ఆమెను జోగినిగా చేశారు. అంటే ఆమెకు ఒక యువకునితో పెండ్లి చేయకుండా, ఎల్లమ్మ దేవతకు ఆమెను అప్పజెప్పారు. ఆమె మెడలో తాళి వేశారు.

డప్పులు కొట్టే మాదిగదండువారు "దద్ధడిక-దద్ధడిక-ఢికాఢీకా-దండడిక" అని డప్పులు మోగిస్తూంటే ఈమె కాళ్ళకు గజ్జెలు కట్టుకొని పెండ్లి-డ్లలో ఆడాలి. గర్భాదాన ముహూర్త సమయంలో ఆడాలి. బాలసారె పండుగనాడు ఆడాలి. ఉయ్యాలలో వేసిననాడు ఆడాలి, పిల్ల పెళ్ళి చూపులు జరుగుతే ఆడాలి, విందులు జరిగినప్పుడు, ఊరి పెద్దలు సరదా పడినప్పుడు ఆడాలి, చివరకు శవాన్ని మోసుకు వెళ్తున్నప్పుడు గూడా ఆడాలి.

ఈనాడు కొందరు సంగీత, నృత్య, నాటక కార్యక్రమాలను పెట్టించి, అంతా అయిపోయిన తర్వాత "వసూళ్ళు సరిగ్గా జరగలేదు, తర్వాత మిగతా డబ్బు పంపుతాం" అని ఏదో కొంత మొత్తం చేతిలో పెట్టి పంపుతూ ఉంటారు. వారి కర్మకు వారిని వదిలి పెట్టేస్తారు. కాని ఈ జోగి ముత్తవ్వను అలా వదిలి పెట్టేవారు కారు. ఆమె ఆట ముగిసిన తర్వాత ఆమెకు సకల మర్యాదలు చేసేవారు.

పల్లెల్లో నివసించే బీద కుటుంబాలవారికి, హరిజనులకు వినోదం చేకూర్చడానికి వీరు అవసరం. అందుకే వీరిని జోగినులుగా చేసేవారు. వీరిలోని ఎల్లమ్మలు, దేవమ్మలు అమ్మవారి పూజలతోనే కాలం వెళ్ళబుచ్చేవారు. వీరిలో

కొందరు సివమూగి, ఎరుక చెప్పేవా రున్నారు. పర్వదినాల్లో అమ్మవారి గుడివద్ద 'రంగమెక్కే' ఆచారం వీరిలో ఉంది. ఈ యాచారం తెలంగాణా ప్రాంతంలో ఎక్కువగా కనబడేది. నేటికీ ఈ యాచారం కొన్నిచోట్ల ఉంది.

ప్రతి సంవత్సరం మహంకాళి గుడివద్ద గణాచారి దేవమ్మలు పచ్చి కుండపై రంగమెక్కి భూత, వర్తమాన, భవిష్యత్తులు చెప్తూ ఉంటారు. వీరికి ఆటపాటల వినోద కార్యక్రమాలతో సంబంధం ఉండదు. అమ్మవారి ఆరాధనే వీరి ముఖ్య విధి.

నా చిన్నతనంలో నాకు గజ్జెల చప్పుడు వినబడితే చాలు నాకొక విధమైన మైకం వచ్చేడి. ఎవరో నన్ను పిలుస్తున్నట్టు అనిపించేది. ఆ నాదం వినబడు తున్నంతసేపు నేను వంటరిగానైనా కూర్చునేవాణ్ణి, లేదా ఎవరూ చూడకుండా మెల్లగా ఇంటినుండి జారుకొని ఆ యాటని చూడ్డానికి వెళ్ళేవాణ్ణి. చిన్నప్పుడు నా పోషణ బాధ్యత మా దాయిది. ఆమె గొప్ప వైష్ణవి. అందువల్ల ఆమె నా కెప్పుడూ పురాణ గాధలు చెప్తూండేది. అందువల్ల నాకు రామాయణ, భారత, భాగవతాది కథలు ఎన్నో వచ్చు. వీటికి సంబంధించిన తెలుగు, సంస్కృతం, హిందీ, మరాఠీ పాటలు నేను ఎన్నో నేర్చుకొన్నాను. అప్పుడు నాకు తమిళ, కన్నడ భాషలతో పరిచయంలేదు.

మా దాయి గీతగోవిందంలోని అష్టపదులు పాడుతూంటే నాకెంతో ఇష్టంగా ఉండేది. నాకు అప్పుడు సంస్కృతం అర్థం కాకపోయినా ఆ యష్ట పదులు నాకెంతో హాయిగా ఉండేవి. ఆనాడు వాటి అర్థం నాకు తెలిసియుంటే వాటిని నేర్చుకొనేవాణ్ని కానేమో!

మా దాయి ప్రతిరోజూ వేకువజామునే లేచేది. స్నానంచేసి, తెల్లని వస్త్రాలు ధరించేది. కృష్ణకర్ణామృత శ్లోకాలను చదివేది. నాకు ఆ శ్లోకాల అర్థం వివరించి చెప్పేది. అవి నాకెంతో ఇష్టంగా ఉండేవి. నేను ఆ చిన్ని కృష్ణుణ్ని చూస్తు న్నట్టు, అతనితో ఆడుకొంటున్నట్టు అనిపించేది.

ఆమె అధ్యాత్మ రామాయణ కీర్తనలు, నారాయణ తీర్థుల వారి తరంగాలు గూడా పాడేది. నాకు ఈ తరంగాలు సులువుగా వచ్చేవి. కాని అధ్యాత్మరామా

యణ కీర్తనలు నా నోటికి వచ్చేవి కావు. నా బాల్యమంతా మా దాయితోనే గడిచి పోయింది. ఆ తర్వాత మా అన్న శ్యాంసుందర్‌కి నేను చేరువయ్యాను. మా దాయి నన్ను ప్రేమతో పెంచుతూ క్రమశిక్షణకు లోనుచేసింది. మా అన్నది మాత్రం కఠిన క్రమశిక్షణ. కాని ఆయన అనతికాలంలోనే చనిపోయాడు.

నన్ను తీర్చి దిద్ది, నన్నొక విశిష్ట వ్యక్తిగా తయారుచేయాలనుకొన్నాడు నా అన్న శ్యాంసుందర్. కాని నాలో ఆ రామకృష్ణను చూడకుండానే అకాల మృత్యువుకు లోనయ్యాడు. అతనికోసం నే నెంతో ఏడ్చాను. ఆ దేవుడు అతన్ని నాకు దూరం చేశాడు. అందువల్లనే నేను రామకృష్ణమఠంలో చేరవలసివచ్చింది. అప్పటికి నేను చిన్నవాణ్ణి. ఒకరోజు నేను స్వామీజీ వద్దకు వెళ్ళి "నా అన్న చాలా మంచివాడు. మరి అతన్ని దేవుడు ఎందుకు తీసుకొనిపోయాడు" అని అడిగాను. ఆయన నాకు వెంటనే సమాధానం చెప్పకుండా గులాబీ తోటకు తీసి కొని వెళ్ళారు. "నీకు నచ్చిన పువ్వును కోసుకో" అన్నారు. నాకు నచ్చిన ఒక పెద్ద గులాబీని కోసుకొన్నాను. స్వామీజీ నన్నూ, నా చేతిలోని గులాబీపూవును మార్చి మార్చి చూసి "ఈ పువ్వు మంచిది గనుక నీవు తీసికొన్నావు, అలాగే మీ అన్న మంచివాడు గనుక దేవుడు అతన్ని తీసికొన్నాడు" అన్నారు. ఆయన చెప్పింది నాకు నచ్చింది. "మా అన్నయ్య మంచివాడు" అని నాలో నేను అను కొని, ఆ నాటి నుండి అన్నయ్య కోసం మరి ఏడవలేదు.

అది మంచి ఎండాకాలం ఎండ నిప్పులు చెరుగుతోంది. నేను ఒంటరిగా నా గదిలో కూర్చున్నాను. గజ్జెలనాదం, డప్పుల చప్పుడు దూరంగా వినబడ్డాయి. నా గదిలోనుండి మెల్లగా బయటకు వచ్చి చూశా, ఎవరి గదిలో వారు పడుకొని నిద్రపోతున్నారు. నా గది తలుపులు దగ్గరగా వేసి, ఎవరూ చూడకుండా గేటు తీసి రోడ్డు మీదకు వచ్చాను. నన్ను ఎవరూ గమనించలేదని నిర్ధారణ చేసికొన్న తర్వాత చిన్న పరుగులాంటి నడకతో నడిరోడ్డు మీద నాట్యం జరుగుతున్న చోటుకి చేరుకొన్నాను. అక్కడ చాలా మంది జనం గుంపు, గుంపులుగా ఉన్నారు ఒక శవాన్ని వారు మోసుకు వెళ్తున్నారు. పాడి ముందు నృత్యం జరుగుతూంది చుట్టూ జనం, మధ్య ఇద్దరు స్త్రీలు. ఒకామె యువతి. చామన చాయలో ఉంది. ఇంకొక ఆమె ఎర్రగా ఉంది. నడివయస్కురాలు. డప్పులు పై కాలంలో హుషా రుగా మోగుతున్నాయి. వారిద్దరూ జోరుగా ఆడుతున్నారు. చుట్టూ ఉన్నవారిలో

కొందరు ఉషారుగా ఈలు వేస్తున్నారు. ఆ వాతావరణమంతా కల్లు కంపుతో గుప్పు మంటూంది.

వారిద్దరూ అలా కొంత సేపు ఆడిన తర్వాత ఆ యెర్రని నడివయస్కురాలు చేతినిండా గవ్వలు పట్టుకొని వచ్చి ఆ జనం చుట్టూ తిరిగింది తాగిన మైకంలో అమె కళ్ళు ఎర్రగా ఉన్నాయి. తమలపాకులు వేసికొన్న అమె నోరు గూడా ఎర్రగా ఉంది

ఆ జనం ఆమె చేతిలో అయిదు రూపాయల నోట్లు, రూపాలు నాణేలు, పావలాలు, అర్ధలు, అణాలు ఎవరికితోచినవి వారు వేశారు. అమె చేతిలోని గవ్వల్నీ డబ్బుల్నీ రోడ్డుమీద జల్లింది వెంటనే డప్పులు పైకాలంలో మోగాయి. ఆ స్త్రీలిద్దరూ ఆ డబ్బుల్నీ, గవ్వల్నీ ఏరుకొన్నారు. ఆ తర్వాత వారిద్దరూ సృష్టి నృత్యం చేశారు. డప్పులు తారస్థాయిలో మోగాయి. జనం ఈలలు వేశారు. వారు ఆడి, యాడి, నృత్యం ముగించారు ఈ నృత్యం గురించి వివరంగా నా నృత్యాంజలి గ్రంథంలో వ్రాశాను.

ఆ తెల్లని యువతి నన్ను చూసింది. ఉరిమురిమి నన్ను చూసింది. ఆమె ఎర్రని కళ్లు ఇంకా, ఇంకా పెద్దవి అయ్యాయి. నాకు భయం వేసింది.

"అప్పటి సంది చూస్తున్నా, ఎవరో పెద్దింటి పిల్లగాడివి, మండుటెండలో ఎందు కొచ్చినా వీడికి. పుట్నాలు పంచుతున్నామా! మాలో కల్సిపోతానా! పో యీడికెళ్ళి" అంటూ నన్ను బెదరకొట్టింది అమె. "ఊరుకుండరాదే! చూస్తేనేమాయె!" అని ఆ చామనచాయ అమె అంది. కాని నేను బెదిరిపోయి అక్కడి నుండి పరుగు లంకించుకొన్నాను.

నేను నా చిన్నప్పుడు ముత్తవ్వను అలా చూశాను జోగి సందర్శనం నా కలా మొదటిసారి జరిగింది.

ఆ రోజుల్లో తెలంగాణాలో రెండు తరగతుల ప్రజలే ఉండేవారు. అమీరులు గరీబులు. ఈ రెండే ఆ తరగతులు. మధ్యతరగతి వారు చాలా తక్కువ ఉండేవారు అందువల్ల అంధ్రప్రాంతం నుండి కొంతమంది మధ్యతరగతివారు బ్రతుకు

తెరువు కోసం తెలంగాణా వచ్చేవారు. వీరి ఇండ్లలో మున్నూరుకాపులు, ముదరాసి వారు పని చేసేవారు.

ఆంధ్రప్రాంతంనుండి ఇలా వచ్చిన ఒక కమ్మ కాపు కుటుంబంలో ఒక యువకుడు ఉండేవాడు. అతడు మాకు తెలుసు. అతడు చాలా అందగాడు, కండలు తేరిన శరీరంతో బలంగా ఉండేవాడు. శరీరం బలంగా ఉన్నా మనస్సే బలహీనంగా ఉండడంవల్ల అతడు ముత్తవ్వను చూసి ప్రేమించాడు. అతనికి పంచబాణుడు తోడైనాడు.

"వినుమొక బ్రాహ్మణుండు కుల వృత్తము లెల్ల వీడి, బోయత నొకతె న్గొని" అన్న భారతంలోని నాడీ జంఘుని కథలా తనవారినందర్నీ వదిలి ఆ జోగితతో కాపురం పెట్టాడు.

వారు కాపురం పెట్టిన ఇల్లు సికింద్రాబాద్‌లోని చిలకలగూడా రైలు లైనుకు అటు ప్రక్కన మైలారుగడ్డకు, మెట్టుగడ్డకు ఆనుకొనియున్న బొందల గడ్డలో ఉండేది. అక్కడ మరికొన్ని గుడిసెలు ఉండేవి ఆ గుడిసెల మధ్యను ఒక భవనంలా కనబడే పెంకుటిల్లు ఆమెది. అతన్ని అందరూ వెలివేశారు. వీరి కథముందు లైలా మజ్నూ, షిరీద్ ఫరాద్, సింపన్ ఎడ్వర్డు కథలు ఎందుకూ పనికిరావు. నాలుగు దశాబ్దులు గడిచిపోయినా వారి కథ నా కళ్ళముందు కదలాడుతూనే ఉంది. ఆ ముత్తవ్వ ఏ యెల్లమ్మ దేవతలోనో కలిసిపోయి ఉంటుంది.

ఆ బొందలగడ్డను కొందరు పెద్దలు ఇప్పుడు ఆక్రమించుకొన్నారు. ఆ బొందలపైనే వారు ఇల్లు కట్టుకొన్నారు మైలారు దేవుల మైలారుగడ్డ రూపురేఖలే మారిపోయాయి. అక్కడి హరిజనులు ఎక్కడికి పోయారో!

ఆ కమ్మకాపు వారి అబ్బాయితో ఎవరూ ఎక్కువగా మాట్లాడేవారు కారు. ఎవరైనా మాట్లాడినా అతన్ని తాకేవారు కారు అందువల్ల అతనికి నే నొక్కణ్ణె శరణ్యం. అంటరాని వారంటే ఎవరో నాకు అప్పుడూ తెలియదు, ఇప్పుడూ తెలియదు మనిషికీ మనిషికీ మధ్య ఈ యీంక్షలేమిటో! ఈ తేడా లెందుకో! దేవుని బిడ్డలందరూ ఒకటే నని నా తలంపు.

అప్పుడప్పుడు ఆ కమ్మకాపుయువకుడు నన్ను పార్కులో కలుసుకొంటూ ఉండేవాడు. సిగరెట్టు పీల్చి, పొగ వదులూ, ఆకాశం వైపు చూస్తూ, ఏవేవో పాటలు పాడుతూ ఉండేవాడు. ఏదైనా తినడానికి తెచ్చి నాకు పెట్టేవాడు.

నా స్మృతి పథంలో ఆ ముత్తవ్వ నిలిచిపోయింది. ఆమెను చూడాలని, ఆమెతో మాట్లాడాలని నాకో పెద్ద కోరిక ఉండేది. కాని అదెలా వీలవుతుంది? ఆమె ఉన్న చోటుకు వెళ్ళడమే! పెద్ద లెవరైనా చూస్తే ఇంకేమైనా ఉందా? ఆమె ఒక జోగిత. ఆమె ఉండేది బొందల గడ్డ! ప్రత్యేకించి అక్కడకు వెళితే ఈ పెద్దలు నా తోలు వలిచేయరూ? ఇలా భయపడుతూ ఉండిపోయాను. కాని నాలోని ఆ కోర్కె నన్ను పీకిస్తూనే ఉంది. అందువల్ల ఒకనాడు పార్కులో మేము కలుసుకొన్నప్పుడు ఆ కమ్మకాపు యువకునికి నా కోర్కెను తెలియ జేశాను.

"ఎవరైనా చూస్తే మీ వాళ్ళకు చెప్తారు. మీ వాళ్లు నీ తోలు వలిచేస్తారు కనుక ఎవరూ చూడకుండా మధ్యాహ్నం పూట రా. ఆమెచేత ఇంటి దగ్గరే ఆడిస్తాను" అన్నాడు.

ఆ శ్మశానంలోని బొందలను (గోరీలను) దాటి వెళ్ళడమే కష్టం. అక్కడ నాకు తెలిసినవారు ఎవరైనా ఉండవచ్చును. వాటిని దాటిపోతే ఇంక ప్రమాదం లేదు. ఒకనాటి మధ్యాహ్నం జాగ్రత్తగా వెళ్ళాను. వాళ్ళ ఇల్లు చేరాను. ఆ ఇంటి చుట్టూ కర్రల దడి ఉంది. ఆ దడి మీద దట్టంగా గుమ్మడి పాదు అల్లు కొని ఉంది. ఆ యువకుడు నా కోసం ఆ యింటి గుమ్మంలోనే కాచుకొని ఉన్నాడు. అతడు నన్ను ఇంట్లోకి తీసికొని వెళ్ళాడు. ఇల్లు చాలా శుభ్రంగా ఉంది. అతని నోరు మాత్రం సారా కంపు కొడుతూంది.

ఆమె గద్వాలు చిలకాకు పచ్చ చీర కట్టింది. ఎర్రని రవికె తొడుక్కొంది. చెవులకు గంటీలు, గంటీల గొలుసులు, ముక్కుకు ముత్యాల ముక్కు పుడక పెట్టుకొంది. చేతులకు దండ కడియాలు, గాజులు, పూలచెండ్లు తొడుక్కొంది. కాళ్ళకు కడియాలు, నడుముకు వెండిగొలుసుల వడ్డాణం ఉన్నాయి. మెడలో పట్టెడ వుంది.

నన్నొక చాపమీద కూర్చోబెట్టారు. ఆ యిద్దరూ చెరో పిడతా తాగేరు. తర్వాత ఆమె ఆట మొదలు పెట్టింది.

ఆమె ముందుగా పెండ్లి పిలుపు కొంతసేపు ఆడింది. పెండ్లి మరికొంత సేపు ఆడింది విందుల దరువు ఆడింది. బాలసారె దరువు ఆడింది, మరాఠీ బాణీ ఒక దరువు ఆడింది. చివరకు చావు దరువు ఆడి చూపించింది ఒక్కొక్క అంశాన్ని వివరించి వ్యాఖ్యానించింది.

ఆ యువకుడు ఎప్పుడూ మత్తులోకి జారిపోయి నిద్రపోయాడో నేను గమనించనేలేదు. ఆమె అతని వద్దకు వెళ్ళి "ఇదేందయ్యో ఇప్పుడు నిద్రపోతుండావు? లే! ఈ బాబును దింపిరా!" అని అతన్ని హెచ్చరించి లేపింది.

కొంతకాలం గడిచిన తర్వాత ఒకనాటి సాయంత్రం ఎవరో వచ్చి "ఆ కమ్మకాపు వారి అబ్బాయి చనిపోయా"డని చెప్పారు మా దాయి కండ్లలో నుంచి రెండు నీటి బొట్లు రాలాయి దేవుని మందిరంలో అమె దీపం పెట్టింది. "చూసి వద్దాం, వస్తావా? అని నన్నామె అడిగింది. అమెతో వెళ్ళాను.

రైలుపట్టాలు దాటితే శ్మశానం. అందులో ఒక బొంద తవ్వారు అందులో అతని శవాన్ని దింపి అందరూ తలా యింత మట్టి పోశారు. అమె మాత్రం అలా చూస్తూ నిలబడిపోయింది. ఉలుకూ, పలుకూ లేకుండా జుత్తు విరబోసుకొని నిలబడింది. అందరూ ఇండ్లకు తిరిగి వెళ్ళారుగాని ఆమె, అక్కడే అలా నిలబడే ఉండిపోయింది.

ఆ బొందమీద రాయిని పాతలేదు. కనుక ఆ బొందను చూడాలంటే ఇప్పుడు కష్టమే నేను పెద్దవాణ్ణి అయ్యాక ఆ శ్మశానికి వెళ్ళి ఆ గోరీలమధ్య రెండు, మూడుసార్లు తిరిగాను. కాని అతని బొందను కనుక్కోలేకపోయాను. అయినా అతన్ని తలచుకోగానే నా కళ్ళంట నీటి చుక్కలు రాలాయి. ఆమె కూడా నాలాగే అశ్రువులు రాల్చి ఉంటుంది. కాని సమాధి ఏదో తెలియక ఆమె అభిషేకించి ఉండదు ఆమె ఆ తర్వాత ఎక్కడకు వెళ్ళిపోయిందో నాకు తెలియదు. తెలిస్తే వెళ్ళి ఆమెను పలకరించేవాణ్ని.

ఆమెను నేను మళ్ళా కలవకపోయినా నా హృదయంలో ఆమె చెరగని ముద్ర వేసింది. ఆమె కనబడుతుందేమో నని ఒకటి రెండుసార్లు ఆ శ్మశానికి వెళ్ళాను. ఆ బొందను కనుక్కోలేకపోయినా, ఆ విరబోసుకొన్న జుత్తుతో నొసటిని చెరిగిన కుంకుమ బొట్టుతో, చేష్టలుడిగి, మూగగా నిల్చున్న ఆమె రూపం మాత్రం నా కండ్లకు కట్టింది. ఆ మూగ హృదయం ఏమని విలపించిందో!

అమె ముత్తవ్వ, కాదు జోగుముత్తి. ఆమె జోగుముత్తి అవడానికి కారకులు ఎవరు ?

విలపించలేక, మూగవోయిన ఒంటరి జీవిగా మిగిలిపోయింది. తన ఆవేదనను వెలిబుచ్చినా వినేవారు ఎవరు? నిరాశతో ఆమె హృదయం కుంగిపోయి యుంటుంది. ఆమె తపన ఎవరికి కావాలి? అసలు ఎవరు వింటారు? సంఘంలో కడ మెట్టులో నున్న స్త్రీ అమె. పర పురుషునికి తన శరీరాన్ని అప్పగించిన స్త్రీ ఆమె. ఆత్మాభిమానం లేని స్త్రీ అమె .

ఈ క్రూర సంఘం తనను రేణుకాదేవికి అర్పించకుండా ఉండి యుంటే భర్తతో కాపురం చేసికొంటూ, బిడ్డా పాపలతో గౌరవంగా, సంతోషంగా జీవించి ఉండేది. తన యౌవనాన్ని, తన కళను, తన సౌందర్యాన్ని, చివరకు తన రక్త మాంసాల్ని ఈ సంఘం బలితీసుకొంది.

రాత్రీ పగలూ ఈ సంఘ పెద్దలు తనను అనుభవించి, ఆనందించారు. తను దుఃఖాన్ని అనుభవిస్తూ ఇతరులకు ఆనందాన్ని పంచింది తన హృదయం ఏమని ఘోషించిందో ఎవరైనా, ఎప్పుడైనా తెలుసుకొనడానికి ప్రయత్నించారా? లేదు. అందుకే ఆమె ఒక ఆధారంకోసం, ఒక నీడకోసం చూసింది. ఆ కమ్మ కాపు యువకుడు చివరకు దొరికాడు. అతని ఇల్లాలిగా జీవించాలని ఎంతో ఆశించింది. పాత జీవితాన్ని మరిచిపోయి కొత్త జీవితంలో అడుగు పెట్టింది. తన జీవితానికి ఒక కొత్త వెలుగు వచ్చింది. ఆ వెలుగులో ఆనందంగా తన జీవితాన్ని గడపాలనుకొంటూ ఉంచిన సమయంలో ఈ ఘోరం జరిగింది. దీని వెనక ఏ అదృశ్య హస్త ముందో! ఇప్పుడు మళ్ళా ఒక బాటను వెతుక్కోవాలి ఇలా ఆలోచిస్తూ ఆమె ఆ రోజున ఆ కమ్మ కాపు యువకుడ్ని పూడుస్తున్నప్పుడు మౌనంగా నిలబడి యుండవచ్చును.

కొన్ని సంవత్సరాలు గడిచి పోయాయి. నేను నృత్యకళకు చేసిన సేవ వల్ల నాకు కీర్తి ప్రతిష్టలు వచ్చాయి. కావలసినంత డబ్బు సంపాదించాను. కష్టాల్లో ఉన్నవారిని ఆదుకొన్నాను. ఎంత సంపాదించానో అంతా ఈ కళకే అర్పించాను. కొంతమందిని నమ్మి మోసపోయాను, కష్టాలకు కూడా లోనయ్యాను.

నాకు చాలా మంది పెద్దలతో పరిచయాలు ఏర్పడ్డాయి. నేను నృత్యకళకు చేస్తూండిన సేవ అందరికీ తెలుసు. వీరిలో పూజ్యులు స్వర్గీయ టంగుటూరు అంజయ్యగారు ఒకరు. నేను మంచి ఉచ్ఛస్థితిలో ఉండగా వారు నన్ను చూశారు. బీద స్థితికి లోనయినప్పుడూ నన్ను చూశారు. నే నెన్ని కష్టాలకు లోనయినా నా మనోధైర్యాన్ని పోగొట్టుకొని, నా యాదర్శాలను విడిచిపెట్ట లేదని ఆయన గుర్తించారు. అందువల్ల వారికి నాయెడల సదభిప్రాయం ఏర్పడింది. నన్ను వాత్సల్యంతో చూసేవారు.

ఆయన ఆంధ్ర ప్రదేశ్‌కు ముఖ్యమంత్రి అయిన తర్వాత నన్ను ఆంధ్ర ప్రదేశ్ నృత్య అకాడమీకి అధ్యక్షునిగా ఉండమన్నారు. ఆస్థాన నాట్యాచార్యునిగా నన్ను నియమించారు, నృత్యకళకు, నృత్యకళాకారులకు సేవచేసే అవకాశం ఈ విధంగా నాకు కల్పించారు

మొట్ట మొదటగా ఈ జోగుల, చిందులవారి జీవితాలను మెరుగు పరచాలన్న తలంపుతో ఒక ప్రణాళికను నృత్య అకాడమీ కార్యవర్గ సమావేశంలో ప్రవేశ పెట్టాను. నేను స్వయంగా ఆదిలాబాద్, మెదక్, నిజామాబాద్, కరీంనగర్ జిల్లాలలోని మారుమూల గ్రామాలకు, పల్లెలకు వెళ్లాను. "చీమలు దూరని చిట్టడవి కాకులు దూరని కారడవి" అని నే నెప్పుడో పుస్తకాలలో చదువు కొన్నవాటిని స్వయంగా చూశాను. ఆ గ్రామాలకు కారు కాదు కదా జీపుకూడా వెళ్ళదు. వెళ్ళడానికి బండ్లు కూడా దొరకవు. కాలిబాటలే కాని రోడ్లులేవు. వర్షాకాలం వచ్చిందంటే ఆ కాలిబాటలు గూడా బురదతో నిండి ఉంటాయి. ఇంక దోమల సంగతి చెప్పనవసరం లేదు. అలాంటి గ్రామాల్లో, పల్లెలలో యమయాతనలు అనుభవిస్తూ జీవిస్తున్న కళాకారుల్ని ప్రత్యక్షంగా అక్కడ కలుసు కొన్నాను.

తరతరాలుగా వెలుగు చూడని వారి జీవితాలకు ఒక నూతన వెలుగును అందించాలన్నదే నృత్య అకాడమీ సంకల్పం.

ఆ సందర్భంలో "ఇడె పల్లి" అనే ఒక గ్రామం వెళ్ళాను. అక్కడ కొందరు జోగులాంబలను కలిశాను. అక్కడ మేము బసచేసిన వసతి గృహం వద్ద వారిని సమావేశ పరిచి, వారితో వారి కళలను గురించి ముచ్చటించాను. వారు వారి ఆటపాటలను ప్రదర్శించారు. వారి ఫోటోలు తీసి. వారి కళాభివృద్ధికి కావలసిన ప్రణాళికను సిద్ధం చేయించాను.

ఆ సమావేశానికి రావడానికి వారు ముందు భయ పడ్డారు, బిడియ పడ్డారు. వారిలో ఒక వృద్ధ కళాకారిణి ఉంది. ఆమె వారికి పెద్ద. ఆమె పేరు జగ్గర్ లింగమ్మ. ఆమెను ముందుగా పిలిపించి, ఆమెకు నచ్చచెప్పి, కొంత మంది మిత్రుల సహకారంతో ఆ సమావేశాన్ని ఏర్పాటు చేయవలసి వచ్చింది. ఈ విషయంలో ఆరుమూరులోని మిత్రుడు నారాయణ నా కెంతో సహాయం చేశారు.

నృత్య అకాడమీ నుండి వారు సహాయం పొందనున్నారని తెలిసి కొందరు ఈర్ష్యచెందారు. "వారిని అలాగే అట్టడుగున ఉండనివ్వ కుండా వారిని పెద్దవారిని చేయడమా?" అన్న ఈర్ష్యతో వారిపైని కొందరు పోలీసు దాడి జరిపించారు. దీంతో వారు భయపడి ఇడెపల్లి వదిలి పారి పోయారు.

వీరిలో కొందరి నైనా హైదరాబాదు తీసికొని వచ్చి శ్రీ అంజయ్య గారి దృష్టికి వీరి విషయం తీసికొని రావాలని సంకల్పించాను.

ఆ సంవత్సరం మహాత్మా గాంధిజీ జయంతినాడు నూరుమంది ఈ జోగు, చిందు కళాకారులకు నృత్య అకాడమీ ఆధ్వర్యాన సమ్మానం ఏర్పాటు చేశాను. శ్రీ అంజయ్య గారు తమ సొంత హస్తాలతో ఆ నూరుమందిని సమ్మానించారు.

"మా జీవితాలలో కొత్త వెలుగును మేము చూడ బోతున్నాం" అంటూ ఆ వృద్ధురాలు జగ్గర్ లింగమ్మ ఆనందాశ్రువు రాల్చింది.

ఈ కళాకారుల్లో చాలామంది వారి జీవితాలలో తొలిసారి హైదరాబాదు నగరాన్ని సందర్శించారు.

ఈ వెనుకబడిన కళాకారులకు ఈ సమ్మానం జరగడంతో పోలీసు దాడి చేయించిన ఆ పెద్దలు పశ్చాత్తాపడ్డారు. వీరుకూడా ఆ కళాకారులను గౌరవించడం మొదలు పెట్టారు.

వీరికి ప్రభుత్వం వారు ఇళ్ళ స్థలాలనిచ్చి, వీరి అభ్యున్నతికి అనేక ప్రణాళికలను చేపట్టేరు.

'ఎల్లిని' ఎల్లమ్మ అని, 'ముత్తి' ని ముత్తమ్మ అని పిలిచే ఔదార్యం ఈ పద్ధతిలో కలిగించి.

అయితే ఇంతలో శ్రీ అంజయ్య గారి ప్రభుత్వం రద్దయింది. మా నృత్య అకాడమీ రద్దయింది. నా అధ్యక్ష పదవి వదలిపోయింది. వీరికి సంబంధించిన నృత్య అకాడమీ ప్రణాళికలు సగంలో నిల్చిపోయాయి. వీరి జీవితాలు మళ్ళా అంధకార బంధురంలోకి వెళ్ళి పోతా యనుకొన్నాను. కాని ఇంతలో జిల్లా కలెక్టర్లుగా ఆదర్శవంతులైన శ్రీమతులు షీలాబేడీ, ఆశామూర్తి వచ్చారు. వీరు ఈ కళాకారులయెడ శ్రద్ధవహించి వీరి జీవితాలను మెరుగు పరచారు. నేనెంతో సంతోషించాను.

దిక్కు తోచక అంధకారంలో అలమటిస్తూండిన ఈ కళాకారులకు ఒక వెలుగు బాట కనిపించింది జోగి ముత్తి వంటి ఎందరో అభాగ్యుల జీవితాలలో అరుణోదయమయింది.

"అదేందే, ఇప్పటి నుండే భోగం రంగసాని వలె కులకబడ్తివి. బాగుపడ్తవులే" అనో, "జోగి ముత్తివోలె గిచ గిచ ఆడబడ్తివి, సిగ్గులే" అనో తెలంగాణా పల్లెటూళ్ళలోని పెద్దవారి ఇండ్లలోను, దివాణాలలోను దొరసానులు వారి పిల్లలను సుమారు మూడు దశాబ్దుల క్రిందటివరకు తిడుతూ ఉండేవారు.

"భోగం రంగసాని" అని అన్నా సానివారు ఊరుకొనే వారు కాని 'దాసీ' అందే మాత్రల ఊరుకొనేవారు. "మేం దాసీలమా?" అని తిరగ బడేవారు. ఈ రంగసానుల గురించి వేరే వ్రాస్తాను. ప్రస్తుతం జోగి ముత్తి గురించి తెలియజేస్తాను.

ఈ ముత్తిని పండితులు "ముత్తి, ముత్తవ్వ, ముత్యం, ముక్తి కాంత" అని పలు రకాలుగా పిల్చేవారు గాని తక్కిన వారు ముత్తిని "ముత్తి" "గానే పిలిచేవారు. పొరపాటున ఎవరైనా "ముత్తవ్వా!" అంటే మూతి పళ్లు రాలగొట్ట మంటావా?" అని కోపగించేవారు.

ఈ సందర్భంలో ఆ కాలంలో రావులు, దొరలు, దేశముఖ్‌ల ఇండ్లలోని కొన్ని ఆచారాలను ఇక్కడ చెప్పడం అవసరం. ఆనాటి సాంఘిక వ్యవస్థ ఈ నాడు మారింది, మరి పదేండ్లలో పూర్తిగా మారిపోతుంది. ఆ యాచార వ్యవహారాలు మాతరంతో సరి. ఆ నాటి వాటిని గురించి ఇకముందు చెప్ప గలిగేవారు కూడా ఉండక పోవచ్చును. అయితే ఆ విషయాలను ప్రస్తుతం ముచ్చటించడం అవస రమా అంటే అవసరమే. ఆంధ్రుల సాంఘిక చరిత్రకు, సమాజ పరిణామ చరిత్రకు అవసరమే.

ఆ కాలంనాటి వ్యక్తుల పేర్లు ఈ నాటివారికి చాలా చిత్రంగా విని పించ వచ్చును. బుచ్చమ్మ, భూమక్క, బలమ్మ, మల్లమ్మ, ఎర్రమ్మ, లక్కమ్మ, రంగమ్మ, ఎరుకమ్మ వంటి పేర్లను సామాన్యుల ఇండ్లలోని పిల్లలకు పెట్టేవారు. అదే గొప్ప వారిండ్లలో అయితే 'బుచ్చమ్మ'ను "బుచ్చమాంబ" అని పిలిచే వారు, 'మల్లమ్మ'ను "మల్లమాంబ" అనేవారు. 'ఎరుకమ్మ'ను "ఎరుక సానమ్మ" అనేవారు. ఇలా పేర్లు మారుతూ ఉండేవి. పెద్ద ఇంట్లో పుట్టిన 'ముత్తమ్మ' "ముత్తమాంబ" గా మారినా బీదవారింట పుట్టిన 'ముత్తి' చిన్న ప్పుడూ ముత్తే, ముసలిదయినా ముత్తే. చిన్న పిల్లలు సైతం ఆమెను ఇలాగే పిలిచేవారు. 'ముత్తి' 'ముత్యం' అవడానికి ఎంత మాత్రం వీలు లేదు.

పెద్దకుటుంబాల వారికి వైష్ణవ పండితులంటే చాలా భక్తి, గౌరవం ఉండేవి. ఈ పండితులు వారి పిల్లలకు ఆంధ్రగీర్వాణ భాషలు చెప్పే వారు వీరి స్త్రీలకు తీరిక సమయాలలో రామాయణ, భారత, భాగవతాది పౌరాణిక గ్రంథా లను చదివి వినిపించేవారు. ఈ పండితులకు భూదానం, గోదానం మొదలైనవి

ఇచ్చి ఈ స్త్రీలు గౌరవించేవారు, పాదపూజలు చేసి, సాష్టాంగ నమస్కారాలు చేసేవారు.

ఆంధ్ర ప్రాంతంలోని వైష్ణవ పండితులు మద్యమాంసాలు సేవించే వారు కారు గాని తెలంగాణాలోని వైష్ణవ పండితులకు ఇవి నిషేధాలు కావు.

ఈ పండితుల స్త్రీలు ఒకరింట్లకొకరు వచ్చినప్పుడు సంభాషణతీరు: "వదినమ్మగారు ఈ రోజున శాకపాకాలు ఏం చేశారు" అని అంటే.

"మీ అన్నయ్యగారు కోరి కాలజ్ఞానాన్ని వండించుకొన్నారు" అనో "ఓంకారాలు, వంకీలు సాతాళించా" ననో, "ఇవాళ ప్రథమాల పులుసు, ప్రథమాల ఇగురు" అనో ఇంటావిడ సమాధానం చెప్పేది. ఇంలాటి చిత్ర విచిత్ర భాష వారికే గాని పైవారికి అర్థమయ్యేది కాదు. "కాలజ్ఞానం" అంటే కోడి, "ఓంకారం, వంకీలు" అంటే రొయ్యలు. "ప్రథమాలు" అంటే మత్స్యావతారాలు అంటే చేపలు.

ఈ తెలంగాణా దొరలు చాలా ఉదారులు. ఈ యయ్యవార్లలో చాలామంది విద్వాంసులు, పండితులు, కవులు, శాస్త్ర వేత్తలు, సంగీత విద్వాంసులు ఉండే వారు. అందువల్ల వీరి చేత యక్షగానాలను వ్రాయించి, దాసరి, సాతాని భాగవతులకు ప్రదర్శించడానికి తగిన శిక్షణ ఇప్పించే వారు ఈ దొరలు. ఈ శిక్షణా కాలంలో ఈ భాగవతులకు భోజన వసతి సౌకర్యాలను కల్పించేవారు. శిక్షణ పూర్తయిన తర్వాత వాటిని ప్రదర్శించుకొంటూ జీవించమని ఈ దొరలు ఆ భాగవతులకు చెప్పి, వారికి ధనసహాయం చేసేవారు. అందువల్ల ఈ యక్షగానాల్లో వాటిని రచించిన కవుల పేర్లే గాక వాటిని వ్రాయించిన దొరల పేర్లు కూడా ఉంటూ ఉంటాయి.

ఈ యయ్యవార్లకు జీతాలు తక్కువే అయినా భత్యాలు ఎక్కువగా ముట్టేవి. వీరి ఇండ్లకు చుట్టాలు ఎవరైనా వస్తే ఈ దొరల దివాణం నుంచే బియ్యం, పప్పు, ఉప్పు మొదలుకొని తాంబూల సామగ్రివరకు సరఫరా అయ్యేవి. దివాణంనుండి అన్నీ ముడుతున్నప్పుడు జీతంతో సమస్య ఏం ఉంటుంది?

తెలంగాణా ప్రాంతంలో క్షత్రియులు తక్కువ. రావులు, రెడ్లు ఎక్కువ. రాజులు, భట్రాజులు ఉండేవారు. వీరు శ్రీమంతులే కాక మహావిద్వాంసులు, కవులు, పండితులు. దాన ధర్మాలు చేయడంలో వీరు ఎవరికీ తీసిపోయే వారు కారు.

జైనుల పవిత్ర యాత్రా స్థలమైన కొలనుపాక మా అమ్మమ్మగారి ఊరు. నా మాతామహులు ఈ ప్రాంతంలో ఒక జమీందారు. అందువల్ల నాకు ఈ యాచారవ్యవహారాలు తెలుసుకొనే అవకాశం కలిగింది. ఆ నాటి గౌరవ మర్యాదలు, వినయ విధేయతలు, నియమ నిష్టలు ఈ నాడు మచ్చుకైనా లేవు. కనుక ఈ నాటివారికి పై విషయాలు వింతగా తోచవచ్చును.

ఆనాటి రాచమర్యాదల గురించిన ఒక చిన్న ముచ్చటను ఇక్కడ తెలియ జేస్తాను. అదొక దివాణం. దొరవారు జమా కర్చులు చూసుకొంటున్నారు. మధుమాల గారి ఆరోగ్యం బాగు లేక వారి జమాకర్చులను తెలియజేయడానికి మరొకర్ని ఆమె పంపించారు, ఆ వచ్చిన ఆమె, "మధుమాలగారు తమకు ఇలా తెలపమని సెలవిచ్చారండీ" అని అంది.

"ఏమిటీ?" అన్నారు ఆ దొరగారు.

"మధుమాల గారు -----" అని ఇంకా వివరంగా ఆమె చెప్పబోతూంటే

"ఏమిటీ?" అని ఆ దొరగారు ఇంకాస్త కఠిన స్వరంతో ప్రశ్నించారు. ఆ ప్రక్కనే ఉండిన ఒక అనుభవజ్ఞురాలు "మధుమాల ప్రభువుల వారికి ఇలా వినికిడి చేయమంది" అని సర్ది చెప్పింది. అప్పుడు ఆ దొరగారు ప్రసన్న వదనులై "మధుమాల గారు అని మిమ్మల్ని పిలవ మందా?" అని ఆయన అడిగారు. "నా కన్నా పెద్దామె కనుక నేనే అలా అన్నాను. అపరాధాన్ని మన్నించండి దొరా" అని ఆమె వినికిడి చేసింది.

అనాడు ఇటువంటి గట్టి కట్టు బాట్లుండేవి.

పల్లె ప్రాంతాలలోని కొందరు రసికశిఖామణుల ప్రవర్తన కడు చిత్ర విచిత్రాంగాను, రమ్యాతి రమ్యంగాను ఉండేది. వారి గ్రామాలలోని పంచములు పగలంతా అంటరాని వారు, ముట్టరానివారు "వారిగాలి గూడా సోకకూడదు" అని సూక్తులు పలుకుతూ, గీతా ప్రవచనాలను ఉటంకిస్తూ ఉండేవారు ఈ రసికులు, సాయంత్రం చంద్రుడు ఉదయించ గానే రెండు ముంతలు ఖాళీ చేసి, వారిలోని కామపిశాచాన్ని మేల్కొలిపి, ఆ వెన్నెల వెలుగులో పూరి పెలుపలకు వెళ్ళి, హరిజనవాడ జోగులాండ్రలను చేరుకొని వారి కామ తృష్ణను చల్లార్చుకొని, తృప్తి పడే వారు వీరు వీరి కామ తృష్ణను తీర్చడానికే వారిని దేవుడు సృష్టించాడని ఆ హరిజన స్త్రీలు ఇంకేమీ చేయ లేక అనుకొనేవారు. వారు నమ్మి, పూజించే ఎల్లమ్మ హరిజన తల్లి గూడా వారిని ఆదుకొనేది కాదు. ఆమెకు వీరి పైని దయ కలగలేదు.

ఈ యెల్లమ్మ ఎవరో కాదు మహాపతివ్రత అయిన రేణుకా దేవి. ఈమెను ఆమె భర్త జమదగ్ని అనుమానించాడు ఆమెను నరకడానికి సొంత కొడుకు పరుశురాముడు ఆమె వెంటపడ్డాడు. ఆమె పరుగెత్తి వెళ్ళి ఒక పంచముని ఇంట తల దాచుకొంది. తనను తాను కాపాడుకో లేని ఈ యెల్లమ్మ ఈ హరిజన స్త్రీలను ఎలా రక్షించ గలుగుతుంది?

దక్షప్రజాపతి కుమార్తె సతీదేవి శివుణ్ణి ప్రేమించింది. తండ్రిమాట వినకుండా శివుణ్ని ఏరి కోరి పెండ్లి చేసికొంది అతనితో వెళ్ళిపోయింది. దక్షునికి తన సొంత కూతురుపైనే కోపం వచ్చి, కక్షబూనాడు. ఆమెకు తగిన బుద్ధి చెప్పాలని తలచి ఒక పెద్ద యజ్ఞం తలపెట్టాడు దక్షుడు ఆ యజ్ఞానికి అందర్నీ పిలిచాడు గాని తన కుమార్తెను అల్లుణ్ని పిలవలేదు. పుట్టింటి పైని గల మమకారం కొద్దీ సతీదేవి ఆ యజ్ఞానికి వెళ్ళింది. పిలవని పేరంటానికి వెళ్ళవద్దని శివుడు వారించినా ఆమె వినలేదు.

ఈ దక్షయజ్ఞం తూర్పుగోదావరి జిల్లాలోని ద్రాక్షారామంలో జరిగింది. అందుకే దీనిని దక్షవాటిక అంటారు. ఇక్కడ జరిగిన ఈ యజ్ఞానికి భారతావనిలోని పెద్దలందరూ వచ్చారు. సతీదేవి ఈ యజ్ఞానికి రాగానే ఆమెను దక్షుడు ఆదరించలేదు గదా అగౌరవ పరచాడు. ఆ యగౌరవాన్ని భరించలేక ఆమె ఆ యజ్ఞకుండం వద్ద ప్రాయోపవేశం చేసి ప్రాణాలు వదిలింది. ఈ విషయం శివునికి

తెలిసింది. అతడు రుద్రుడయ్యాడు. అతని కన్నులనుండి నిప్పులు కురిశాయి. పరుగు పరుగున ఆ యజ్ఞవేదిక వద్దకు వెళ్లాడు. అక్కడి దృశ్యం చూసి కోపంతో వణికి పోయాడు. తన జటా ఝూటంలోనుండి ఒక జడను తీసి నేలపై కొట్టాడు. వెంటనే అందులోనుండి వీరభద్రుడు పుట్టాడు.

"శరణ, ఆశ్శరభ, అశ్శరభ, శరభ! ఏమిఆజ్ఞ?" అంటూ ఆ వీరభద్రుడు శివుని వైపు చూశాడు.

"కక్ష తీర్చుకో, దక్షయజ్ఞాన్ని నాశనం చేయి" అని శివుడు ఆజ్ఞాపించాడు.

అంతే, అరక్షణంలో ఆ దక్షవాటిక రుద్రభూమిగా మారిపోయింది. పట్టరాని కోపంలో తన మూడవ కన్నుమాట మరిచిపోయినట్టున్నాడు. ఆ మూడవ కన్నును, తెరిచియుంటే ఏం జరిగియుండేదో కాని అతడు తెరవలేదు. యజ్ఞగుండం వద్ద పడియుండిన తన ప్రియురాలి మృతదేహాన్ని తన భుజంపైని పెట్టుకొని పిచ్చిగా నాట్యం చేయడం మొదలు పెట్టాడు. ఆయన వెంట భూత గణాలు గూడా నాట్యం చేయడం మొదలు పెట్టాయి. దీంతో భూలోకం దద్దరిల్లిపోయింది. అనర్థం జరగబోతున్నదని అక్కడకు వచ్చిన తాపసులందరు తలచి, విష్ణు దేవుని వద్దకు వెళ్ళి లోకనాశనం జరగకుండా చేయమని వేడుకొన్నారు. విష్ణువు పరిస్థితిని తెలుసుకొని తన చక్రాన్ని వదిలాడు. సతీదేవి దేహాన్ని అది పద్దెనిమిది ముక్కలుగా ఖండించింది. ఆ పద్దెనిమిది ఖండాలు పద్దెనిమిది చోట్ల పడ్డాయి. అవే పద్దెనిమిది శక్తి పీఠాలుగా వెలిశాయి. అలా వెలసిన శక్తి పీఠాలలో ఒకటి అలంపురంలోని జోగులాంబ పీఠం. ఈ యమ్మ భక్తులు చాలా మంది వారి ఆడ పిల్లలకు ఆ యమ్మ పేరు పెట్టుకొన్నారు.

ఈ జోగులాంబను ఆరాధించే హక్కు మొదట్లో అందరికీ ఉండే ఉంటుంది కాని ఈ జోగులాంబకు ఒక ఆలయాన్ని నిర్మించి అందులో ఆమెను ప్రతిష్ఠించిన తర్వాత ఆ యాలయంలో ప్రవేశించి, ఆమెను పూజించే అర్హత కొన్ని కులాల వారికి పరిమితమైపోయింది. అస్పృశ్యులైన హరిజనులకు ఆ యాలయ ప్రవేశం నిషేధించబడింది.

హరిజనులే కాక వ్యవసాయ వృత్తికి చెందిన కొన్ని కులాలవారు గూడా తమ ఆడబిడ్డలను ఈ యంబపేరిట వదిలి పెట్టేవారు. ఇదొక ఆచారంగా పరిణమించింది. ఇలా వదిలిపెట్టబడిన వారే పార్వతులు. బసవులు, దైవమ్మలు. వీరు గణాచార్యులు. ఈ పద్ధతికి చెందిన వారే కొందరు పెద్ద కులాలకు చెందిన కాంతలు.

ఏ త్యాగాన్నైనా చేసి, ప్రాణాలు వదిలి పెట్టిన స్త్రీలను శక్తిరూపంగా వెలిసియుంటారని భావించి, వారిని పార్వతీ దేవులుగా పూజించడం మన సమాజంలో వస్తూన్న ఆచారం.

రేణుకాదేవి మహాపతివ్రత, కర్మవశాత్తూ హరిజనవాడలో తల దాచుకొని జీవించింది. తర్వాత చనిపోయింది. అందుకే హరిజనులు ఈమెను ఒక దేవతగా ఆరాధిస్తారు. ఈమె పేరిట వీరు గుళ్ళు, గోపురాలు నిర్మిస్తారు. ఆమెను పరాశక్తిగా పూజిస్తూ ఉంటారు.

ఈమె వీరిపాలిట అంబ, జోగులాంబ, ఎల్లమ్మ. పూర్వం జోగులాంబకు తమ ఆడబిడ్డలను సమర్పించినట్లై ఈ యంబకు కూడా తమ ఆడబిడ్డలను సమర్పించడం మొదలు పెట్టారు. వీరే జోగమ్మలు జోగితలు, జోగులాంబలు అయ్యారు.

ఇదే జోగితల చరిత్ర.

# నాదోపాసిని నాగరత్నమ్మ

నను పాలింప నడచి వచ్చితివో నా ప్రాణ నాథా!
వనజ నయన మోమును జూచుటే
జీవన మని నెనరున మనసు మర్మము దెలిసి॥
సురపతి నీల మని నిభ తనువులో
ఉరమున ముత్యాల సరుల చయములో
కరమున శరకోదండ కాంతిలో
దరణి తనయతో త్యాగరాజార్చిత॥

వేంకటగిరి రాజాగారి కోటలో జరిగిన ఒక వేడుకకు కవి, పండిత, గాయక నర్త విద్వరేణ్యులు సమావేశమై రాజా వారికి వారందరూ కానుక లర్పించారు. నాగరత్నమ్మగారి వంతు చివరికి వచ్చింది. ఆమె చేతిలో పట్టు వస్త్రాలతో చుట్టి ఒక పెద్ద వస్తువు ఏదో ఉంది. ఆమె పై త్యాగరాయ కృతిని మోహన రాగంలో పాడడం మొదలు పెట్టింది. ఆమె వైపే సభికులందరూ వింతగా చూస్తున్నారు. ఆమె ఇంకా లేచి నిలబడలేదు. ఆమెది స్థూలకాయం. అలా ఆమె పాడుతూ తన్ను తాను మరిచింది. నేత్రాలనుండి అశ్రుధారలు కారు తున్నాయి. ఆమె చేతిలోని వస్తువుపైని అవి రాలుతున్నాయి. ఆమె అలా పాడుతూ పాడుతూ అభినయించడం మొదలు పెట్టింది. అదొక అద్భుత దృశ్యం ఎవ్వరూ, ఎప్పుడూ చూసి యుండరు.

కొంత సేపటికి ఆమె శాంతించింది. ఆటా పాటా ముగిశాయి. చేతిలోని వస్తువుపై నున్న పట్టు వస్త్రాన్ని తొలగించింది, రాజా వారికి దగ్గరగా వెళ్ళింది. ఆ రాజావారి చేతిలో ఆ వస్తువును పెడుతూ "రాజేంద్రా! నా రాముణ్ని అర్పించుకొంటున్నాను" అంటూ వెనుకకు అయిదడుగులు వేసి,

నిధి చాల సుఖమా? రాముని సన్నిధి సేవ సుఖమా?

నిజముగ దెప్పుమో మనసా
దధి నవనీత క్షీరములు సుఖమో

దాశరధి శరణామృతము సుఖమో! అంటూ ఆలపించి, పాడి ఆమె కూర్చుంది. ఆ రాజావారు ఆ సీతారాముల పటం వంక ఒక్కసారి చూసి, తమ చూపు అస్థాన పండితుని వైపు మరలించారు. ఆ పండితుడు లేచి, "నేడు సుదినం. నాగరత్నంగారి అభినయాన్ని గూడా చూచే భాగ్యం నేడు కలిగింది. ఏదీ, ఒక్క పదం! బంగారేచ భూపాలుని మీద రచింపబడ్డ ఆ సంస్కృత పదాన్ని గూడా అభినయిస్తే బాగుంటుంది," అని రాజావారి మాటగా తెలియ జేశాడు.

"రాజావారూ! ఇక్కడ ఆశీనులైయున్న పెద్దలూ మన్నించాలి. ప్రస్తుతం భక్తి మార్గం. ఆ రామనామాన్ని ఉచ్చరించిన నోట వేరొకటి ఉచ్చరించ లేను" అని రాజా వారికి, సభకు నమస్కరించింది నాగిరత్నమ్మ.

ఆ సభలు, వేడుకలు జరిగిన ఆ వారం రోజులూ ఆమె వెంకటగిరిలోనే ఉంది. ఆమె ఆ వారం రోజులు తన బసకు స్వయం పాకం తెప్పించుకొని, స్వయంగా వంట చేసికొంది.

ఏడవ రోజున ఆ యాస్థానంలో దక్షిణలు ఇచ్చారు. అంతఃపురంలో పెద్దమ్మగారి వద్ద కొన్ని భజన కీర్తనలు పాడి చిన్నమ్మగారి వద్ద కీర్తనలు పాడి దక్షిణ నాగరత్నమ్మ పుచ్చుకొంది. విద్వాంసులు కోరినవి పాడి దక్షిణ పుచ్చుకొంది. రాజావారు ఇచ్చిన దక్షిణ సరేసరి. ఇలా అందరివద్దా దక్షిణలు పుచ్చుకొని, వాటి నన్నింటిని జాగ్రత్తగా మూట గట్టుకొని విడిదికి ఆమె తెచ్చు కొంది. ఒంటరిగా గదిలో కూర్చుని అన్నిటినీ ఒకసారి చూసుకొని, లెక్క పెట్టు కొని సందుగ పెట్టిలో పెట్టుకొంది.

వంటకు ఇచ్చిన సరుకులలో మిగిలియున్న వాటి నన్నింటిని కారం పొడితో సహా పొట్లాలు కట్టి జాగ్రత్తగా పెట్టుకొంది. తన సేనకై ఈ వారం రోజులపాటు నియమింపబడ్డ బ్రాహ్మణ యువకుడు ఆమెను జాగ్రత్తగా పరిశీ లిస్తున్నాడు. అతనికి ఆమె చేస్తున్న పని వింతగా తోచి, "నిధి చాల సుఖమా?

రాముని సన్నిధి సేవయే సుఖమా?" అని తనలో తాను పాడుకొంటున్నట్టుగా ఆమెకు విని పించేటట్టు పాడేడు. అతడు అలా ఎందుకు పాడేడో ఆమె అర్థం చేసికొని "అప్పా! ఇలారా!" అని పిలిచి, "చూడూ, సంపాదించేటప్పుడు, కూడ బెట్టేటప్పుడు తేనెటీగలు కష్టపడి తేనెను సంపాదించి, కూడబెట్టినట్టు కష్టపడాలి. డబ్బు సంపాదించలేని వాడు దేన్ని కర్చుపెడతాడు?" అని అతన్ని అడిగింది. అతడు నిశ్చేష్టుడై నిలబడిపోయాడు. తర్వాత తేరుకొని, "ఇంత వరకూ మీరు సంపాదించిన ఆస్తిని ఏం చేస్తారు? శ్రీ రామచంద్రార్పణమేనా!" అని చిన్నగా నవ్వేడు. ఆమె సమాధానంగా ఒక చిరునవ్వు నవ్వింది.

చివరకు ఆమె అలాగే చేసింది. శ్రీ త్యాగరాజస్వామి వారి ద్వారా తన ఆస్తినంతా ఆ శ్రీరామచంద్రునికే అర్పించింది. శ్రీరాముని సేవిస్తూ ఒక యోగి నిలా తన శేష జీవితాన్ని గడిపిందామె.

బెంగుళూరులో స్థిరపడిన ఒక తెనుగు కళాకారుల వంశానికి చెందిన అచ్చమైన తెలుగు కళాకారిణి శ్రీమతి బెంగుళూరు నాగరత్నమ్మ

పూర్వ మెప్పుడో కొన్ని తెలుగు నాట్య కుటుంబాలు బెంగుళూరులో స్థిర వాసం ఏర్పరచుకొన్నాయి. ఆ నగరంలో గుండప్ప అనే ప్రముఖ నాట్యాచార్యు డొకాయన ఉండేవాడు తరతరాలుగా వారి వంశీయులందరూ నాట్యాచార్యులే. నేడు నాట్యాచార్యునిగా అక్కడున్న శ్రీ సత్యనారాయణ గూడా వీరి వంశీయుడే.

శ్రీమతి ధనభాగ్యమ్మ అనే మరొక ప్రసిద్ధ నర్తకీమణి గూడా బెంగళూ రులో ఉన్నారు. నేను ఒకసారి బెంగుళూరు వెళ్ళినప్పుడు ఆమెను కలుసు కొన్నాను. ఆమెకు వృద్ధాప్యం రావడంవల ఆమె నాట్యకళ నుండి విరమించి విశ్రాంతి తీసికొంటున్నారు. ఇలా ఎందరో తెలుగు సాంప్రదాయక నర్తనం తెలిసినవారు బెంగుళూరులో ఇంకా ఉన్నారు.

నాగరత్నమ్మ జీవితం నృత్యకళతో ప్రారంభమయింది. ఆమె కొన్ని నాట్యకచ్చేరీల గూడా చేశారు. ఒక వయస్సు వచ్చే వరకే నాట్యకచ్చేరీలు చేసే అవకాశముంది. ఆ తర్వాత ఆ కచ్చేరీలు ఆకర్షణీయంగా ఉండవు. ఈ సత్యాన్ని

ముందుగానే గ్రహించిన నాగరత్నమ్మ సంగీత సాధనచేసి, సంగీత కచ్చేరీలు చేయడం మొదలు పెట్టింది.

బొబ్బిలి సంస్థానంలో బుగత రామన్న, గోపన్న అనే ఇద్దరు నాట్యాచార్య లుండేవారు. వీరిద్దరూ గూడా మంచి మార్దాంగికులు. శివ పంచముఖి, షణ్ముకి తాళాలు వేయడంలో వీరు ప్రసిద్ధులుగా పేరు పొందారు. నాట్యంలోని వీరి జతికట్టుబాట్లు చాలా కష్టమైనవిగా ఉండేవి. ఈ మధ్య కాలంలో పంచముఖి, షణ్ముఖి తాళ వాయిద్యంలో ప్రసిద్ధిగాంచిన స్వర్గీయ ముట్నూరి సత్యనారాయణ గారి తండ్రిగారు పై మార్దాంగికుల వద్దనే ఆ విద్యను నేర్చుకొన్నారు.

బొబ్బిలి రాజాస్థానంలో చిరంజీవి, సంజీవి, సువర్ణ అనే ముగ్గురు ప్రముఖ నర్తకీమణులు ఉండేవారు. వీరు ముగ్గురూ సహోదరులే. వీరు గడ్డిభుక్త కుటుంబానికి చెందినవారు. వీరిలో సువర్ణది గుడి సాంప్రదాయక నృత్యం. గడ్డిభుక్త జీవరత్నమ్మగారితో బొబ్బిలి ఆస్థాన నృత్య సంప్రదాయం అంతరించిపోయింది. ఈమె చిరంజీవి కుమార్తె.

ఈమె ఒక నర్తకికి ఆస్థాన కేళికలు నేర్పి కొన్ని ప్రదర్శనలు ఇప్పించింది. ఆ తర్వాత బొబ్బిలి రాజాగారి కోర్కెపైని ఆ నర్తకికి బెంగుళూరు నాగరత్నమ్మ కొంత కాలం శిక్షణ ఇచ్చి కొన్ని నాట్య కచ్చేరీలు జేయించారు. ఆ నర్తకి ఈ రెండు బాణీలలోను ఆరితేరిన కళాకారిణి అయింది. బొబ్బిలి బాణీలో నర్తకి పాడుతూ ఆడుతుంది. నాగరత్నమ్మ బాణీ మూగ బాణీ. అంటే నట్టువలు పాడుతూ ఉంటే నర్తకి నాట్యం చేస్తుంది అయితే ఈ కళాకారిణిగూడా కొన్నాళ్ళ తర్వాత నాట్యం మానేసి సంసార జీవితంలో స్థిరపడింది. మా నృత్య నికేతన్‌లో శిక్షణ పొందిన వారిలో కొంత మందికి ఈ బొబ్బిలి సంప్రదాయ నృత్యంలోని కొన్ని అంశాలు మాత్రమే తెలుసు. అందువల్ల బొబ్బిలి బాణీ ఒక విధంగా అంతరించినట్టేనని చెప్పవచ్చును.

నాగరత్నమ్మ గారు ఎన్నో సంస్థానాలను సందర్శించారు. ఎన్నో చోట్ల సంగీత కచ్చేరీలు చేశారు. ఎంతో ధనాన్ని, దానిని మించిన కీర్తిని ఆమె సంపాదించారు. ఈ బెంగుళూరు నాగరత్నమ్మ గారి సంగీత క్షేత్ర యాత్ర గురించి

కన్నడ భాషలో ఒక గ్రంథం గూడా వెలువడింది. అందులో ఆమె కీర్తి ప్రతిష్టలు వివరించబడ్డాయి. కాళ్ళకు గజ్జెలు కట్టడంతో ప్రారంభమైన ఆమె కళా జీవితం త్యాగరాజులవారి భక్తి కీర్తనలు పాడడంతో ముగిసింది.

" హే గోపాలా! హే గోవిందా! హే కృపానిధీ! " అని ఆమె ముకుంద మాలలోని శ్లోకాలు పాడుతూంటే ఆమెకు ఆ భగవంతుడు పలుకు తున్నాడా? సాక్షాత్కరిస్తున్నాడా?" అని అనిపించేది ఆమెను ఆ స్థితిలో చూసే భాగ్యం నాకు కలిగింది.

ఆమెకు కన్న బిడ్డలు లేరు అందువల్ల ఆమె ఒక పిల్లను పెంచుకొంది. ఆ యమ్మాయికి విద్యాబుద్ధులు, సంగీతాది కళలు నేర్పి వృద్ధిలోకి తేవాలని ఎంతో ఆశించింది. విద్యల మాట దేవు డెరుగు కనీసం సరైన బుద్ధి గూడా ఆమెకు రాలేదు.

క్రౌంచపక్షిని ఒక కిరాతకుడు చంపడాన్ని చూసి వాల్మీకి రామాయణాన్ని వ్రాసినట్టుగా ఈ పెంపుడు కూతురు ప్రవర్తన చూసి ఈమె రామ భక్తురాలై, త్యాగరాయ కృతులు పాడుకొంటూ జీవితం గడిపింది.

నాగరత్నమ్మకు నానాటికి ఆధ్యాత్మిక చింతన ఎక్కువయినా ఆమె ఈ భౌతిక విషయాలను గురించి గూడా ఆలోచించి, తన తదనంతరం తన ఆస్తిలో కొంత తన పెంపుడు కూతురుకు చెందేటట్లు వీలునామా వ్రాసింది. ఆ పెంపుడు కూతురు తనకు రావలసిన ఆస్తిగురించి తహతహలాడింది. అడిగితే ఆమె ఇవ్వ దేమో నన్న భయంతో తల్లిని ఎలాగైనా దైవసాన్నిధ్యానికి పంపాలనుకొంది. కాని తల్లికి ఎటువంటి అనుమానం రాకుండా మసులు కొంది.

నాగరత్నమ్మ తరచుగా తిరువయ్యూరు వెళ్ళి త్యాగరాజులవారి సమాధిని దర్శించి వస్తూ ఉండేది. దక్షిణ దేశ శాస్త్రీయ సంగీతానికి భిక్ష పెట్టిన ఆ మహాను భావుని సమాధి వద్ద చెత్తా చెదారం పేరుకుపోయి యుండడం చూసి ఆమె బాధ పడింది.

త్యాగరాజులవారి కీర్తనలు పాడి కచ్చేరీలు చేసి బాగా డబ్బు సంపాదించు కొన్నవారు దక్షిణ భారతావనిలో చాలా మంది ఉన్నారు. కాని వారి సమాధిని

జాగ్రత్తగా కాపాడుకొనాలన్న ఆలోచన వీరికి రాలేదు. ఆయన సమాధిపైని ఒక దివ్య మందిరాన్ని నిర్మించి, దాని నొక పవిత్ర యాత్రా స్థలంగా మార్చి, త్యాగ రాయస్వామి వారి భక్తులకు దానిని ఒక పుణ్యక్షేత్రంగా రూపొందించాలన్న ఆలోచన ఇంతమంది దక్షిణాది సంగీత విద్వాంసులలో ఏ యొక్కరికీ రానందుకు ఆమె దుఃఖించింది. తన కూతురుకు వ్రాసియిచ్చిన ఆస్తిపోగా మిగిలిన ఆస్తితో త్యాగరాజ వారి సమాధివద్ద ఒక మందిరాన్ని కట్టించాలని ఆమె నిశ్చయించుకొంది అక్కడ నుండి బెంగుళూరు తిరిగి వెళ్ళిన తర్వాత ఈ యాలోచన మరీ ఎక్కువయింది. ఎప్పుడూ ఆలోచిస్తూ పరధ్యానంగా ఉండేది. ఒకనాడు ఆమె కొక చెడుకల వచ్చింది. కనుక తన ఆలోచనను కార్యరూపంలో పెట్టాలనుకొంది. ఈ విషయాన్ని ఎలాగో ఆ కూతురు గ్రహించింది. ఆమె ఈ కార్యాన్ని నెరవేర్చక ముందే గతిస్తే ఆస్తి అంతా తనకు చెందు తుందన్న ఆశ ఆ కుమార్తెకు కలిగింది. అందుకు వీలయినంత వేగంగా తల్లిని వదిలించుకొనడానికి ఆ కూతురు ఒక పథకం వేసింది.

ప్రతిదినం రాత్రి పడుకొనే ముందు పాలు తాగడం నాగరత్నమ్మకు మొదటినుంచీ అలవాటు. కూతురే స్వయంగా ఆనాటి రాత్రి పాలగ్లాసు తల్లికి ఇచ్చింది. ఆమె ఏదో గ్రంథ పఠనంలో ఉన్నందు వల్ల వెంటనే పాలు తాగకుండా ప్రక్కన పెట్టుకొంది. మళ్ళా గ్రంథ పఠనంలో నిమగ్నమై పోయింది. ఇంతలో ఎక్కడినుండో పిల్లి వచ్చి, ఆ గ్లాసులోని పాలను తాగి గిలగిల కొట్టుకొని చని పోయింది. నాగరత్నమ్మ విషయాన్ని గ్రహించి, కూతుర్ని పిలిచి, " అమ్మా! నిన్ను కన్నకూతురులా పెంచాను అందుకనే నీ పేర కావలసినంత ఆస్తిని వీలునామాలో వ్రాసిపెట్టాను. డబ్బుకోసం పెంచి పోషించిన తల్లినే చంపాలను కొన్నావు. నన్నడిగితే నేనే నీకు వెంటనే ఇచ్చేదాన్ని కదా!" అంటూ నాగ రత్నమ్మ కంట నీరుపెట్టింది. ఆ మర్నాడే తన న్యాయవాదిని పిలిపించి, కూతు రుకు చెందవలసిన ఆస్తిని అప్పజెప్పించింది. మిగిలిన ఆస్తితో ఆమె తిరువయ్యారు చేరుకొంది. త్యాగరాజుల వారి సమాధిని శుభ్రం చేయించింది. ఆ సమాధి పైని ఒక భవనాన్ని కట్టించింది. దానికి చేరువలో ఒక చిన్న కుటీరం వేసికొని, నిత్యం ఆ స్వామివారిని ఆరాధిస్తూ అక్కడే స్థిరంగా ఉండి పోయింది ప్రతి సంవత్సరం త్యాగరాజస్వామివారి ఆరాధనోత్సవాలు అక్కడ దివ్యంగా జరుగుతూ ఉంటాయి. దీని కొక కార్యవర్గ ముంది. దేవుని పెళ్ళికి అందరూ పెద్దలే. ఈ పెద్దల్లో చిన్న

చిన్న కలతలు ఎచ్చి, పెద్ద, చిన్నకక్షలుగా మారాయి. తర్వాత అవి మళ్ళా ఈమె కృషివల్ల సర్దుకొన్నాయి.

ఈ విషయమై ఒక పత్రికా విలేఖరి ఆమెను ప్రశ్నించినప్పుడు, "సంగీతానికి ప్రచారం ఎక్కువయింది, భక్తి సన్నగిల్లింది. "సంగీత జ్ఞానము భక్తి వినా సన్మార్గము గలదే ఓ మనసా?" అన్న త్యాగరాజుల వారి ఆదర్శాలకు ఈనాడు విలువలేకుండా పోయింది" అంటూ ఆ కళా తపస్వి కంటనీరు కార్చింది.

ఆమె తన యావదాస్తిని పెట్టి త్యాగరాజుల వారి సమాధి పైని మందిరాన్ని నిర్మించినప్పుడు ఆమె త్యాగాన్ని అందరూ "ఓ హో హో! ఆహా హా! నాగరత్నమ్మాళ్ ఎంతటి త్యాగమూర్తి! ఆమె సంగీత సరస్వతి గనుక ఇంత గొప్ప కార్యం చేసింది," అంటూ ఆమెను కొనియాడారు.

ఇంతవరకూ ఆమె కథ బాగానే నడిచింది. అక్బర్ ఆస్థానంలో బీరుబల్లా ఆమె ఒక సమస్యను తెచ్చిపెట్టి మరీ చనిపోయింది. ఆమె రాముని భక్తురాలు. త్యాగరాజస్వామి వారి ఆరాధకురాలు కనుక తను తన తనువు చాలించిన తర్వాత త్యాగరాజ స్వామి వారి సమాధికి ఎదురుగా తన సమాధిని నెలకొల్పాలని ఆమె కోరుకొంది. అందుకు తగిన ఏర్పాట్లు చేసికొంది. ఆమె తన ధనాన్ని త్యాగరాజస్వామి వారికి సమర్పించినప్పుడు ఆ కార్యవర్గ సభ్యులకు ఎటువంటి శంకలు రాలేదు. ఆమె తన సమాధికి ఏర్పాట్లు చేసికొన్నప్పుడు ఎటువంటి అభ్యంతరాలు రాలేదు. కాని ఆమె చనిపోయిన తర్వాత ఆమె కోర్కెను తీర్చడానికి అందరికీ అన్ని శంకలూ వచ్చాయి, అభ్యంతరాలు వచ్చాయి.

"ఊర్వశీ గర్భ సంజాతో
వశిష్ఠశ్చ మహామునిః
తపసా బ్రాహ్మణోఽభవత్కిం
జాతి స్తత్ర కారణమ్" అని ఋషి వాక్కు.

బ్రహ్మం, పరబ్రహ్మం, ఆత్మ పరమాత్మల స్వరూపాల నెరుగని ఆ పెద్దలు ఆమె చనిపోయిన తర్వాత అనేక శంకలను వెలిబుచ్చారు. ఆమె బ్రతికి

యుండగా ఆ శంకలను వెలిబుచ్చి యుంటే ఎటువంటి ఘాటైన సమాధానం చెప్పియుండేదో!

"త్యాగరాయ స్వామివారి సమాధికి ఎదురుగా ఆమెను సమాధి చేయడమా" అని ఆ పెద్దలు ముక్కుమీద వేలు వేసుకొన్నారు, కనుబొమలు చిట్లించారు పెదవులు విరిచారు.

అయితే ఆ పెద్దల్లో హృదయమున్న, మానవత్వమున్న, కృతజ్ఞత కలిగి యుండిన వారు ఒకరు "ఆమె శరీరాన్ని మనం సమాధి చేయడం లేదు. పంచ భూతాల్లో ఆమె శరీరం కలిసిపోయిన తర్వాత మిగిలే పిడికెడు బూడిదను తీసి దాన్ని సమాధి చేస్తున్నాం. ఆమె చేసిన త్యాగానికి మనం ఈ మాత్రం చేయవచ్చును. దీనికి అభ్యంతరం ఎందుకు" అని అన్నారు. దీనికి మిగిలిన వారంతా సమాధాన పడ్డారు.

రామసన్నిధిని చేరడానికి తన సంకీర్తనతో రాజమార్గము చూపిన నాదయోగి, రామభక్తుడైన ఆ త్యాగరాజస్వామి వారి ఎదురుగా ఈ నాదోపాసిని సమాధి నిర్మించబడింది. ధన్యురాలు ఆమె.

# రుద్రగణిక కన్ను మూసింది

గుడిసానులు, భోగాలు, జక్కులు, నాగాసులు, కూర్మాపులు మొదలైన తెగలకు సంబంధించిన వారు ఆంధ్రదేశంలో పూర్వం నృత్యాన్ని ఆరాధించిన వారు. వీరికి దేవదాసీలకు సంబంధం లేదు. రాజాంతఃపురాలలో ఆస్థాన నర్తకులుగా ఉండి, అధికారముండిన వారు. దేవనర్తకీనులుగా కీర్తి ప్రతిష్టలుగల్గిన వారు. వీరు "దాసీ" అని అనిపించుకొనడానికి ఇష్టపడేవారుకారు. దేవనర్తకులు ఈ "దాసీ" అన్న పదాన్ని ఉపయోగించనిచ్చేవారు కారు "గుడిసాని" అంటే వీరు ఎంతో గౌరవప్రదంగా భావించుకొనేవారు.

"సాని" అన్నది ఒక బిరుదుగా పూర్వముండేది దీనిని సంపాదించుకొనడానికి ప్రతి దేవనర్తకీ ఎంతో కష్టపడవలసి వచ్చేది. కొందరు మహారాణులకు ఈ గౌరవప్రదమైన బిరుదు ఉండేది. పిల్లలమర్రిలోని ఎరుకలేశ్వరునికి ఆలయాన్ని కట్టించిన బేతరాజు భార్యపేరు ఎర్రకసాని. ఎరుకలసాని మంత్రసాని, దొరసాని మొదలైన పదాలు గౌరవప్రదమైనవే గాని నీచ పదాలు కావు. కాని రాను రాను ఈ పదవిశిష్టత అంతరించి, కళంకాన్ని ఆపాదించే ఒక నీచ పదంగా వాడుకలోకి వచ్చింది.

"దేవదాసీ" అన్న పదం "దేవనర్తకి"కి పర్యాయపదంగా వాడుకలోకి వచ్చింది. "మేము దేవదాసీలం కాము. క్రమశిక్షణతో సంవత్సరాల తరబడి బాల్యంనుండి నృత్యకళను అభ్యసించి దేవాలయాలలోని దేవుళ్ళను నృత్యపూజతో ఆరాధించిన వాళ్ళం. అర్చకులం. మేము దేవనర్తకులం. రాజాంతఃపురాలకు సంబంధించినది "దాసీ" వృత్తి. పేదరికంవల్ల కొందరు కన్యలు కోటల్లో దాసీ వృత్తిని చేపట్టి దాసీలయ్యారు. చిత్రమేమిటంటే వీరంతా ఆ రాజవంశ తెగకు చెందినవారే. వారి బిడ్డలు దాసులయ్యారు. అంతేకాని మేం మాత్రం దాసీలం కాము. ఏనాడైతే ఈ యదార్థ విషయాన్ని గుర్తించక మా దేవనర్తకులు "దేవదాసీ" అని పిలిపించుకొన్నారో ఆనాడే మా కళలకుండిన పవిత్రత పోయింది. కూటికొరకు ఈ నృత్య విద్యను సామాన్య వృత్తిగా ఏనాడు కొందరు

చేపట్టేరో ఆనాటినుండి మేం సంఘంలో ఆడుక్కి దిగజారిపోయాం" అంటూ కొందరు వృద్ధ ఆలయ నర్తకురాండ్రు నా పరిశోధనలో వాపోయారు. "మమ్మల్ని గణికలన్నా మాకు అభ్యంతరం" లేదని వారు నాతో చెప్పారు. "మా పేర్లకన్నా ఈ దాసీల పేర్లు చాలా వినసొంపుగా ఉంటాయి," అంటూ వారు నాకు ఈ దిగువ పేర్లను వినిపించారు.

మందారమాల, కమలనేత్రి, సరసీరుహం. మధుమాల, మాలతీమాల, వసంతతిలక, రాజహంస, వకులాభరణ, నవనీతం, సుగంధకుంతల, మలయ మారుతం మొదలైనవి.

దేవనర్తకులు తమ పేర్లచివర "అమ్మ" అన్న ముగింపు రాకుండా జాగ్రత్త పడేవారు. ద్రాక్షారామంలో వెలిసిన అంబపేరు మాణిక్యాంబ. ఈ దేవత పేరునే చాలామంది నర్తకురాండ్రు తమ ఆడబిడ్డలకు పెట్టుకొని ఆ దేవతను నిత్యం స్మరిస్తూ ఉండేవారు. వీరి పేర్లు ఇలా ఉండేవి.

చిట్టిరాజు, గనిరాజు, అప్పలరాజు, మాణిక్యం, రాజరత్నం, రామరత్నం చెల్లవ్వ, కుప్పాయి, ముద్దు కుప్పాయి, వెంకటనారాయణ, అమ్మాణి, సుందరి, బాలత్రిపురసుందరి, నూకరాజు, భగీరథి, భాగమతి, భాగ్యవతి, ప్రేమమతి, తారామతి, రాజామణి, నాగమణి, చంద్రరేఖ, చంద్రవదన, పుష్పావతి, వరహాలు నాగరత్నం, వేంకటరత్నం, అలమేలు, శారద, జగదాంబ, నగరాజతనయ, వనజాక్షి. మనోహరం, ఎలనాగు, సత్యభామ, గంగారత్నం, ముత్యం, మంగ తాయారు మొదలైనవి.

పైపేర్లలో కొన్ని మగవారి పేర్లలా ఉండవచ్చును. కాని పెట్టుకొనేవారు. కాని పొరపాటున కూడా 'అమ్మ' అన్న శబ్దం చివర నుండ డానికి వీలుండేది కాదు.

ఇక పండితులు, ఊరిపెద్దలు మాత్రం నాయకురాలినైనాసరే ముద్దుగా, ముచ్చటగా పిలిచేవారు. వేంకటరత్నాన్ని 'రత్తి' అని, పెద్ద వేంకటరత్నం అయితే 'పెద్ద రత్తి', ఎర్రగా ఉంటే 'ఎర్ర రత్తి' అని, "సత్యభామ"ను 'సత్తి' అని పిలిచేవారు. ఈ పిలుపులో ఆప్యాయత ఉండేది. ఎవరైనా పెద్దలు వారిని

అలా పిలిస్తే ఆ నర్తకులు ఎంతో సంతోషించి, ఆ కుటుంబంలోని సభ్యులయి నట్టుగా అనుకొనేవారు, వారికి గర్వంగా కూడా ఉండేది.

ఆనాటి ఆప్యాయతలు, గౌరవ మర్యాదలు, అనురాగాలు వేరుగా ఉండేవి. పండిత సభలు, విద్యకు సంబంధించిన విమర్శనలు వేరుగా ఉండేవి విమర్శలకు వారిమధ్య ఉండే అనుబంధాలకు సంబంధ ముండేదికాదు. విమర్శ విమర్శవరకే పరిమితమై యుండేది. ఇది స్నేహానికి అడ్డువచ్చేది కాదు.

విద్వాంసు లుండిన సభల్లో నాట్య ప్రదర్శన లివ్వడానికి ఈ కళాకారులు ఎంతో ఉత్సుకతతో ఉండేవారు. వారి హృదయాలు ఆ సభల్లో వికసించి నాట్య పరిమళాలను వెదజల్లేవి. వీరు ధనంకోసం పండిత సభల్లో నాట్యం చేసేవారు కారు, పండితులమెప్పుకోసం చేసేవారు. అదే వారి ధ్యేయం, ఆశయంగా ఉండేది.

ఈ కళాకారులందరూ వారి కళను ఎంతో కట్టుదిట్టంగా అభ్యసించేవారు. శాస్త్రాలను క్షుణ్ణంగా చదువుకొనేవారు. ఈ లోతైన విద్యను పండితులముందు ప్రదర్శించేవారు. అవసరమైతే వారితో శాస్త్ర చర్చ చేసేవారు. పండితులు సరస్వతీ పుత్రులే గాని లక్ష్మీపుత్రులు కారుగదా! అందువల్ల ఈ పండితులు మెప్పుగా ఒక బిరుదును ప్రసాదించేవారు. వారి ఆశీస్సులను అందజేసేవారు. ఒక గంటసేపు ఒక పదాన్ని అభినయించేటప్పుడు ఆ కళాకారిణి ఆ పదంలోని నాయికను నిరూపించి, స్థాయీ భావాన్ని నిర్ధారణ చేసి సంచారులను వికసింపజేసేవారు. అభినయాన్ని ముగించి తుదకు సభకు నమస్కరించేవారు. "భేష్! రత్నం భేష్! బాగా చేశావు" అని పండితులు మెచ్చుకొనేవారు.

ప్రత్యేకంగా ఒక పండితుని ఇంటికి వెళ్ళి ఎవరైన నర్తకి నాట్యం చేస్తే నాట్యమంతా తిలకించిన ఆ పండితుడు చివరకు "అమ్మాయీ! ఆకూ, వక్కలు, అక్షింతలూ తీసికొనిరా!" అని కేకవేసే వాడు. ఇంట్లోని అర్ధాంగో, అమ్మాయో వాటిని తెచ్చేది. ఆ పండితుడు ఆ కళాకారిణిని ఆశీర్వదించి, ఆ తాంబూలాన్ని, పండ్లను ఆమె చేతిలో ఉంచేవాడు. ఆ మెప్పుకోలుకు ఆ కళాకారిణి తన్మయురాలై ఆనంద భాష్పాలను రాల్చి, పట్టువస్త్రాలతో ఆ పండితుణ్ణి సమ్మానించేది. శుభ

కార్యాల సభల్లోను, ఇతర సభల్లోను కళాకారులు ధనాన్ని స్వీకరించేవారు. వారికి ధనం సంపాదించడం తెలుసు. ఖర్చు చేయడం గూడా తెలుసు.

కాళహస్తిలో నేను నృత్య విద్యను పూర్తి చేసిన తర్వాత మా గురువు గారు నాయుడుపేట రాజమ్మగారు నన్నొక రోజున మహాపండితుడైన పురాణం పేరి శాస్త్రిగారి వద్దకు తీసికొని వెళ్ళారు. వారి సమక్షంలో తోడి వర్ణాన్ని ఆడించారు.

ఈ తోడి వర్ణానికి నాట్య ప్రదర్శనలో ఒక విశిష్ట స్థానముంది. కేవలం స్త్రీ వర్ణనల హస్తాల్నీ, అడవులను ప్రదర్శించడమే కాక శివపూజలోని పూర్వ ముద్రలను గూడా ప్రదర్శించి అభినయించాలి. కాని వీటిని అందరికీ చెప్పేవారు కారు. ఇది ఏ కొందరికో నాలాంటి వారికి కలిగిన అదృష్టం.

ఆనాడు పేరి శాస్త్రిగారు నా ఆటను పూర్తిగా చూసి, అడవుల తిలకించి, హస్తాల పొందికను గమనించి, నాయిక పోషణ సరిగ్గా ఉందని నిర్ణయించి "భేష్! రాజమణీ! ఈనాడు ఈ బాలుని ఆటలో నిన్ను మళ్ళా చూడగలిగేను"అని మెచ్చుకొన్నారు. ఆ మెప్పుకు మా గురువర్యులు పొంగిపోయారు. నేను పరీక్షలో ఉత్తీర్ణుడ నయ్యానని గర్వించాను.

"శాస్త్రిగారూ! నా తర్వాత ఇతడే గదా! మా యింట ఈ విద్య ఎవ్వరికీ అబ్బలేదు. నా పేరు ఈ యబ్బాయి నిలబెడితే చాలు!" అని చెమర్చిన కండ్లతో మా గురువుగారు అన్నారు. "తప్పక నిలబెడతాను!" అని నా మనస్సులో నేను తీర్మానించుకొన్నాన. ఆమె మరొక శిష్యురాలు కలువాయి నాగమణి గారు గూడా ఎందరికో విద్య చెప్పి పక్షవాతంతో బాధపడి కొద్దిరోజుల క్రితం గతించారు.

ఈ విధమైన పరీక్షలు, విద్యల యెడల గౌరవ ప్రపత్తులు, పెద్దల యెడ గౌరవమర్యాదలు, కోనసీమ అగ్రహారాల్లో ఎక్కువగా ఉండేవి.

కోనసీమలో పేరూరు శివార్లలో విశ్వేశరాగ్రహారం ఒకటి ఉంది. అక్కడ అంతరూ బ్రాహ్మణ పండితులే. అక్కడ ఈశ్వరుని ఆలయముంది. ప్రతి

సంవత్సరం శివకల్యాణం సందర్భంగా అయిదు రోజులు ఉత్సవాలు జరుగుతాయి ఆ ఉత్సవ దినాల్లో ప్రతిరాత్రి మేజువాణీ జరిగేది. ఆ అయిదు రోజులు అయిదు ప్రత్యేక వర్ణాలు, పదాలు, జావళీలను నర్తకులు అభినయించాలి. ఈ ప్రత్యేక అంశాలు తెలిసినవారే ఆ ఉత్సవాలలో నాట్యప్రదర్శనలు ఇవ్వడానికి వెళ్ళేవారు. అక్కడ శ్రమ ఎక్కువ సంభావన తక్కువగా ఉండేది. అందువల్ల ఈ అంశాలు తెలిసినవారు గూడా తరచూ వెళ్ళేవారు కారు. కాని ముమ్మడివరం అన్నాబత్తుల బులివేంకటరత్నం వంశీయులు విధిగా వెళ్లేవారు.

ఈ ప్రత్యేక పదాలు, వర్ణాలు, జావళీలు ఆ అగ్రహారం వాళందరకూ క్షుణ్ణంగా తెలుసు. కళాకారుల కన్నా ముందే ప్రేక్షకులలోని ముసలమ్మలు గూడా పాడేవారు. హస్తాలను పట్టడంలో పొరపాట్లు జరిగితే వారు లేచి సరిదిద్దేవారు. అలాంటిచోట నాట్యప్రదర్శన లివ్వడం ఎంత కష్టమో మనం ఊహించవచ్చును.

ప్రతి సంవత్సరం వెళ్తున్నట్టే ఆ సంవత్సరం గూడా భరతకళా ప్రపూర్ణ అన్నాబత్తుల బులివేంకటరత్నంగారు శివకల్యాణ ఉత్సవాలకు విశ్వేశ్వరాగ్రహారం వెళ్ళారు. "ఎర్రరత్తి" వచ్చిందని ఆమెను ఎరిగిన పండితులు సంతోషించారు.

ఉద్యోగరీత్యా పొట్ట చేత్తో పట్టుకొని పై ఊర్లకు వెళ్ళిన కొందరు యువకులకు ఆమె విశిష్టత తెలియదు. నాటి నృత్య ప్రదర్శనను వారు చూడ్డానికి వచ్చారు. సినీమా నృత్యాలు చూసే ఈ యువకులకు అభినయకళ తెలియదు. నృత్య సంప్రదాయాలు తెలియవు. వారిలోని ఒక నూనూగు నూత్న యువకుడు పట్నంనుండి వచ్చినట్టున్నాడు అతడొక పట్నవాసపు హాస్య చలోక్తి విసిరాడు. అభినయం చేస్తూండిన బులివేంకటరత్నంగారి చెవిని ఆ చలోక్తి పడింది. సభలోని పండితులు ఆ యువకుణ్ణి వారించగలరని ఆమె పట్టించుకోలేదు. ఆ కుర్రవానికి ఉషారెక్కి మళ్ళా చలోక్తి విసిరాడు. అయినా అక్కడి పండితులు పట్టించుకోలేదు. దాంతో ఆ పండితుల మీద కోపంవచ్చి ఆ రుద్రగణిక తన మూడవ కన్ను తెరిచింది. తన అభినయాన్ని మధ్యలోనే ఆపి, కట్టుబట్టులతో సభలోనుండి వెళ్ళిపోయింది. పొలాలకు అడ్డంపడి అమలాపురంవైపు నడవడం మొదలుపెట్టింది. "అయ్యో! వేంకటరత్నం వెళ్ళిపోతున్నది, ఎంతపని జరిగిందని

ఏదో తెలియక అన్న ఆ కుర్రావాని మాటలకు అలిగి వెళ్ళిపోతున్నది" అంటూ కొంతమంది ఉత్సవ పెద్దలు వెళ్ళి ఆమెను బ్రతిమాలారు. ఏదో తెలియక ఆ కుర్రవాడు ఏదో అన్నాడు సరే? మీరంతా ఏం చేస్తున్నారు? అతన్ని మీరెందుకు వారించలేదు. ఈ యవమానం నాకు కాదు. నాట్యకళకే అవమానం జరిగింది" అంటూ ఆమె ప్రయాణం సాగించింది. ఇంతలో ఒక వృద్ధ పండితునికి ఈ సంగతి తెలిసింది. ఆయన ఒక రవికెల గుడ్డ, తాంబూలం, పట్టుకొని ఆమె వెంట పరుగెత్తాడు. ఆమెను ఆగమని ఆయన గట్టిగా కేకవేశాడు. ఆయన కంఠస్వరాన్ని గుర్తించి ఆమె ఆగింది. అప్పటికే వారిద్దరూ పేరూరుకి దగ్గరగా చేరుకొన్నారు.

"రత్నం! వేంకటరత్నం!! మా యింటి ఆడపడుచువు. పుట్టింటిమీద కోపం వచ్చిన ఆడపిల్లవు. వెళ్ళిపోతున్నావు. పుట్టింటి నుండి వట్టి చేతులతో వెళ్ళ గూడదు. ఈ తాంబూలం తీసికొని వెళ్ళు" అంటూ పళ్లూ, తాంబూలం, రవికెల గుడ్డా ఆమెకు ఆ పండితుడు ఇచ్చాడు.

"కళా సరస్వతికి అవమానం జరిగింది. అందుకే వెళ్ళిపోతున్నాను బాబూ!" అని కన్నీరు పమిట చెంగుతో తుడుచుకొని ఆ వృద్ధపండితుని పాదాలకు నమస్కరించి, అశ్రువులతో అభిషేకించి, వెనక్కు చూడకుండా అమలాపురం చేరుకొంది.

అంతే, మరి కొన్నాళ్ళకు ఆమె అస్వస్థురాలయింది. తర్వాత అపస్మారక స్థితిలో కొన్నాళ్ళుండి మళ్ళా విశ్వేశ్వరుని కల్యాణం జరక్కముందే ఆ రుద్రగణిక కన్ను మూసింది. రుద్రునిలో ఆ గణిక ఐక్యమయింది. అన్నాబత్తుల వంశీయుల తరతరాల నాట్యచరిత్ర ఆమెతో ముగిసింది.

"రుద్రగణిక" సమాప్తం

# భాగోతుల బుచ్చిగాడు

భాగోతుల బుచ్చిగాడు అలిగాడు. అంతకన్న ఏంచేయగలడు? దెబ్బలాడ గలడా? కోపించగలడా? పరువు నష్టం దావా వేయగలడా?

ఈ భాగవత ఆటలను ఇతరులతో బాటు సంస్కారవంతులు గూడ పూర్వం చూశారు, ఆనందించారు. సంఘానికి, సమాజానికి వీరు ఎలాంటి సేవ చేశారో ఈ సంస్కారవంతులు గ్రహించారు. కాని ఎప్పుడైనా ఒక్కసారి అంటే ఒక్కసారి ఈ కళాకారులను వారి తల్లి దండ్రులు పెట్టిన పేరుతో పిలిచిన పాపాన పోయారా? లేదు.

చరిత్ర ప్రసిద్ధిగాంచిన పెండ్యేల వంశం వారి కళాకారులను "గంగి నాగి, పెద్ది" అని పిలిచేరే గాని బాలసారె నాడు వారి తల్లి దండ్రులు ముచ్చటగా వారికి పెట్టుకొన్న పేర్లతో ఎన్నడూ వీరు పిలవలేదు. గంగారత్నం, నాగమణి, పెద్ద నాగమణి అని వారి తల్లి దండ్రులు పేరుపెడితే ఆ యూరి పెద్దలు గంగమ్మ నాగమ్మ, పెద్దమ్మ అని పిలవలేదు. సరిగదా గంగి, నాగి, పెద్ది" అన్నారు.

అంతే, ఇంకో కళాకారిణి పేరు పెద వేంకటరత్నం. ఆమెను అందరూ రత్తి' అనే వారు. ఆమె ఎర్రగా ఉండేది గనుక కొందరు "ఎర్రరత్తి" అన్నారు. ఆమె పొడుగ్గా ఉండేది గనుక మరికొందరు "పొడుగు రత్తి" అన్నారు. నల్లగా ఉంటే 'నల్ల రత్తి', పొట్టిగా ఉంటే 'పొట్టిరత్తి' అని గూడా వీరు అని ఉండేవారు. కృష్ణునికి అత్యంత ప్రియమైన భార్య సత్యభామ. ఆమె పేరు పెట్టుకొన్నారన్న గౌరవమైనా లేకుండా ఆ పేరు పెట్టుకొన్నవారిని "సత్తి" అని పిలిచేవారు.

"మానవ స్వభావం ఇంతేలే" అని ఆ కళాకారులు గూడా తెలుసుకొని నవ్వేసి ఊరుకొనేవారు.

భాగోతుల బుచ్చిగాడి సంగతి గూడా ఇంతే. బాలసారెనాడు అతని తల్లి దండ్రులు "బుచ్చి రామయ్య" అని నామకరణం చేశారు. అంత పెద్ద పేరుపెట్టి

పిలవడం ఇష్టం లేకపోతే "బుచ్చయ్య" అనో "రామయ్య" అనో ఈ పెద్దలు పిలవవచ్చు గదా? "మీసాలు గొరుక్కొని, ఆడవేషం వేసుకొని, నాలుగు రోడ్ల కూడల్లో ఆడేవాణ్ని "బుచ్చయ్యా! రామయ్యా!" అని పిలవాలా? వీడు ఎవడికి అయ్య?" అని కోపగించుకొని భాగవతుల అని కూడా అనకుండా కసిగా "భాగోతుల బుచ్చిగాడు" అని ఈ పెద్దలు అన్నారు. పాపం ఈ భాగవతుల బుచ్చిరామయ్య ఏం చెయ్యగలడు? ఏంచేయలేక అలా పిలిచినా పలికేవాడు. ఎలా పిలిచినా పలికేవాడు.

అతని పేరు వికృత రూపం ధరించినా అతడు మాత్రం చక్కని ఆడదాని వేషం ధరించేవాడు. నాలుగురోడ్ల కూడలిలో ఆడవేషం కట్టి అతడు ఒకనాడు భాగవతం ఆడుతూ ఉంటే బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు కూడా నిశ్చేష్టులై అక్కడ నిలబడిపోయేరు. అతని ప్రతిభ అంతటిది.

"హరిహరే" అనో "మహాదేవ శంభో!" అనో ఒకనాడు అతడు ఆడ వేషంలో సుక్కపట్టి ముఖారి రాగంలో పాడుతూ ఉంటే, "ఎవరిదీ ఆర్తనాదం? భూలోకంలో స్త్రీలను హింసిస్తున్నారా?" అంటూ బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు ఆ రంగస్థలం వద్దకు దిగివచ్చారు. ముందుగా విష్ణుమూర్తి చకితుడై "బ్రహ్మన్నా! నాకు తెలియకుండా ఇంత చక్కని చుక్కను ఎప్పుడు సృష్టించావయ్యా?" అని అడిగాడు.

ఆ సుందరాంగిని చూడగానే బ్రహ్మకే మతిపోయి "ఏమో నాకు జ్ఞప్తిలేదు" అని జవాబు చెప్పాడు.

"ఆనాడు నాకు మతి చలించి మోహిని వెంట బడ్డాను ఈ విషయం మానవులకు తెలుసు. పురాణాలలో చదువుకొన్నారు. అలాంటిది ఈ మానవులు ఈ చక్కని చుక్కను వదిలిపెడతారా విష్ణుమూర్తీ?" అన్నాడు భోలాశంకరుడు.

మోహిని గురించిన అసలు విషయం తెలిసిన విష్ణుమూర్తి ఆ భోలాశంకరుని మాటలు విని కాస్త సిగుపడి అలవోకగా నవ్వేడు.

ఏమైతేనేమి? ఆ ముగ్గురూ ఆమె గంధర్వగానం వింటూ, ఆ నాట్య సరస్వతిని తిలకిస్తూ నిలబడిపోయారు. వారికి తెలియకుండానే తూర్పు దిక్కు తెల్లబడింది. ఆ కేళిక ముగిసింది. అప్పుడు ఆ యూరి పెద్దిరెడ్డి "బుచ్చిగా!" అని పిలిచాడు చేతులు కట్టుకొని భాగోతుల బుచ్చిగాడు రంగులు తుడవని ముఖంతో వచ్చి ఆ రెడ్డి ముందు నిలబడ్డాడు. "బుచ్చిగా! మా బాగా పాడావు, ఆడేవు. ఇదిగో ఇది తీసికొని సంతోషించు!" అంటూ పది రూపాయలు చేతిలో పెట్టాడు.

"ఏమిటీ! వీడు పురుషుడా? నన్నే మోసగించాడే! నా మోహినీ నృత్యాన్ని మించి ఆడేడే!" అని విష్ణువు సిగ్గుతో కుంచుకు పోయేడు

"నా సృష్టికి ప్రతిసృష్టి చేశాడే ఈ భాగోతుల బుచ్చిగాడు?" అని బ్రహ్మ విశ్వామిత్రుణ్ణి జ్ఞప్తికి తెచ్చుకొన్నాడు.

"నా భరత విద్యకు మెరుగులు దిద్ది, సువర్ణానికే సువాసనలు చేకూర్చాడే ఈ బుచ్చిగాడు" అని సంతోషించాడు శివుడు.

ఈ విధంగా ఈ త్రిమూర్తుల దీవెనలను అందుకొన్నంత ప్రతిభావంతంగా తన పాత్రను ఈ కళాకారుడు పోషించాడు. ఇతడు ఎంత గొప్ప కళాకారుడైతే నేమి? చివరకు భాగోతుల బుచ్చిగాడు గానే లోకంలో గుర్తింప బడ్డాడు. ఒక్క నాడు కూడా మన కవులు సైతం ఇతన్ని బుచ్చిరామయ్యగా కీర్తించ లేదు. విసిగి పోయిన ఈ బుచ్చిరామయ్య చివరకు వేషం కట్టడం మాని వేయాలనుకొన్నాడు. కాని ఎలాగ? ఆ వేషం కట్టి ఆడ్డం అతని ఊపిరి గదా?

"బుచ్చిరామయ్యా! నా వాణి నీ ఆటను మెచ్చుకొంది. కనుక నేనైనా ఒక్కసారి 'భాగవతుల బుచ్చిరామయ్యా!" అని నోరార పిలుస్తాను. భళిరా! భాగవతుల బుచ్చిరామయ్యా!"అని పిల్చాను. దేవతలు గూడా సంతోషించి "తథాస్తు!" అన్నారు. బుచ్చిరామయ్య ఆనందానికి అంతులేక పోయింది.

ప్రఖ్యాత నవ జనార్దన కళాకారిణి పెండ్యేల సత్యభామకు ఒక అక్క ఉండేది. ఆమె పేరు నాకు తెలుసు గాని ఆమె ప్రఖ్యాతి వహించలేదు గనుక మీకు చెప్పడం అనవసరం.

వీరి పూర్వులు పెద్ద లోగిలి కట్టించారు. ఆ లోగిలికి పెద్ద వాకిలి ఒకటుంది. చిన్న పిల్లల నడుము బాగా సాగాలని ఆ యింటి పెద్దలు ఈ పిల్లల్ని రెండు జట్లుగా చేసి రోజూ రెండు పూటలా ఆ వాకిల్ని తుడిపించేవారు. వాకిల్ని తుడిచిన తర్వాత ఒక్కొక్క పిల్లా రెండు వందల బస్కీలు తీయాలి. తర్వాత సాము చేయాలి.

వాకిలి తుడవాలంటే సత్యభామకు చికాకు. బస్కీలు తీయడమంటే ఆమె అక్కకు బద్ధకం. అందువల్ల ఒకసారి అక్క "సత్యం! నీ వంతు వాకిలి నేను తుడుస్తాను, నా వంతు బస్కీలు నవ్వు తీస్తావా?'' అని చెల్లెల్ని అడిగింది. "ఓ" అంటూ ఎగిరి గంతేసి సత్యభామ ఒప్పుకొంది. ఆ చిన్నపిల్లలిద్దరూ ఈ ఒప్పందానికి వచ్చి, అలాగే చేశారు. ఇలా కొంతకాలం జరిగింది. చివరకు సత్యభామకు సరస్వతీదేవి ప్రసన్నమయింది. అందువల్ల సత్యభామ ప్రఖ్యాత నవజనార్దన పారిజాత కళాకారిణి అయింది. అక్క మాత్రం వాకిలి తుడవడంలో నిపుణురాలయింది. సత్యభామ జీవితాంతం నృత్య కళలో మునిగి తేలితే ఆమె అక్క జీవితాంతం వాకిలి తుడుస్తూనే కాలం గడిపింది.

ఇది కట్టు కథ కాదు. యదార్థ గాథ.

# మీరు చదవదగిన గ్రంథం
# నవజనార్ధన పారిజాతం

సుమారు నాలుగు వందల సంవత్సరాల క్రిందట ఆంధ్రుల సాంస్కృతిక చరిత్రలో ఇద్దరు యక్షగాన ప్రదర్శకులు ఉండేవారు. వారిద్దరూ ప్రసిద్ధిగాంచిన కళావేత్తలు శ్రీనాథ సార్వభౌము డంతటి వానినే తమ కళా నైపుణ్యంతో మెప్పించారు, వారిద్దరూ అక్కచెల్లెళ్లు వారి పేర్లు పెండ్యేల నాగమణి, పెండ్యేల గంగారత్నం ఆనాటి పండితులు, కళాకారులు వారిద్దర్ని పెండ్యేల నాగి, గంగి అని ముచ్చటగా పిలిచేవారు.

పెండ్యేల వంశీయులు సుమారు నాలుగు వందల సంవత్సరాల పాటు పిఠాపురంలో వెలిసిన కుంతి మాధవునికి అంకితంగా, ఆయనకు చేసే సేవలో ఈ పారిజాత ప్రబంధాన్ని ప్రదర్శిస్తూ వచ్చారు.

పూర్వం కలాపాలను పారిజాతా లనేవారు. ఇవి దేశీయ సంగీత నృత్య ప్రబంధాలు. వరుసగా తొమ్మిది రాత్రిళ్ళు ఏకధాటిగా ఈ పారిజాత ప్రబంధాన్ని ఒకే నర్తకి ప్రదర్శించి, పదవనాటి రాత్రి భాగవతంలోని దశమ స్కంధ పారాయణతో ముగించేది. అందువల్ల దీనికి నవజనార్ధన మన్న పేరు వచ్చింది.

మాండవ్యపురం (మండపేట) పట్నం చుట్టు ప్రక్కల తొమ్మిది జనార్ధన స్వామి ఆలయా లున్నాయి. ఈ తొమ్మిది ఆలయాల్లోను ఆ దైవ సేవలో ఈ పారిజాతం ప్రదర్శింపబడేది గనుక దీనికి నవజనార్ధన మన్న పేరు వచ్చిందని కూడా అంటారు.

తొమ్మిది మంది సత్యభామ వేషధారులు వారి వారి బృందాలతో, ఒకరి తర్వాత ఒకరు దీనిని ఒకే రంగస్థలంపైని ప్రదర్శించేవారు. అందువల్ల గూడా దీనికి నవజనార్ధన మన్న పేరు వచ్చింది. ఈ విధంగా సుమారు వందమంది కళా

కారులు తొమ్మిది జట్లుగా మూడుసార్లు ప్రదర్శించినట్లయితే ఒక యజ్ఞం చేసినంత పుణ్య కార్యంగా ఆ రోజుల్లో భావించేవారు. ఈ శతాబ్ది ప్రారంభంలో ఇటువంటి కేళికలు రెండు సార్లు జరిగాయి మండపేటలో సంగీత సరస్వతి దుగ్గిరాల మాణిక్యం అనే ప్రసిద్ధ నర్తకీమణి ఉండేది. ఆమె ఆధ్వర్యంలోనే ఈ రెండు కేళికలూ జరిగాయి. మూడవ ప్రదర్శన జరగకుండానే ఆమె చనిపోయింది. ఆ యజ్ఞం నేటికీ అసంపూర్ణంగానే ఉంది.

భాగవతాల ఆటకు కూచిపూడి వారు ప్రసిద్ధులైనట్లే నాలుగు దశాబ్దుల క్రితం వరకూ (కళావంతుల సంస్కరణోద్యమం ప్రారంభమయి నంత వరకు) కలాపాల ఆటకు, కర్ణాటక కచ్చేరీ ఆటకు మండపేట స్త్రీ కళాకారులు ప్రసిద్ధులు. ఆ రోజుల్లో మండపేటను మాణిక్యంగారి మండపేటగా చెప్పుకొనేవారు. అంత ప్రసిద్ధి గాంచిన సంగీత సరస్వతి ఆమె.

పిఠాపురం ఒక పురాతన జమీందారీ మాత్రమే కాదు. అదొక పవిత్ర యాత్రా స్థలం. కుక్కుటేశ్వరుడుగా పరమశివుడు ఇక్కడ వెలిశాడు. ఆ శివునికి అలంకార మన్నట్లు ఏలానది ఈ పట్నం మధ్య నుండి ప్రవహిస్తూంది అష్టదశ శక్తి పీఠాల్లో ఒకటైన పురుహూత పీఠం ఇక్కడ వెలిసింది పంచ మాధవుల్లో ఒకడైన కుంతీ మాధవుడు ఇక్కడే వెలిశాడు పిఠాపుర సంస్థానాధీశులకు ఈ కుంతీ మాధవుడు ఇలవేల్పు. ఈ దేవునికి కైంకర్యంగా ఈ నవజనార్దన పారిజాతం రచింపబడి, పెంపొంది, ఈ దేవుని సేవలో ప్రదర్శింపబడుతూ ఉండేది. నాలుగు వందల సంవత్సరాల పాటు పెండ్యాల వంశీయులు ఈ గ్రంథాన్ని ప్రదర్శిస్తూ వచ్చారు.

ఈ కళను పోషించిన పిఠాపురం మహారాజులలో ఆఖరి భక్తుడు శ్రీ రావు గంగాధర రామారావుగారు. ఈ పారిజాతాన్ని ఆ కుంతి మాధవుని సేవలో ప్రదర్శించిన చివరి కళాకారిణి శ్రీమతి పెండ్యాల సత్యభామ. సుమారు డబ్భై సంవత్సరాల పాటు ఈ పారిజాతాన్ని మాధవుని సేవలో ప్రదర్శించి తరించిన మేటి కళాకారిణి ఈమె. ఈమె తన అమ్మమ్మగారైన శ్రీమతి పెద్ద సత్యభామగారి వద్ద ఈ కళను అభ్యసించింది.

డాక్టర్ నటరాజ రామకృష్ణగారు తమ పరిశోధనా పర్యటనలలో వృద్ధ కళాకారిణి యైన పెండ్యేల సత్యభామ గారిని కలిసికొనడం జరిగింది. ఈ నవ జనార్దన పారిజాతం విశిష్టతను ఆయన తెలుసుకొన్నారు. ఆ విద్య ఆమెతో అంతరించిపోకూడదనే పట్టుదలతో ఆయన ఈ విద్యను ఆమె వద్ద నేర్చుకొని ప్రదర్శన లిచ్చారు.

తరతరాలుగా తమ వంశీయులు పూజామందిరంలో భద్రపరిచి పూజిస్తూ వచ్చిన ఈ నవజనార్దన పారిజాత తాళపత్ర గ్రంథాన్ని శ్రీమతి సత్యభామగారు డాక్టర్ రామకృష్ణ గారికే ఇచ్చివేశారు. అందులోని కొన్ని భాగాలను ఒక గ్రంథంగా రామకృష్ణగారు ప్రచురించారు.

సత్యభామ స్వీయ నాయిక, సాధ్వి, స్వాధీనపతిక, ప్రగల్భ, సౌందర్య గర్విత, నరకాసురుని సంహరించిన వీర క్షత్రియ వనిత. ఇన్ని గుణాలను ఒప్పించే పాత్ర పోషణ ఉంటేగాని ఈ నాయిక పాత్ర రంగస్థలం పైని రాణించదు.

ఆ హుందాతనం, ఆ దర్పం, ఆ ఠీవి మొదలైనవన్నీ పోషించదగ్గ రూపం పాత్రధారునికి ఉండాలి ఇవన్నీ కలవాడు చిరంజీవి కళాకృష్ణ, ఆంధ్రుల అల్లారు ముద్దుల ఆడబిడ్డ ఈ సత్యభామకు తగినవాడు. అందుకే ఈ ప్రబంధాన్ని డాక్టర్ రామకృష్ణగారు అతనికి అయిదు సంవత్సరాలపాటు నేర్పారు సంప్రదాయం ఎక్కడా చెడకుండా, నేటి రంగస్థలానికి సరిపోయే రీతిని కొత్త పాతల మేలు కలయికతో డాక్టర్ రామకృష్ణ ఈ కలాపాన్ని రూపొందించారు.

పూర్వం భాగవత కళాకారులు 'గణియం' చెక్కతో చేసి, బంగారు పూత పూసిన ఆభరణాలను ధరించి ప్రదర్శనలు ఇచ్చేవారు, కాని శ్రీమతి పెండ్యేల సత్యభామగారు మాత్రం అసలైన బంగారు నగలనే ధరించి ఆడేవారు

కళాకృష్ణ గత మూడు సంవత్సరాలుగా మాత్రమే యీ పారిజాతాన్ని ప్రదర్శిస్తున్నా, ఇప్పటికి మూడువందల ప్రదర్శనలకు మించి ఇచ్చాడు. తొమ్మిది రాత్రుల గ్రంథాన్ని సంపూర్ణంగా ఆడగల కళాకారుడు నేడు ఇత డొక్కడే. ఈ విద్యలో ఇతడు నిష్ణాతుడు. అలనాటి ఆ సత్యభామ లాగ యీ కళాప్రదర్శనాల తోనే తన జన్మ తరించాలని ఆశిస్తున్న కళాకారుడు కళాకృష్ణ.

ఈ పారిజాతంతో పాటు గొల్లకలాపం, ఆధ్యాత్మ రామాయణం, ఆంధ్ర నాట్యం గూడా ఇతడు అభ్యసించి, చక్కగ ప్రదర్శిస్తున్నాడు.

భరత విద్య, అభినయ కళల సారమే యీ నవజనార్దన పారిజాతం. శ్రీ కృష్ణ సత్యల ప్రణయ కలహాన్ని, పడకటింటి చిన్ని ముచ్చటను, విరహ వియోగాన్ని వర్ణించే ఒక శృంగార ఘట్టమే యీ నవజనార్దనం.

ఈ కలాపాన్ని చూడడం, పండితులకు రసలోక విహారం కళాకారులకు పరీక్ష, సామాన్య ప్రేక్షకులకు విజ్ఞాన విందు. ఈ గ్రంథాన్ని మీరు తప్పక చదవండి.

# ఆంధ్రప్రదేశ్‌లోని 'ఆంధ్రనాట్యం' పాఠశాలలు

1. నటరాజ నృత్యనికేతనం, విశాఖపట్నం
2. నటరాజ నృత్యనికేతనం, నరసీపట్నం
3. నటరాజ నృత్యనికేతనం, కాకినాడ
4. నటరాజ నృత్యనికేతనం, పిఠాపురం
5. శ్రీ నటరాజ నృత్యనికేతనం, రాజమండ్రి
6. ఆంధ్రనాట్య పీఠం, విజయవాడ
7. శ్రీ గిరిజా నృత్యనికేతనం తెనాలి
8. నటరాజ నృత్యనికేతనం, గుంటూరు
9 నటరాజ నృత్యనికేతనం, టంగుటూరు
10. నటరాజ నృత్యనికేతనం, బిట్రగుంట
11. నటరాజ నృత్యనికేతనం, కర్నూలు
12. నటరాజ నృత్యనికేతనం, ద్రోణాచలం
13. నటరాజ రామకృష్ణ నృత్యనికేతనం, గద్వాల
14. నృత్యనికేతనం, హైదరాబాదు
15. నృత్యాంజలి, హైదరాబాదు
16. నటరాజనికేతన్. హైదరాబాదు
17. పేరిణీ డాన్సు స్కూలు, హైదరాబాదు
18. నటరాజ నృత్యనికేతనం, సంగారెడ్డి
19. శ్రీ నటరాజ రామకృష్ణ నృత్యనికేతనం, సిద్దిపేట
20. నటరాజ నృత్యనికేతనం, సిరిసిల్ల
21 కళాభారతి, నిజమాబాదు
22. కళాభారతి, బోదన్
23. కళాభారతి, కిసాన్‌నగర్
24. కళాభారతి, ఆర్మూర్
25 శ్రీ రాజరాజేశ్వరీ నృత్యనికేతనం, వేములవాడ
26. ఊర్వశీ కళా స్రవంతి, కరీంనగర్
27. నటరాజ నృత్యనికేతనం, గోదావరిఖని
28. కోఆమ్ స్కూలు, ఉట్నూరు
29. పేరిణీ ఇంటర్ నేషనల్, హైదరాబాదు

# రుద్ర గణిక

## చిత్రాల వివరణ

1. **ముఖ చిత్రం.**

కుంభహారతితో భగవంతుని ఆరాధిస్తున్న దేవనర్తకి. ప్రాచీన ఆలయ సంప్రదాయాన్ని అనుసరించి ఈ నర్తకి వస్త్రధారణా, ఆహార్యం రూపొందిచబడినాయి

2. ప్రాచీన కాలంలో సంధ్యపూజ ముగిసిన తర్వాత శివాలయాల్లో పూజా పుష్పంగా శివునికి అత్యంత ప్రీతికరమైన భుజంగ త్రాస నర్తన విన్యాసాన్ని దేవనర్తకి ప్రదర్శించడం ఆచారంగా ఉండేది. శివుని 108 కరణాలలో ఈ భుజంగ త్రాస నర్తనం విన్యాసం చాలా ప్రసిద్ధమైంది

3. **అట్టలోపలి చిత్రాలు**

1. ఆంధ్ర ప్రదేశ్‌లోని 23 జిల్లాలలో గల ఆలయ, ఆస్థాన, పారిజాత నర్తన రీతుల్ని వివరించే చిత్రాలు.

2. ఆంధ్ర ప్రదేశ్‌లోని 23 జిల్లాలలో గల జానపద, గిరిజన నృత్యరీతుల చిత్రాలు.